శ్రీ రామ జయము

# శ్రీ విద్యారణ్యాచరితము



రచన

బోధాక్షేందు - కవిత్వవేది;

ఏ. యస్. ఆర్. కల్లూర్. M. A., L. T.

మూల్యము

రు. 2-25 న.పై.

## ఈ కవిచేతనే వ్రాయబడిన "శాంతిసమ్రాట్టు అశోకచరిత్రము"పై

## ఆంధ్రకవుల అభిప్రాయములు

**I శ్రీ జోస్యం జనార్దనశాస్త్రి** - విద్వత్కవి, తాడిపత్రి.

అల భట్టారకుఁ డాధ్వరంబుఁగొని, యన్వాధానముం జేయ, సోం
పరలన్, సొంతము సోమయాజులు, స్వయం బ్రహ్మత్వముం
బూన, హో
తలు, నుద్గాతలు, నేష్టృపోతృ చమసాధ్వర్యాది, ఋత్విగ్గణో
జ్జ్వల రూపాల, మహాకవుల్, బహువిధచ్ఛందః ప్రయోగంబులన్
జెలువుం గూర్పఁ బరశ్శతాబ్దముల విచ్ఛిన్నంబుగా సాగు, ని
ర్మల విజ్ఞానపు టాంధ్రవాఙ్మయ హవిర్యాగంబు మధ్యంబునన్
లలితామోద విశిష్ట సంస్కృత పురోడాశంబు, నిర్వాణపి
చ్ఛిలసాన్నాయ్య మిళోపహూతమిదిగో "శ్రీశాంతిసమ్రాట్టు" కా
వ్య లలామంబు, "కవిత్వవేది" - నవ "బోధాత్మ్యే" శ్రుతం బెల్ల ర
ఘ్మాలు! హావించి పవిత్రభావనల సద్యో నిర్వృతిం గాంచుఁడీ! 1

పటువేగార్భట శబ్దయుక్తి యుతముం పావిత్ర్య సంధాయక
స్ఫుట వర్ణోజ్జ్వల శాంతగర్భ మమృతీభూతంబు, కల్హారు వేం
కట నారాయణ తీర్థపాద హిమవద్గంభీర వాగ్గుంభనో
ద్ఘట గంగాఝరి తన్వుగాక నిఖిలాంధ్రక్షోణి నేవేళలన్ 2

నిండినకుండ, పాండితి గణించిన మేటి కవిత్వవేదివై
యుండి, నిరీహభావముననో, రచనారతి లేకయుంటి, వే
యండనొ; వ్రాయబూని తిటు లాంధ్ర రసజ్ఞుల భాగధేయమే
పండెను నేటి కోసుకవి! వందన మీ రచనాభిలాషకున్. 3

**II. శ్రీ జి. జాషువ** - మహాకవి, మద్రాసు.

విద్యమాన యుగంలో మహాకావ్య సృష్టి స్వల్పం. ఇం

కావ్య మీకొంత తీర్చింది. ప్రాచీనార్వాచీన మహాకవుల ప్రాగల్భ్యం, మీ కావ్యంలో అడుగడుగునా గోచరిస్తూ పఠితల్ను ఆశ్చర్యమగ్నుల్ని చేస్తున్నది. నన్నయలు, తిక్కనలు, పెద్దనలు, తిమ్మనలు, వీరిమీద కృష్ణరాయల ఆధిపత్యం కలిగిన, ఒక మహాకవి సమావేశాన్ని తలపింపజేస్తూ, మీ ప్రతిభను, ఎలుగెత్తి చాటుతూ యున్నది. రాయలసీమకు మీకావ్యం కీర్తి కిరీటాన్ని కీలించగలదనడం అత్యుక్తి కాదు! గ్రాంథిక సంస్కృత సమాసాలకు, తెలుగు నుడికారాలకు మీ గ్రంథము కాణాచి. మీకు దీర్ఘాయు వగుగాక!

**III శ్రీ తుమ్మల సీతారామమూర్తి** - మహాకవి, అప్పికట్ల.

మీకృతి సశోక చరితా
ఖ్యాకను జేకొంటి, మదిని హర్షించితి, నాం
ధ్రీ కంఠాలంకృతియై
యాకల్పము నిల్చు సృష్టియని యనుకొంటిన్.

**IV శ్రీ పి. శ్రీరాములురెడ్డి** - మహాకవి, చిత్తూరు.

అశోకచక్రవర్తి పవిత్రచరిత్రము, మీ కలమున సువర్ణలిఖిత మగుట సమస్త కవి పండితపామరులకు గౌరవపాత్రమైనది. మీశైలి సుగమమై యేకధారగా ప్రవహించినది. అనర్గళ గంగాప్రవాహము.

**V శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి** - మధురకవి, కల్యాణదుర్గం.

సత్కవితా పిపాసువులకు, సత్కార్యాచరణ పరాయణులకు, మీ 'శాంతిసమాప్తి' ఆదర్శప్రాయమై, అచిరకాలమున, ఆంధ్ర సాహిత్యప్రపంచమున విజయకేతన మెత్తి విజ్ఞుల మెప్పింపగలదు. పోతనగారి శబ్దమంజులత, నాచనసోముని నవీనగుణములు మీ రచనలో జీవము పోసుకొన్నవి.

# శ్రీ విద్యారణ్య చరితము - పీఠిక

## (పంపాభారతము - ఆది సభా పర్వములు)

ప్రతిభా విలసితులు, ఆంధ్రాంగ్ల సంస్కృత పాండితీసమన్వితులు, విశ్వ చారిత్ర వితత మతధర్మ విశదకర్మ బ్రహ్మవిజ్ఞానఖనులు, విశేషించి కపట మెఱుఁగని కర్మయోగులునగు కల్లూరి వేంకటనారాయణరావుగారి విచిత్ర సృష్టి యగు, ఈ పంపాభారతము, వారి భావానుభూతులను బహిర్గతముచేయు, ఆదర్శమై యున్నది. విద్యానగర సామ్రాజ్య సంస్థాపన మూలపురుషులగు, విద్యారణ్యుల పవిత్ర చరిత్రమై, గద్య గేయ పద్యాకృతులతో నొప్పు, ఈ పంపాభారత స్రవంతి — పాండితీ చారిత్ర సంస్కృతులు ప్రతిఘట్టమునందును, ప్రతిధ్వను లీనుచుండ — మూఁడు పాయలుగా బ్రవహించునదై — నిరర్గళ గమన వేగమున నిర్గమించు, త్రిపథగ ననుకరించుచున్నది.

ఫేననిభములగు ధర్మవిధులు సూత్రరూపమున, సూటిగ హృదయమును జుట్టివైచు, వచనరచనమునఁ గూర్పఁబడును. వీచికల యుపరితలమున, బారలు, విషయ సంఘర్షణములు, అందు జనించు మధురభావములు, చలనచిత్ర ప్రదర్శనమువలెఁ, దాత్కాలిక ప్రబోధాత్మకముగ వెలయుచు లలిత మధురమగు గేయరచనమున నిబంధింపబడియుండును. అశేష శేముషీగమ్యము లగు, దివ్యరత్నములు తోడినకొలఁదియు ఊరు నమృతధారలు అక్షయమగు సువర్ణకవితా పద్యపాత్రములందు గుప్తపరుపబడి యుండును. ఈ మూఁడు నడకలను, ఆత్మీయముగాఁ జేసికొన్న ఈ చారిత్రకరచనము, ఆయాయి అధికారులను, ఆయా స్వరములతోఁ బిలుచుచున్నదిగాఁ దోఁచును. విమల భావ రత్నములు, వీరి లేఖిని నాశ్రయించి ప్రకాశించినవి.

"ఏకదీక్షతో కొండచివరికి చేరి, పైకేగు తెరువును ప్రకటించియు, నిగర్వియై తోడివారల నంద చేసుకొనువాఁడే ధీరోదాత్తుఁడు" అని యీ కృతియందుఁ జేర్కొనఁబడినది. ధర్మరక్షకులగునట్టి ధీరోదాత్తుల యాదర్శ చరిత్రములను కళాఖండములుగా వెలయించుటచే జాతికి, భాషకు, ఎంతయో మేలు చేకూరఁగలదు.

ధర్మస్య స్థితయే త్యాగ మపి సర్వస్య కుర్వతః
మహాధీరస్య తేజాంసి, వసేయుః పురతో మమ.

అనంతపురం } డా॥ తంగిరాల వేంకటనారాయణశాస్త్రి M.A,Ph.D
9—5—59 } భాషా ప్రవీణ

---

## ఆదిపర్వముపై అభిప్రాయము

శ్రీ కల్లూరి వేంకటనారాయణరావుగారు ఆంధ్ర వాఙ్మయమునకు చిరపరిచితులు. వారు రచించిన పంపాభారతమున నాదిపర్వము వాఙ్మయమందలి పలుపోకడలకు స్థానమై, యుత్తమస్థాయి నందుకొన్నది. అం దాది ఖండము శ్రీ మాధవ విద్యారణ్యకృత జీవన్ముక్తి వివేకమునకు వ్యాఖ్యాన సదృశమైనది. విషయము నీతిబోధకము, తత్త్వ ప్రతిపాదకమునగుటచే నీరసముగా నుండవలసినది కాని, రచయితకు గల సహజ చమత్కార వాక్య విన్యాస సామర్థ్యముచే రసవంతమై యొప్పినది.

ద్వితీయఖండ గేయ భూమికయందు, ప్రపంచమందు బయల్వెడలిన విప్లవములలో ముఖ్యములగు పరాసు రష్యా విప్లవములకు, నాధ్యాత్మి కాను భూతితో సమ్మిళితమగు భారతీయ విప్లవమునకు గల యంతరము చక్కగా వివరింపబడినది. మానవక్షేమమునకు, సుగమము, ననుసరణీయము నగు మార్గ మిందు సూచింపబడుటచే మనోజ్ఞమై యున్నది.

తృతీయఖండ మాంధ్రేతిహాసలహరి. ఇయ్యది, ఆంధ్రచరిత్రయందలి ఘట్టముల, పద్యాత్మక సంగ్రహ స్వరూపము.

ఏ రచనాపద్ధతి నవలంబించినను, సమర్థముగా సాగు శక్తి శ్రీ వేంకటనారాయణరావుగారి లేఖినికి గలదు. శ్రీ పంపాభారత మాంధ్రులకు గర్వ కారణమగు కావ్యమై వెలయగలదు.

వికారి వసంతము } విద్వాన్ శ్రీ ఎన్.ఏ. నారాయణరావు BA,B.O.L.
అనంతపురము } శ్రీ సాయిబాబా నేషనల్ హైయర్ సెకండరీస్కూలు
ప్రధానపండితుడు.

# శ్రీ విద్యారణ్యచరితము (పంపాభారతము)

షట్పది:- శ్రీ వాణీవల్లభముఖ
సేవిత సౌశీల్యపూత! సీతానాథా!
నీవంటి భూపుఁ డెటఁ గలఁ
డీవే కైకొమ్ము - కావ్య మియ్యది - పెరిమన్
నీ వాక్కు లమోఘములై
పావనయశ మొందె "రామబాణము"లనగన్.

విద్యాపుర పంపాభారత సృష్టికి
మాధవ విద్యారణ్యుల తపస్సును ;
నవభారత సిద్ధికి గాంధీ సత్యాగ్రహమును,
సుభాషు విక్రమమును ;
విశాలాంధ్ర నిర్మాణాద్యంత కాలములో
పొట్టి శ్రీరాముల త్యాగమును ;
మహాజన సేవకు దోడుగా
శ్రీ బూర్గుల రామకృష్ణారాయ కృషియును ;
సంతరించినట్టి, సవితృమండలాంతర్వర్తి
శ్రీ లక్ష్మీనారాయణాభిన్న

## శ్రీ జానకీరాములకు

భక్తిపూర్వకముగ అంకితము.

ఓం తత్ సత్

# పంపాభారతము — విద్యారణ్యచరితము

## ఆది సభా పర్వములు

## విషయసూచిక


| | | పుటలు |
|---|---|---|
| 1. | ఆదిపర్వము — ఆదిఖండము (తత్)<br>విద్యారణ్యుల యుపదేశములకు ఆధునిక వచన సమన్వయము | 1—31 |
| 2. | ఆదిపర్వము — ద్వితీయఖండము (స) శాంతి సందేశము<br>విద్యారణ్యోదయమువరకు, చారిత్రకీయ సింహావలోకనము | 49 |
| 3, | ఆదిపర్వము — తృతీయఖండము (వి) ఆంధ్రరాజ్య<br>ఆంధ్ర వాఙ్మయోదయ, వికాసముల సంక్షిప్త చరిత్రము | 69 |
| | ( సభాపర్వమునకు మున్నుడి — ఆశీస్సు ) | 70—72 |
| 4. | సభాపర్వము — ఆదిఖండము (తుర్) కథకుడగు<br>బ్రహ్మానంద యతి వృత్తాంతము — విద్యారణ్యోదయము,<br>పూర్వాశ్రమము పంపాక్షేత్ర చరిత్రము | 1—23 |
| 5. | సభాపర్వము — ద్వితీయఖండము (వ) మాధవ<br>విద్యారణ్యుల తపస్సు — జంబుకేశ్వర పాలన సమాప్తి<br>హరిహర బుక్కరాయలు హంపికి వెనుదిరుగుట | 24—46 |
| 6. | సభాపర్వము — తృతీయఖండము (రే) విద్యారణ్య<br>సాయనులు, హక్క బుక్కరాయలకు తోడై, దీక్షనొసగుట<br>విద్యానగర నిర్మాణము — సామ్రాజ్యారంభము | 47—70 |
| 7. | సభాపర్వము — చతుర్థఖండము (ణి) హక్కరాయలు<br>విద్యారణ్యులచే వేదభాష్య సభారంభము — కాశీయాత్ర—<br>బుక్కరాయల పరిపాలనము — విద్యారణ్యుల ప్రస్థానము | 71—95 |
| 8. | సభాపర్వము — పంచమఖండము (యం) వేదోక్తమగు<br>సంధ్యావందన కనువాదము — చిమణాజీ, బుడతకీచుల<br>ఓడించుట — శుద్ధపత్రము | 96—128 |
| 9. | పరిశిష్టము — వెన్నుడి ; కావ్యసమీక్షలు | 201—212 |

శ్రీరస్తు

# పంపా భారతము — ఆదిపర్వము

## ఆది ఖండము

శ్రీకరమై, సుధాంధస వశీకరమై, సువివిక్తచింతనో
త్సేక వికస్వరాత్మ సుమ, సిద్ధకళోల్లసిత ప్రభాత శో
భాకరమై, సమీహిత శుభప్రభవోత్తరమై, సుసాధు ర
క్షాకరమౌ, పరాత్పరమహాస్సిదు, మాకు నభీష్ట సిద్ధులన్.

("పరులకల్మికి, పొల్లియేడ్చే పాపి కెక్కడ, సుఖం కద్దోయ్?
ఒకరిమేల్, తనమేలనెంచే నేర్పరికి, మేల్ కొల్లలోయ్."
— శ్రీ గురజాడ వాణి.)

నాంది:—

ఓం తత్స వితుర్వరదే!
ప్రాతస్స్మరణీయ! యనుచు, ప్రాబల్యాల సు
ద్గీతారవముల భూసురు
లే తేజంబును గొల్తు రదియు నిచ్చు శుభంబుల్.

1. శ్రీవలెనే జ్యేష్ఠాదేవియు చంచల. నేటి శ్రామికులు, దీనులు, విశలులు, మరునాడు కాలమహిమచే, యజమానులు, భాగ్యవంతులు, సాకల్యులు గావచ్చును. ఉపాధి భేదమే, కరుణాదులకు పాత్రీభూతమగుచున్నది. ఈషణత్రయ దుస్స్వార్థములను, బూర్తిగా విడిచిన మానవులు, స్వల్ప సంఖ్యాకులేయగుట నెందటి దోసగులపైన, మన మావేశపడవలెనో?

2. ఆవేశపడినచో ఆరాటమే కాని, అవకతవకలు మాడిపోవు. అందరుజీవులు నవాదినుండియు ఆనందముమాత్రమే ఆశించుట సహజవృత్తి. ఆస్వాద

నానంతరి మానంద మొకటియే యైనను, ఆశించునప్పు డది యనేక రూప ములతో నవతరించుచున్నది. ఏకమనేకమై, పర్యాప్తమై, సుఖ, సంతోష, పుష్టి, తుష్టి, కీర్తి, భోగ, జయ రసాదులతో, భిన్నభిన్న రూపములతో, నైహికముగా నవసరమగుచున్నది.

3. ప్రతి యొకరికి నావశ్యకమగు దానిని, తనకే లేదనికాని తన కొక్కనికే వలయునని కాని, యావేశపడనేల? దాని లేనప్పు డాశించుట న్యాయమే! ఆశించి యితరులకు లేకుండ చేకొనుట యాసురమగు పశువృత్తి. చతు ర్విధోపాయములతో ప్రయత్నించి, సాధించి, ఇతరులతోపాటు, తానును, అనుభవించుటయే మానవత్వము !

4. ఆశ, ఆశించినదానికై ప్రయత్నము, ఫలావాప్తి ఇతరులట్లు, తత్సుఖాను భవముచే తృప్తి, మానవతకు సహజమైన లక్షణములు. అదియే సుస్వా ర్థము ! సుస్వార్థమునుమీరి కేవలము పరార్థైకోప జీవియగునాడు, మాన వుడు దేవతలలోనివాడు ! అతడాదర్శపురుషుడు.

5. ఆదర్శపురుషు లుత్తములు. ఉచ్చస్థితి నున్నను అధోముఖు లాశాసాంద్ర తచే పరాపకారులైన దండనీయులే ! అట్లుగాక, పరస్పరాశ్రయమగు సుఖము నితరులతోపాటు, తమకు నచ్చిన వైయక్తికరీతి నాస్వాదించుచు, పొరుగువారల పుణ్యగతి కడ్డుతగలనివారే మానవులు !

6. తమకు భోగములకు వలయు సాధనములు (భూమి, నౌకరి, ధనము, బలము, ఆశ్రయము, అధికారము, మేధస్సు మొదలగునవి) సేకరింపవలెను. కాని తమ కుపకరించునట్లే సేకరింపవలెను ! ఎక్కువ లభ్యమగుచో లేనివారి కది పంచవలెను. పంచనిచో, లేనిప్రజలు దానిని నిర్బంధించి తీసికొనుట సమంజసమే యగునుగదా !

7. ఇతరులనుండి వారికడ నెక్కుడుగ నున్నదానిని తీసుకొనుటలో వారికే లేకుండ చేయరాదు ! వారిని కాయిక వాగ్రీతుల హింసింప నవసరములేదు!

మానసికముగా వారు లోభులగుటచే నొప్పిపడుదురు ! వారిలోభమే, వారి మనస్సులో వ్యాప్తమై, ఎసరుబెట్టిన నీటిని, పాపకుండు, భాండముతో గూడ కాల్చినట్లే, వారిని కష్టపెట్టుచున్నది.

8. పతిత భోగానుభవముచే, పాపులైనవారి, పాపమే, శిక్షార్హము కాని పాపముచేసిన వ్యక్తులు చరమ శిక్షార్హులు కారు. కావున మరణదండనము, పాప పరిహారమునకు, ప్రాయశ్చిత్తము కానేరదు. పాపవ్యక్తికి, వ్యక్తి స్వాతంత్ర్యము నడిగించి మానవసంఘమునుండి వేఱుపఱచియుంచుటే శిక్ష. మానసికముగ పరివర్తనకల్గి, మరలి, పాపి, మనుష్యతనొందుటయే, శిక్షాభిప్రాయము కాని, ప్రతిహింస లక్ష్యము కాకూడదు !

9. మరణదండన విధించుటచే, మానవుని పరిణతిని మానవుడే యడ్డగించిన వాడగును. మానవునికన్న వేఱగు ధనాదులు పరిహరణీయములే కాని మానవుని ప్రాణము, హరణీయము కాదు. అట్లే మానవ సౌఖ్య సౌందర్య మానవాగ్విలసనములు ! వాగ్విలసనమే స్వాభిప్రాయ ప్రకటనము !

10. స్వీయప్రాణము, స్వీయ సౌందర్య సౌఖ్య మానములు, స్వీయ వాగ్రీతి యనునవి ప్రతి మానవునకు స్వకీయములు. వీనికి నైయక్తికరక్షణ యుండ వలసినదే. ఒరులకు వీనిని హరించు, లేక బలాత్కరించు హక్కు లేదగుటు, తద్వినియోగములో, పరపీడ కానట్లు వర్తించుట ప్రతివ్యక్తికీ విధి ! ఇదియే మానవత్వ మహాకృతిలో నాగరకతా ప్రథమలక్షణ వ్యంజకమగు నాదిమ సూత్రమై యున్నది.

11. ఈ సూత్రము సృష్ట్యాదినుండి సిద్ధమైనది. ప్రతివ్యక్తికి గల ప్రాణ వాక్సుఖ సౌందర్య మానములు ప్రత్యేకరూపములతో, సృష్టిలో వ్యక్తము లగుచున్నవి. ప్రత్యేకత, ప్రత్యేకతలో నైక్యత, ఐక్యతలో భిన్నత, భిన్నతలో మరల పూర్ణత, యనునవి అనంతకోటి జీవరాసులలో, అనంతరీతుల, వికసించి, ముకుళించుచున్నవి ! ఇదే సృష్టిలోని స్థితి వైభవము !

12. వ్యక్తిత్వ ద్యోతక ప్రత్యేక లక్షణ విలాసమే. సృష్టిలాస్యము ! వానికి సంఘ సంఘర్షణలో విశ్వమున నొదవు పరిణామ వికాసమే స్థితిరూపమగు విష్ణులీల ! క్రమక్రమ సాంక్రామిక తద్విలయమే, విభిన్న ఫలోదయావ శిష్టమగు శివతాండవము ! ఈ మూటిప్రదర్శనమే వ్యావహారిక జగన్నాటకము.

13. ప్రాణధారణకు కూడు గుడ్డ లవసరములు ! సౌఖ్యవాంఛ, వాతావరణ కుటుంబముల ననుసరించి యేర్పడును. సౌందర్యమానములు ముఖ్యముగా, నింతులయందె వర్తించుటవలన, వారి చిత్తవృత్తులనుబట్టి, యమూల్యమో, మూల్యమో, యగుచుండును. వాగ్విధానము, బాల్యశిక్షణ, శీల, విద్యారోగ్య, వంశమర్యాదానుకూలం.

14. ప్రాణ, సౌఖ్య, సౌందర్య వాఙ్మానములు నాల్గును క్రమ పరిణామ పద్ధతిలో, సాంఘికోన్నతికి దారితీయునట్లై పోషణ కోరును. అధిక పోషణము లభ్యము కాకున్నను సామాన్యస్థితియైన నావశ్యకము. సరాసరి స్థితి కనుగుణముగా, పోషణపద్ధతిని, సంఘము, రాజ్యము సవరింపవలెను. సవరింపనిచో, నానాక్లేశ భిన్న దరిద్రనారాయణ కోటి, హాహాకారములతో, తద్దేశ శాంతి నిర్మూలనమునకు యత్నించుట, అభ్యుదయమార్గమని నేటి ప్రపంచము భావించుచున్నది.

15. శాంతి విధ్వంస మశాంతిజ్వాలలచే నగును. అశాంతిచే క్షోభయు, హింసయు, బయలుదేరును. హింసాదు లావేశక్రోధముల నినుమడింపజేయును. అట్టిచో ధర్మాధర్మ విచక్షణయు వ్యక్తిస్వాతంత్ర్యమును నంతరించును.

16. వ్యక్తికిగల సుఖ సౌందర్య వాక్ప్రాణ మానములలోని, స్వేచ్ఛ నశించి, సంఘమునకే సర్వాధికారము సంక్రమించినచో, వ్యక్తి సంఘములకు గల పరస్పర సమత్వ బాధ్యతలు సన్నగిల్లును. సుఖ సామ్యము లేనిచో, సంతో

షము, బాధ్యతలేనిచో సౌఖ్య సౌందర్యములు నుండజాలవు. ఆవిలేనిచో జీవితము, యంత్రారూఢమగును. యంత్రములు సజీవములు కానేరవు.

17. సజీవ వ్యక్తి బాధ్యతల సమష్టియే సంఘమై, అభ్యుదయ గాములగు సంఘముల ఐక్య ప్రయత్నమే, రాజ్యపద్ధతిగ దనరినగాని, ధర్మాధర్మములకు తావేలేదు. ధర్మమే సుధారణానుషంగము. ఆ ధర్మములేనిచో నిర్బంధమో, అల్లకల్లోలమో, శరణ్యములగును. నిర్బంధమువల్ల కల్లోలము తెచ్చిపెట్టు వృద్ధి పరిణామములు, సజీవములు కావు.

18. కావున, వ్యక్తి సంఘ పరస్పర సమాశ్రయ, సమస్వాతంత్ర్య బాధ్యతలతో నొప్పిన లోకములోనే, శాంతి సంతోషములు వెల్లివిరియును. శాంతి సంతోషములులేని జీవనము వ్యర్థము. వ్యర్థముగనుండుట సృష్టి లక్ష్యము కాదు. సృష్టి ఆదర్శము ఆనందకృషియే.

19. ఆ యానందము సత్యము, శివము, సుందరము ! కాని యసత్యమును సుందరముగ భ్రమించుటయు గలదు ! సమీపముననున్న శివంకరమును, సత్యసుందరముగ భావింపకయుండుటయు గలదు ! అట్టివేళలలో, మన హృదయపూర్వక సమన్వేషణమే శరణ్యము !

20. సుఖపూర్ణమైనది నిష్కలుష హృదయ మొక్కటే ! స్వేచ్ఛాచారమును గాక, తాన చేయవలసినవిధిని ప్రేమించుటయ, సంతోషమునకు త్రోవ ! ప్రతివ్యక్తిలో నిమిడి, బహిర్భూతమగు నిస్గశక్తియు, నేదో యొక యభ్యుదయ నిమిత్తమే కలదు ! తానేమిగానుండుట కీశ్వరునియిచ్ఛ తనలో సహజముగా ప్రకటితమో, అట్లనే తానుండి తాను చేయదగినది, లోకమున నొనరించుటయే సముచితము !

21. అందరును సంసారనౌకలో కర్ణధారులుగ నుండజాలవు కదా ! తెడ్డు వేయువారును గొందరు వలయును. దగ్గరనున్న దానిని మాత్రమే గమనింపక, దూరమునుకూడ గమనించినసే, కర్తవ్యము బోధపడును. వొదకినచోటనే

కాక, మఱెచ్చటనో, నీకర్తవ్యము నీయానందము నణగియుండనగును !

22. సుఖాస్తిక్య మొక యావశ్యకభావము ! యద్భావం తద్భవతి యనుట హుళక్కి కాదు. వసంతకోకిల మాహ్లాదపరవశమై ఆస్తిక్యగీతమునే యాల పించుచున్నది. కోకిలాలాపమును, వాసంతశోభయును పరస్పర వర్ధక ములే కావా ?

23. సంతోషము, లోకములోని యథాస్థితిని గ్రహించి, తదనుసారి, లౌకిక జీవిత సుసంపదను యథాశక్తిగా నార్జించి తృప్తినొందుటలోనే కలదు. శ్రామికులు, కర్షకులు, కార్మికు లట్టి మానసిక తృప్తివలననే, సుఖితులగు చుండిరి ! తనకువలెనే యొరులకును, సమ సుఖదాయకమగు ప్రవృత్తి వల ననే, లోకమున సంతోష మెదుగుచున్నది. భావిని ఫలవంతముగా జేయ వలెనని, భవిష్యత్ శోక పరంపరల నూహించుకొని, అద్యతనము, నఘక్లేశ పంకిలముసేతయు, వమ్ము సుమ్ము !

24. వైషయిక వైముఖ్యమును, ప్రధానముగ భావింతురు, కొందరు ! విషయ వాంఛను విడుచుటకంటెను, యథాశక్తిని, విషయములను పరపీడనము కాని తెన్నున, సాత్త్వికముగ తుష్టిగ ననుభవించుటయు మేలు ! తృప్తికన్నను మేలిమి సంపద లేదు. అది యున్నవాని కన్ని సుఖసంతోషములు గలవు కాననే, నిరాడంబర స్మితము వారి ముఖసీమ నాక్రమించుచున్నది !

25. నవ్వుదొలఁకు ప్రేమ హృదయములలోనే, పరమప్రభుఁడు నివసింపగలఁడు. హృదయమే స్వర్గనరకములను చూపించును. తనమేలు నితరుల మేలును లెక్కించుచుండువాని హృదయమే పరమాత్మునికి తొంగిచూచుటకు కవా టము తెఱచియుంచును. మనలోని సద్భావములే, వాక్క్రియలలో బయ ల్వడి, మనశీలముల నిరూపించును.

26. ఉన్న హర్షముతో, అబ్బినసుఖముతో, నకళంకముగ నవ్వుము. పిల్లల వలె నవ్వింపుము. నవ్వుటచేతనే పువ్వులు వికసించి సురభిళములగుచున్నవి.

సంతుష్ట యౌవనహాసమే, వయస్సు ముదిరినకొలదిని, యథాప్రాప్తి సంతృప్తిలో లీనమగుచు శాంతిగా పరిణతి నొంది మనల నాత్మసౌధము చేర్చు సోపానపరంపర యగుచున్నది.

27. మానవుడు వైషయికాస్వాదన పారవశ్యముతో, పాపమొనరించుటయు, దానికై తగవులాడుటయు, దానికై మోహవాగురలో చిక్కుటయును మాత్రము జూచి, నరజాతికి వెలకట్టరాదు! పరస్పర సంతోషకారిగా నెంతవర కతడు లోకసేవకు బాల్పడుచున్నాడో గమనింపవలయును. కాని నిందాస్పదములనే విమర్శకులు నెమరువేయరాదు. సత్కృతినే యూహించి దానిని తన యావచ్ఛక్తితో చేయువాడే సజీవుడు! సంతోష సత్క్రియాపరతను బ్రోత్సహింపని భావములు, జీవితములు, స్వప్నతుల్యములే!

28. ప్రతి సత్క్రియయు, ప్రతి సత్యభావమును, ప్రతి సద్భాషణమును, లౌకిక సౌందర్యమును బెంచి దాని నలౌకికము దివ్యముగా మార్చును! నీ వెట్లు విశ్వసింతువో అట్లే నీ పురోగామిత్వముండును! భావసత్త, భవ్యమైనచో, దుర్మనోలయముసిద్ధించి, శుభమే యంత్యమున లభించును! పొయ్యి యుడుకునకు సహింపలేనిచో పక్వాన్న మెట్లు లభ్యమగును?

29. సౌందర్య మశారీరకము నలౌకికమైనంతనే, యది శివము శాశ్వతానంద దాయకము నగును. అప్పుడే అది సత్యకిరణముల కాశ్రయము. అదియు నాత్మీయానుభూతి యగును. ఆత్మానుభూతి నంటియే ప్రకృతి పరిణామము జరుగుచున్నది.

30. ప్రకృతి పరిణామము, ఆత్మానుభూతియు, నైక్యవిభూతితో ముందునకు సాగినప్పుడే, జీవనాభ్యుదయము నిష్పన్నమగుచున్నది! ధనము, కీర్తి, ఆశ్రితవర్గము, మిత్రబృందము, కళత్రపుత్రులు, ఆరోగ్యబలములు, మనల నుండి విడివడిపోవచ్చును కాని ప్రకృతి పరిణతమగు ఆత్మానుభూతి వేఱు

పోదు. ఆత్మానుభూతి, ప్రకృతి విభూతితోడి యైక్యానుగుణపరిచితియే సుమా!

**31.** ప్రకృతి మానవీయము కాని, భౌతికము కాని, యాథిదైవికము కాని, యొకే స్థాయిలో, సత్యము ఆనందము సుందరముసై యున్నది. ఒక చిన్నయడవి తెల్లులో పూచిన పూవుపూవు ననంతభావ పరిమళ మిళితమే! జలజల ప్రవహించు సెలయేటినీటిలో దొరలిపోవు కొండమల్లెలుగూడ, దర్శనమైనంత యనంతర మెంతకాలమో హృదయమొదిపై, బుడగలుకట్టుచు, తారుచునే యుండును! ప్రకృతిదృశ్యము లెంత సుమనోహరములో కాని, ప్రతి దృశ్యము, నిశ్శబ్దమై ఖరితో, మనలో నఖండభావముల రేకెత్తించుచుండును.

**32.** దురాశావేశ పిశాచముచే పట్టువడ్డ మనుష్య పశువుల కీదృశ్యములు కానరావు. కాబట్టి తస్మాత్, జాగ్రత! జాగ్రత! ధనవ్యామోహము, పరకాంతా వ్యామోహము, ఆడంబరకీర్తివ్యామోహము, అధికపదవీవ్యామోహము, అహంకారము, ప్రకృతి సమ్ముఖమునుండి, మనలను వ్యావహారిక లోకపు బురదలోనికి దింపి, కాళ్ళను కదలనీయవు! ఇంక ప్రకృతిదృశ్యము లెట్లు కానవచ్చును?

**33.** మంటిబొమ్మ మొదలుకొని మానినీమణిదాక నీశుని ప్రతిబింబమగు ప్రకృతి నుండి, నీపై చూచి యేరుకొన్న, నీమన స్తేజోబింబము లేయనుట నీవెలుగు వరకు, అసూయాద్వేష క్రోధ లోభ మోహ వ్యామోహములు, నిన్ను ఏకాకిగా చేయును! నీదృష్టి యధోముఖమగును! నిన్నే నీవు బంధించుకొని, నీవెదుగుచున్నట్లే యనుకొందువు! కాని యెదుగుచున్నది నీ యజ్ఞానాంధకారపు నీడయే కాని, నీవు కావు!

**34.** నీవొక సత్య స్వయంప్రకాశ ప్రకృతికళవే! నీవుకూడ నొక యనంతానంద దృశ్యకళలమే! నీవంటికళ లనేకము లైక్యతాభరమున, నానంద నృత్య విలసితములు నీప్రక్కనేయున్నవి! కాని, వానిని ప్రాస్వపఱచుట

వలన, పరపీడన పరాయణ తమోభాగివిద్యై యుంటివే కాని, ప్రకృతిదృశ్య ముల పరికింపగల, ప్రేమ వివేక మేదీ నీకు ?

35. ప్రేమతో ప్రకృతియంతయు సుపరిణామ విభాసితమని యెఱుగుము! ప్రేమయే వెల్తురు, ఐక్యభావమే శక్తి. సదభిమాన సాత్త్వికాహంకార మయమగు ప్రేమతో, పరహింసాప్రయుక్తి విషస్పర్శలేని ప్రేమతో, నిన్నును నీ పరిసరములను గుర్తింపుము!

36. ప్రకృతి పగలును రేలును నొకటే, పగటి మనోహర దృశ్యానుభూతులే, రేలలోని మధురస్మృతులు. పగలు సృష్టి; రాత్రిలో సుఖాలయము. రేపవళ్ళును, సృష్టిలోని శక్తుల స్థితి తాండవములను, ఆనందములో తల్లయ మును చూచుచునేయున్నవి !

37. రేబవళ్ళుకూడా, వసంతునిసోకుచే, నితాంత కాంతము లగుచున్నవి. వసం తుఁడు మాధవుఁడే! చరాచర ప్రాణికోటియు, (గ్లానిని, శాంతిని వీడి, సురిగి తేఱిగిపోయిన జవశక్తులు, తమ నాడులలోనికి మరలి, ప్రవహింపగా) శోభావంతములగుచున్నవి. పరాశక్తి, ప్రాణరూపిణియై, నిండారి సోగలై వాలుకన్నులతో, మనలో నిండి చూచుచు, మనలను బయలునుండి చూచు చున్నది.

38. అందుననేకాబోలు దృష్టిలో, ద్రష్ట, దృశ్యము లైక్యమై, మనకు తన్మయత లభించుచున్నది! హిమశైలములలోని మంచు కరగి, మైదానములలోని తరు షండములపై మండలీకృతమగుచున్నది! అశ్వత్థ దేవదారు పిచుమంద మా కంద చందనాదు లగ్గలముగ బూఁచి యరుణహరితశ్రీ రమణీయతతో మన లను, లేతాకు నాలుకలతో బలుకరించుచున్నవి! పజ్జలోని చివురుబొంప ములపై, తొలకరివానబిందువు లాణిముత్తెముల సరములవోలె తళ్కు లీనుచు, మనలను, భరద్వాజముల యాలాపములతో, నాహ్వానించుచున్నవి.

39. ఆహా! సూర్యభగవానుఁడు ప్రసన్నమైన పంచభూతముల పరివేషములో, సప్తవర్ణముల సొబగులను, సరసలోనే ప్రదర్శించుచు, కాంతి భానువులతో సత్కరించుచున్నాడు! ఈ మహాసుందర, పవిత్ర, శుభ సమయమున, సాటిమానవుల కానందము, సాధుమార్గమున సంతరింప సంకల్పించుకొమ్ము! నాదినాదియని లోపల నినుపెట్టెలో, నీ మంజుల మనస్సుతోపాటు దాచియుంచిన ధనసామగ్రిలో, నించుకంతయైన నితరుల సుఖమునకై, నీ నిర్వృతికై, పంచిపెట్ట నెంచుకొమ్ము. ఈ వసంతమే, యీ ప్రశాంత భానూదయమే, యీ సుమనోవికాసమే, యీ యమృతానంద భావమే. ప్రకృతి నీకై యనంతపర్యాయములు, వెలికి గుమ్మరించినది, నీ యొఱుకకు తట్టనేలేదా?

40. ప్రకృతి యానందమయి. నీ యాత్మయు ఆనందమయము. ఆత్మప్రకృతుల నంకతలమున నంకించుకొని లాలించు మంత్రసూత్రవర్తి పరమాత్మ యానందమయుఁడు. పరస్పరాశ్రిత త్రైర్యత్రికవోలె, నీ త్రిపుటి (ఆత్మ ప్రకృతి, పరమాత్మల సమ్మేళనము) సర్వానంద సంపుటీకరణమే కాన, ప్రకృతిని ప్రేమతో నాలోకింపుము.

41. స్త్రీతుల్యయగు ప్రకృతి యన్నిఋతువులలోనూ మనోహారిణియే! గ్రీష్మములో పెనుమలల గవులలో చల్లగా నివసించును! వర్షములలో చెట్ల కొమ్మల కొనలనుండి జారి నేలపై హరిణములతోపాటు పరువెత్తును. శరదృతువులో వెన్నెల వెల్లియై విశ్వములో వ్యాపించుచు, శిశిరకాలములో శిథిలమైన యాకులను రెమ్మలను, దూసివైచి, స్నానార్థము సన్నని జిలుగు దాల్చిన సంసారకాంతవలె, పసుపు కాంతులతో, పైకెగిరిపోవు శకుంతముల కలకలలతో, పరమ ప్రభువును పిలుచుచున్నది!

42. ప్రకృతియంతట పరమార్థమున్నదని, గోటువాద్యపు తంతుల వ్యక్త మధుర నినాదాస్పదమైనట్లు, యుదుతల యుఱుపులు, కోడికూఁతలు, గిజిగాండ్ల

గూళ్ళు, చీమలసేనలు, విశదము జేయుటలేదా? ఒక పూవుగల కాడలో, వినీలాకాశమను పందిరిలో వ్రేలాడు నొక తెలిమొయిలుపలుకులో, నురువు గ్రక్కుచు నొడ్డును రాపాడు నొక పారావార తరంగములో, నెంత పరమార్థము, సృష్టిశిల్పము, మణగియున్నదో వివరించువా రేరి? పచ్చని పాదపముల, తోఁపులే, భగవదాలయములు కావా? మన మెల్లరము, పక్షులు మృగములు, మానవులు, భగవానుని బిడ్డలమే కాదా?

43. అసంఖ్యాక నీరవతారాగుచ్ఛములు, నిరంతర తరంగగాములగు జీవనదులు అభ్రంకషములగు గండశిలా శిఖరములతో మేఘములచాలును ఢీకొనుచున్న యుత్తుంగ పర్వతపంక్తులు, నిశ్శబ్దమైన ఎలుగుతో మంతనము లాడుచున్నవి! అఖండ పరమేశ్వరుని ఖండవిభూతులవి! ఇంద్రధనస్సు ( కామునివిల్లు ) మానవుని తనువు, పరమును మఱుగుపఱచు తెరలేమో! విచ్ఛేదితావయవ విజ్ఞానముకొఱ కుపకరించు సాంత్యయా లేక యాత్మవికాసమునకు దోడ్పడు ప్రకృతి పరిణామ సుందరదృశ్యమా, యేది వాంఛనీయము?

44. లేతయాకుల పూల పూఁతతో నాత్మాంకుర వికస్వర నైపుణ్యము చూపు, తోటమాలి, సత్యము తలకుదాకున ట్లుచ్చస్థాయినుండి మంద్రమునకు దిగుచు, భావతంత్రుల మాఱుమ్రోగించు గాయకుఁడు, తనరాకకై నిరీక్షించుచు తనయార్జన మమృతముగ భుజించు నాలుబిడ్డలపై ప్రేమతో కష్టించు కూలి, లోకశాంతికై యోంకారము తానైన యోగి, వారువీరనక యెల్లరు నీశుని సేవనే చేయుచున్నారు! ఏమిపని, యెంతపని, యెట్టిపని, యను ప్రశ్నలతో పనియేమి? చేయుపనిని యథాశక్తిగ, మనఃపూర్తిగ చేయువాఁడు ప్రతివ్యక్తియు ప్రకృతి పరమాత్మల భక్తుఁడే! దేహములో నేయంగము కష్టించినను, దేహమంతయు నాకృషికి స్పందించునట్లే, విశ్వసృష్టిలో నేకృషి జరిగినను, విశ్వాత్ముఁడగు భగవానున కది విదితమే యగుచున్నది.

45. అనంతానేక సృష్టివైచిత్ర్యములలో నేకము నఖండమునగు సత్యము, మణి

హారములోని సూత్రమువలె నిరంతరమై, పూర్ణతను భజించుచున్నది. ఆ పూర్ణ సత్యానంద లేశమైనను, నీకు గోచరించెనేని నీవు ధన్యుఁడవు. దాని ననుభవించుటకు ముందు తద్దర్శన మావశ్యకము. దార్శనికవిజ్ఞాని వైనంత మాత్రమునగాక, దర్శనోత్కంఠయున్ననే, పూర్ణము నీవుపొందింపగలవు కాని, డంబముతో కాదు.

46. దర్శనోత్కంఠ, మైత్రిలో నిమిడియున్నది. మణులను దడవినచో లోని సూత్రము పట్టుదొరుకునట్లే భగవానునిచే ధృతములైన భూతములలో, నీకు మైత్రి కలుగవలయును! మైత్రిలో ధర్మకరుణ, ఉపకారేచ్ఛ, విశ్వాసము అంతర్భూతములు! ధర్మదయా నదీకూలముననే, మైత్రిదర్పణము నీకు లభ్యమగును, కాని, నీపదవి నాశ్రయించి నిన్ను జేరు పడతులవలన, నూరక శ్లాఘించు పతితులవలన కాదు.

47. మిత్రులు మైత్రివలననే లభింతురు! సానుభూతి నభిలషించిరేని, మిత్రులు తమ లోపములను, నీయెదుట నుంచినచో, కినియక, క్షమతో వాని నంగీకరించు విశ్వాస భావావిష్కరణముతోపాటు, నిన్ను నీమిత్రులు స్వీకరింతురు! మైత్రి శుద్ధదర్పణమువలె పరస్పరములగు లోపములను, సుగుణము లను రెంటిని దర్శింపజేసి, యవ్యాజ ప్రీతికొఱకుగాని, సహజోపకార వృత్తికైగాని ఏర్పడిన విశ్వాసబంధముచే, పరస్పరము బద్ధులను చేయును! వ్యావహారికాహంకృతికి ముందుండిన, సామరస్యమే, మైత్రి చేకూరినతర్వాత పూలలోని రేకులవలె సంతోషపెట్టును!

48. మైత్రి మిత్రుని ముదితునిజేయును. విశ్వాస క్షమాజల సేచనము లేనిచో, మైత్రిమొక్క తలయెత్తదు. మన గుణశీలముల నాదర్శములుగ గొనిరేని, మన మిత్రుల శైల కట్టుదుము కాన మనమిత్రులు మనవంటివారే యగుటయు తటస్థించును! మనగుణములు మన కాదర్శములగుటచే మన సంకుచితాదర్శ

మానముచే, నతి సమీపస్థులను సైతము, మన మొక్కొకచో నిందార్హులుగ నెంచుచున్నాము.

49. మనము పూర్ణులమైనగాని మనయాదర్శములు పూర్ణములుగావు కావున బంధుమిత్రుల నీసడింపఁదగదు! గుణలేశమును బ్రస్తుతించుటచే సహృదయుని హృదయ మానందించును! మైత్రి యలవడినచోట యథార్థభాషణ మావశ్యకమే కాని, కఠిననింద త్యాజ్యము! నీలాపనిందలను, కొనలలో జార్చు నాలుకలను, నీచెవిలో జొనుపక, సౌశీల్య కళాఖండములనే, నీ కనులలో దొలఁకనిమ్ము.

50. మనలో మంచివారలలోనే ఎంతో చెడ్డ. ఎన్నియో దోసగు లున్నవి. కాబట్టి శత్రుదోషమునే విరివిగా వేర్వేరును టొకప్పుడు, కాలు నినుప ముక్కను, సుత్తితో వ్రేటువేయునపు డెగురు మంటవలె, నిన్నే మాడ్చి వేయవచ్చును. మిత్రుఁడు విరోధించిన నతనికన్న శత్రు వుండఁడు. కావున నీయాత్మను నీవే పరిశోధించుకొని, ( నిన్ను నీవు తెలిసి ) పరిశుద్ధమైన, యథార్థమైన, స్నేహజలముతో, పరిసరముల నానంద మందిరములుగా మార్పుము.

51. పరులు నీకొనరించు మేలేమేని మఱువక, వారిచేసైన యపకృతులను, దూఱులను, మఱచిపొమ్ము. నీ మంచితన మప్పుడే సురభిళమై, యా యాదర్శపు వాసనలు, నిన్నుదాఁటి రెండుమూడు తరములవరకు వ్యాపించును. మంచివాసనలు సర్వజన మాన్యములుకదా? ఒరులు నున్నస్థితికి వచ్చి నిన్నున్నతస్థాయిలో నుంపగల్గుటకు, క్షమతో నితరుల తప్పుల నొప్పుకొని, మఱచి, కష్టజీవుల కుపకారము నేతయే విధిగా నెంచుకొనుము.

52. కష్టజీవులే ధన్యు లెందుకనగా పదకములో పొదిగినప్పుడే అపరంజికి, అందలి రత్నములకు, కాంతివచ్చినట్లే, దుఃఖము లనుభవించినవానికే సుఖముల విలువ, ఆనందపుచలువ అర్థమగును! మనలను మనము జయించి మన వాతావరణమును మన కనుకూలముగా మార్చుకొని, మన యనుభవములను

మంచి కుపయోగించినప్పుడే మనజీవితములు మాన్యములగును! కష్ట సంఘర్షణలే, మన నైజలోపములు బయల్పడి సవరించుకొనుటకు మనకు శిక్షణ కేంద్రము లగుటయు, ఎనుదిరుగుటకు వీలులేని యాపత్సమయము లాసన్నమైనప్పుడే యా యిరుకుతోవలో నెదురుపోయి, గమ్యస్థాన మేగుటయు తటస్థించును. ఉదయించిన తార లాడగి యంతర్హితము లగుచున్నట్లే ఏటేట చలికాలము దాపరించునట్లే, ప్రతిజీవితమున, కొన్నిఘట్టములు విక టించిరయే తీరును.

53. ఆపత్తులలోనే మానవునికి స్థైర్యము, ఆత్మవిశ్వాసము, అచంచలదీక్ష, అలవడి, జీవితపరిణామ మేర్పడును! దొమ్మపొగరు దొంగలకును కలదు కాని, ధీరుల ధృతి యుత్తముల కబ్బునట్లే, ఏకాంతముననే, ధీశక్తి లుజ్జ్వలత వహించునట్లే, కష్టములను సహించుచు, సత్కార్యసిద్ధి యొనగూర్చుకొనుటవలననే, సౌశీల్యమేర్పడుట కాస్కారమగును. కావుననే నీ కతి సన్నిహితులవలననే క్లేశములుకల్గి ఖిన్నుని చేయునప్పుడును, కష్టము సార్వజనీనమనియు, కష్టాంతమే సుఖానుభూతి యనియు తెలిసికొమ్ము. నీకును, లోకమునకును శాశ్వతానందకరమగు కార్య పరంపరలోనే, క్రమబద్ధుడవై మెలగుము.

54. ఆత్మసిద్ధికొఱకు నీ జీవితము నంకితముచేతువో, లేక యితరులభాగ్యము పొందుటకై, నీయాత్మనాశనము కల్పించుకొందువో, నీవే నిశ్చయించు కొమ్ము. ప్రభువులగు బుద్ధుడు, జీససు, శ్రీరాముడు, చన్నమార్గమున నీవునుపోయి యాత్మసిద్ధుడవు కమ్ము. వారలు దైవావేశితులని, నీవు కావని, తెలియకుము. ప్రతిజీవుని, సువిశ్వాస పరాంతరంగమున, సత్కర్మ జ్ఞానలయ హఠయోగీశ్వరులు, ప్రభువులునగు, శ్రీరామ, బుద్ధ, శివ, జీసస్సులు సర్వథా సహాయమునకై సన్నద్ధులై సమీపముననే వేచియున్నారనుట ముమ్మాటికిని సత్యముసుమా!

55. విశ్వాస దౌర్బల్య మల్పమానవ లక్షణము! అసురావేశముచే నవిశ్వాస
మొదవినప్పు డంతయు, ఆత్మాభిముఖుఁడవై, అత్యంతాత్మశ్రద్ధతో ముందు
నకు సాగిపోయితివా, మానవశ్వావధి నధిగమింతువు. అనంతవిశ్వ జాగృతి,
యఖండతేజము నిన్నావరించును. అప్పుడు ప్రేమానంద పీయూష ధార
లచే, పునీతుఁడవగుదువు; కాన నీ వితరుల నధోగతికనుపు పెడత్రోవ నెడవి,
యుత్త మాత్మవిశ్వాసబలముచే, నెల్లర యున్నతికై యత్నింపుము.

56. అమావాస్య చీఁకటియేమైనను తెల్లవారక మానదు! దుఃఖ సహిష్ణుత,
శుభాశయవిశ్వాసము, చావులోకూడ చావని ప్రేమ, నిత్యాత్మసంతుష్టి, నీ
వలవఱచుకొని, లోకసుఖము, స్వసుఖము నొకటిగా తెలిసి, వచ్చిన క్లేశ
ములను, ఆశాభంగములను గణించుట చాలించి, పట్టుదలతో పైకి ప్రాఁకి
పోయెదవా, నిన్నదృష్టశక్తు లావేష్టించి. కృతార్థునిచేయును. ఆ గతా
త్తులపై యాగ్రహింపక, నీ యశక్తియే కార్యభగ్నతకు కారణమని యెఱిఁగి,
సత్త్వము నాశ్రయింపుము. దుఃఖాగ్నిలో కాఁగి కరగి, క్రొత్తదనముతో
గొఱలిననాఁడే, మేలిమిగుణముల, మెఱుఁగుబంగారపు, మిక్కుటపు శాంతి
కాఁతులు, నీకు సహజములై, సర్వానందమును, సంపాదింపగలవు!

57. బహూకృతి నందుకొనుటయే ప్రధానమని పతితలోకము పాటించుచున్నది.
నైజమగు నర్హతతో కష్టనిష్ఠురములను క్రమముగ సైరించి తాపైఁ తటస్థించిన
బహుమానములు పవిత్రములే కాని, పరులను వంచించి పైకొన్నదానిని పెద్ద
యనుకొనుట వేలమువెఱ్ఱి కాదా? "ఆరంభింపరు నీచమానవులు" కాని,
ప్రజ్ఞానిధులు ప్రారబ్ధార్థము లుజ్జగింపరు కదా! ప్రకృతిరంగములో
పరమదయాళువై, ప్రరమప్రభువు ప్రాపంచికులపై జూపు తాల్మికి మేరయే
లేకున్నను, కృషిలేని యాడంబర గౌరవమున కఱ్ఱులుజాపు నీచులే, పెక్కు
రున్నారు.

58. ఆపత్తులు మహాత్ముల పాలిటి సంపత్తులు! కాదంబినులలో తటిల్లతలు తెలు

పడినట్లు, విపత్పరంపరలలో వారి నిసర్గ సామర్థ్యములు బహిర్గతము లగు చున్నవి. జయింపగల్గుదునని విశ్వసించువానికే, విడువని ప్రయత్నముచే, విజయ మావిష్కృతమగుచున్నది. గాలిపటములు వాయువులు క్రింద దూఁటి పైపై కెగిరిపోవునట్లే ధృతిగల సజ్జనుఁడే కష్టనష్టముల కనిష్టముజూపక నభ్యుదయకృషితో, సత్యాత్మోన్నతి కెగఁబ్రాకును.

59. భగవంతుఁ డెప్పుడును కరుణాళుపై లోకాభ్యుదయ పరిణతికే తోడ్పడు చున్నాఁడు. ప్రకృతిశక్తుల సమక్షములోనికి విజ్ఞానులను తీసికొని పోవు చున్నాఁడు. అంతరిక్షములో మేఘమాలల దాటించి చందమామలోనికి కుజ శుక్ర గోళములలోనికి, ప్రకృతియు దనయాకృతిరైనందున జార్చు చున్నాడు. ఇన్నిటి నావరించి తానున్నానని మరల మరల ఘోషించు చున్నను, మానవునికా నిశ్శబ్దసంకేతము, వేడిలేని వెలుగు, శూన్యము కాని యాకాశము, అశాంతమేలేని నివేశము, ఇంచుకయు నర్థమగుటయేలేదా ?

60. ప్రకృతి పరిణామములు, సత్కృషిమూలములు, కారణకార్య పరిణద్ధములే కాని, గ్రుడ్డిపోకలుకావు! ఊరకకూర్చున్న నేదియుకాదు! నడుముబిగించి కర్తవ్యమును యథాశక్తి నెరవేర్చినవాఁడే మానవుఁడు! అన్నియు మనకు నంతరాయము లైనప్పుడును, వేసరక, ఉత్సాహిరై, విరివిగ ప్రయత్నించి విశ్వమును తనవైపు త్రిప్పుకొనగలిగినవాఁడే మనీషి!

61. ఏప్రయత్నమును వృథాకాదు! కొండపైనుండి చూచినప్పు డుపత్యకము దాటివచ్చితిమని తెలిసికొందుము! కావున కన్నిటివరదలలో తేలుచు, కని కరముతో నవ్వగలవాఁడే ధీరుఁడు! దగ్గరి దురాశా కందర దుష్క్రియా కంటకములలో కాలుపెట్టక, నేకదీక్షతో, కొండచివరికి చేరి, పైకేగు తెరువును ప్రకటించియు, నిగర్వియై, తోడివారల నంది చేదుకొనువాఁడే "ధీరోదాత్తుఁడు!"

62. పాపపంకిలములో పొడుపురుగులుగా పొరాడుచున్న ధన పదవీధరులు, అన్నదమ్ములకు, పొగిడినవారికి, గంధిలములవోలె, దుర్గంధిలములగు దురధికారధనముల దోచుచు, నిరుపేదలగు యోగ్యులకోటి, చేతులుజాపి నిరీక్షించుచుండ, వారి నుపేక్షించుచుండిరా! పొడుగుచేతుల పంపకముతో మానిపైకెక్కినవారిని, క్రిందద్రోసి, యున్నపండ్లను తిన్నవారై, తమ నాశనముతోపాటధర్మమునకే తాముతోడ్పడుట యేమిపనియని యాలోచించి, పశ్చాత్తాపముతో దుస్స్వార్థములేని సత్కార్యాభ్యుదయమునకై వారు సన్నద్ధులగుదురా? తొందరతో తోలందమునకై గడ్డిదిన్నను, తప్పుడు డబ్బు తిప్పరైయినను, దేవుడు క్షమించునేమో! కాని కృతఘ్నతమ, ద్రోహహింసల నక్షలాంతరాత్మ సహింపడు సుమా!

63. బురదపుర్వులు, పూడుపాము లేవీ కలవలేదేయని పరిహసించు పాపైశ్వర్య మత్తులారా! విఱ్ఱవీగకుడు! శ్రీరాముడు, శ్రీయుధిష్ఠిరుడు, శ్రీమదశోకుడు, శ్రీ హర్షవర్ధనుడు. శ్రీ విక్రమాదిత్యుడు పాలించిన భరతఖండములో, శ్రీ వేదవ్యాస, విద్యారణ్య, సమర్థ రామదాసులు గురుపీఠము నధిష్ఠించిన భారత ధర్మశాలలో, చిరకాలము మీరుండజాలరు! బీద లొక నాడు శాంతితో సత్యఛత్రముక్రింద, విజయ నీరాజనములు పట్టి, సమగ్ర స్వతంత్ర సౌజన్య పూర్ణభారతిని భద్రముగ నిల్పగలరు!—హెచ్చరిక!

64. ఒక్క భరతఖండమే కాక విశ్వమంతయునిండిన మానవజాతి హృదయ మొకటే! రాత్రిలోని యుడుగణములట్లు, మేధావంతుల బుద్ధిబలములు, విభిన్నజ్యోతులు ననేకములు కావచ్చును, కాని హృదయ మహస్కరుని వెలుగువలె నొక్కటియ! ఆహృదయ మఖండ ప్రేమానుబంధ సముజ్జ్వల మయ్యెనా ప్రకృతి తెరలో దాగి మనల నాడించు నీశ్వరుడు తెలికి రాగలడు. అప్పుడు భూతలస్వర్గము ప్రత్యక్షమైనట్లే!

65. అఖండప్రేమ పాథోరాశిలోనే, యానందామృత కలశము సుజనుడై

మానవుఁడు ధన్వంతరిగా తనచేతులతో పట్టి చూపుచున్నాఁడు. అట్టివారే మహాత్ములగుట, ప్రేమ, స్వార్థదుష్టము, ఖండమును కానేరదు. విశ్వ మానవకోటి రూపమున ప్రేమ ప్రకృతిమయుఁ డఖిల పాలనానురక్తుఁడై యున్నందున, నీ యిరుగుపొరుగువారి కొనరించిన యవ్యాజోపకృతి, యా పరమాత్మునకే ముట్టుటవలన తుదకు సుఖించునది నీయాత్మయే. ఒరులకు హాని యేతీరున జేసినను తుదకు ఘాతపడునదియు నీయాత్మయే !

66. కాబట్టి సహజమై విధ్య విరోధకారియగు, మిథ్యాడంబర వ్యావహారిక జగత్తు పైననే, దృష్టిని కేంద్రీకరించి, విశ్వైక్య, విజ్ఞానమయ, ప్రేమసుధ నోలక బోసికొనకుము ! మాయుకోరు మమత మాని, ప్రేమశక్తిచేతనే, విశ్వవ్యాపారము ప్రవర్తిత మగుచున్నదను యథార్థతను గుర్తింపుము ! దయా సానుభూతులు, ప్రేమలో నిమిడియే యున్నవి. శుద్ధప్రేమ యధికమగు కొలదిని, పరమప్రభుని యఖండసాన్నిధ్యము, మనలో నగ్గలమగుచున్నదిసుమా!

67. ఆత్మవత్సర్వభూతాని యని పెద్దలందురు ! కాని ప్రేమ కృత్రిమము, ఘనత కవలంబించునది కాక, మానుష్యత కావశ్యకమై, కాయమునకు, త్వక్కువలె యుండనే యున్నదగుటచే, సంసారచక్రము ప్రవర్తితమగుచున్నది ! పరమప్రభుఁడు ప్రకృతికి నీకు భిన్నుఁడుగాలేక నీయందే యుండుటచేత, నీవు ప్రేమించినవారికై తాపత్రయ పడుచున్నావు ! ప్రభువును గుడిలో, నీ వుంచినావే కాని, ఆతఁడుమాత్రము. నిజముగా నీలోపల, నీ వెలుపల నిండియున్నాఁడు !

68. ప్రేమ నానాదశల నలరారుచున్నది. పురుషప్రేమ విజయకారణముగ తలపైకెత్తి పుష్పవికసనము ననుసరింప, స్త్రీ ప్రేమ బాధాసహిష్ణుతతో, వినమ్రమై, ఫలోత్పత్తివల్లీ వృత్తి ననుకరించును. ఒక చిరునవ్వో, ఒక మంచిమాటయో, ఒక కనికరపుచూపో, ఒక ప్రోత్సాహభంగిమయో, ఒక మంజుల లేఖయో, ఒకమధురాపాంగమో, ఒక కైదండయో, ఒక భుజ

స్పర్శయో, ఒక యాలింగనమో, ఒక యప్రయత్న చుంబనమో, ఒక యకలంక ముఖవైఖరియో, స్త్రీత్వమును మాయనీని యొకనడకయో. ఏదో యొకతీవిగా ప్రకటితమగుచున్నది, ప్రేమ! తోడివారల గోడూడునట్లు, సదయహృదయతను, క్రియాత్మకముగ నిరంతరముగా, సహజముగా, దాల్చినవాఁడే ధన్యజీవి!

69. మైత్రి, దయ, పరోపకారనిరతి, వలసినచో స్వార్థాపేక్ష, తలిదండ్రుల యెడ విధేయత, నాతిచరామి యని యగ్నిసాక్షిగ నుడివినదానిని భార్య యెడ నాచరణలో నుంచుకొనుట, ప్రతిఫల వాంఛారహితమగు వాత్సల్యము కష్టసహిష్ణుతతో కడవరకు నిల్చు కారుణ్య సౌశీల్యమే, ప్రేమ! మానవతకు శిఖరి, పావనతకు పరమావధి, నిర్వంచక సౌజన్యప్రేమయే! సత్యప్రేమకు చావులేనేలేదు! అది యనంతమై, లౌకిక పారలౌకిక సౌఖ్యమునకు బునాది యగుటచే, నిజముగా నమూల్యమే!

70. ఆప్రేమ నిబంధనబంధమే కుటుంబజీవనము! మనవారికి మనము సేవచేయుటకు ప్రేమయే మూలము! పరస్పర సుఖప్రీతులు కారణాంతరములే కాని, సహిష్ణుతయే సహజధర్మ మాప్రేమకు! తల్లిపిల్లలలో, విహగ భూచర జలచర జీవవర్గములలో, దేనిలోనైన, నీప్రేమ నీశ్వరుఁడే నించి, తన్నే తాను వలపించుకొనుచుండుట, నిత్యదృష్టమగు, నితాంత వైచిత్ర్యము!

71. నాయిల్లు, నామగఁడు, నాభార్య, నాపిల్లలు, నాయూరు, నాదేశము, నాభాష యనిపించునది యెల్లయుప్రేమయే! నా యనదగినవారికి ద్రోహము తలపెట్టుటయే దుస్స్వార్థము! తాను, తనవారు, పరులు, బాధకు పాల్పడనియట్లు, సామరస్యముతో, జీవింపగల్గుటే సుస్వార్థము! సుస్వార్థపు మేరల నతిక్రమించి, యనంత విశ్వసౌఖ్య స్పందనమున, తాను నొక యంశమై, లీనమగుటయు, ప్రేమాదర్శమే!

**72.** వైవాహికము, సౌదర్యము, ఉత్తమ జనీనము నగు ప్రేమ, మానవునకు సహజముగ నేయున్నది! దురాశాఖడ్గమే సున్నితమగు, ప్రేమపాశమును, తెగగొట్టుచున్నది! తనయందు బద్ధమగు భావనావేశము, పరాపజయ పర దుఃఖభాజనమునై, లోభమోహములై, యసంతుష్టిచే క్రోధమాత్సర్యములై యల్పజయముచే మదమై, సుస్వార్థకామమును, దుష్కామముగ మార్చి వైచుచున్నది! తుదకు దురాశను సాధించినను, తానేకాకియగుటవలన, నాజయము శ్మశానసౌఖ్యమీర్షై, తనకు, తనలోని ప్రభువు దూరమగుచున్నాఁడు.

**73.** ప్రతిమానవుఁడు, విశ్వాంశమేయగుట, విశ్వము జీవకోటిఖండముల యఖండ మండలాకృతియే యగుట, పొరుగుపొత్తు కుదురక పొక్కు భాగ్యము, పాపభూయిష్ఠమగు దుఃఖమేయని, తుదినే, దుర్మనస్వి యెఱుఁగఁగలఁడు! పరులనుండి బలాత్కరించిన బంగారమే ప్రధానమను దుర్నీతిజీవన మొకానొకనాడు దుర్భరమేయగును! పదిమందికలిసి జచ్చుటయు పండువే కాన, పరస్పరాశ్రయ జీవనమే, సుజీవనము! సహజముగా, సాంఘికమైత్రి రక్షితమగు, మానవజాతి కఖండప్రేమరయే యవలంబనీయము!

**74.** మానవజాతి యున్నంతవరకు, స్వ, పర, పరమార్థముల మూడు నుండవే యున్నవి! అవి సుఖసామరస్య సువాసితములా? లేక హింసాత్మక భోగ దుర్వాసితములా! యను విచక్షణమొక్కటే కావలసినది! మాఘములోనే మల్లెలు సొగసులు గుల్కును! కాని, మల్లెల జీవితములు పూర్ణవికసితము లైనట్లే, మానవునిజీవిత మల్పకాలమే యైనను ప్రేమచే నది పూర్ణవికసితమే కాగలదు!

**75.** ఒడికాన ప్రేమనేర్పిన సౌశీల్యమే, మానవునకావశ్యకము, గాని, యచ్చుల హల్లుల నేర్చికూర్చి, యనర్థముల, విచిత్రముగ, చిత్రించు నేర్పు దార్చు, విద్య, యంత యావశ్యకము కాదందురు, వేత్తలు! భారతదేశమున జన

పరంపరాప్రాప్తములగు వేదములు, స్మృతులు, కథలు, తత్త్వములు, తెలివి కూఁతపట్టులుగనుండెనే కాని, విద్యాశాలలు సాంకేతిక శాస్త్రాభ్యాసమునకే యేర్పడినవి' ఇప్పుడో భోగవాంఛల బెంచు పాఠశాలలే కాని, సౌశీల్యమునకు దోహదమిచ్చు గురుకులములు మృగ్యములైనవి! మానవాత్మను మాన్యముగ మార్చునది దుశ్శీలవిద్యయా? సౌశీల్య వివేకమా!

76. మిత్రద్రోహమునకు బాల్యపనిద్ర, కొలఁకులలో, పక్షుల రెక్కలలో, పూలరేకులలో, మృగముల పరువులలో, పైరులు పెరుగు తీరులలో పరగు సృష్టిని పరిశీలించుకొనునదియగు, సహజధీ సౌశీల్యములైపు వ్యక్తికి, యత్నింపుడు! పరహాని కుపకరించుచు, నధికారము ప్రక్కకే మొగ్గు విద్యానైచ్యమునకు తిలాంజలి నొసంగుడు' యథార్థజీవనము సాగనిండు. (చచ్చినను శాంతిగలదు); ఉండి యొరులకుపెట్టని పట్టిబ్రతుకులకన్న నుండకుండియు నొకనాఁడైన నతిథిలో సగబాలు పంచుకొన్న జన్మమల్పకాలమైనను సార్థకమే!

77. సత్యప్రేమకు శాంతికి. సౌజన్యమునకు చావులేనట్లే, సత్యమునకును మృతి లేదు! యుగములు తిరిగిపోయినను, కొండలు పిండియైనను, తారలు తీరిపోయినను, ప్రపంచ నగరములన్నియు పాడుపడినను సత్యము మాఱదు; మాయము కాదు! సత్యమే ఆచరణలో కరణత్రయము నంటినచో ఆరోగ్యము! సత్యారోగ్య సుజీవితములకు సన్నిహితుల మగుదుముగాక!

78, 1 మంచితనము, 2 నిష్కల్మషచిత్తము, 3 ప్రకృతిసాహచర్యము, 4 శాంతహృదయము; 5 ఉపకారపరత, 6 విధ్యుక్త ధర్మనిర్వహణపూర్వక నిత్యసంతుష్టి, 7 సౌజన్య సామరస్యముల కిక్కువయగు సాంఘికజీవితము, 8 అభ్యుదయకృషికి సన్నద్ధమగు కాయము, నను నెన్మిదియు నష్టకష్టముల నిర్మూలించును. ఆవియ సౌశీల్యాంగకములు! ప్రేమికుల కవియ యనల్పకల్పాశ్రయములు! దేవునిసన్నిధికి తేలికగ గొంపోవు రాచబాటలు!

**79.** పనిచేయకుండ నైపెడిని పట్టుకలయునను పాపపుటాశను వదలి కలుషపంథలో, కనరానిపదవుల కామించుటను త్యజించి, నిత్య సంతుష్టితో నీ కర్తవ్యము నెరవేర్పుము! ఒరులే నీవైనట్లుగా నెనకుగల్గి, నీతిని వెలయింపుము! అనవసరపు మాటలాడినకొలది మాటసేత లెచ్చును, మరియు పరభావముల వరం బడి నిలువయు తగ్గును. కాన, వలసినంతయే పలుకుట నేర్చుకొమ్ము! సోమరివి కాక, పరుల పాపములను విస్మరించుచు, పరోపకృతిని స్మరించుచు యొరుల కూరక నీగోడు వెల్లడింపక, మితభాషివి, స్వపరహిత కారివి, సకాల కార్యప్రవర్తివి కమ్ము!

**80.** పరమప్రభువు సృష్టించి పెంచుచు, ద్రుంచుచున్న యీప్రపంచమున కొఱగానిది, అణుమాత్రమేని లేదుసుమా! ఇసుకరేణువుల సంకలనాట్టహాసమే కొండరూపైనట్లు, కనమూతలకు లెక్కింపరానియగు క్షణములే, యనంత రాసులుగ తరలిపోయి, యుగము లనిపించుకొన్నట్లే, చిన్నచిన్న సంఘటనల ఘట్టముల కూడలియే జీవితముగా సాగి, లయకాలసముద్రములో లీనమగుచున్నది! ఒక్కొకసారియు నొకపనియే యోపికతో నొనర్పుము! అకస్మాత్తు, అదృష్ట మప్రయత్న మనునది విశ్వములో లేవు, కావుననే; ఎవరో ఎప్పుడో తలంచినదో, చేసినదో, మనము సుప్రయత్నములచే పూరించుచుంటిమనుట, తెలిసి, గడియూడ్చుకొనుట మొదలుగా, చక్కగా మనమే సవరించుకొందము గాక!

**81.** పలుకురాయిలోవలె మాఱుమ్రోగి, నశించిపోక, నీ వాడు ప్రతిమాటయు నన్నిటి నావరించియున్న యాకాశములో, స్థిరముగ ముద్రితమై చిత్రగుప్తుని పుటలలోనికి చేరుచున్నది! వెనకముందు లాలోచించి సరసవాణి సరసవే నీ యెలుంగును సవరించుకొననిచో పల్కులు విషాశుగములు, సర్పములు, కాగలవు! ఎదుటివారి గణక్రియాలేశమేని నుడువు పల్కు లమృతపు సోగలై, యాపదల నార్పగలవు! పలుకు లాడిశబ్దస్ఫోటక ప్రకృతి శక్తికి **ఆపన్నములనుట మఱువక, వర్ణదేవతలకు ప్రీతిగా, వాక్రువ్వుము!**

82. కాంచనమునకన్న విలువైనది లేదనుకొందుము! కాని మానము, కనకమునకన్న ఘనమైనది! మానమునకన్న ప్రాణము మధురాతిమధురమైనది! కాని ప్రాణమునకన్న నీ చేతలన్నిటికి భృతములు మొత్తలేని మారుచేతల పక్వమొనరించు కాలమే, బహుళ విమూల్యమైనది సుమా!

83. సమలతో సమన్వయపఱచుకొను, నా జీవితములు, నిమిషములట్లు. శీఘ్రముగ చెదరిపోవుచున్నవే కాని, పోయినవే యజ్ఞాతమార్గమున మాసిపోయెనో, వెనుదిరిగి యొక్కటియు రాలేదు! అందరిని దిగ్భ్రమింగుచు, అవ్యాహతము ననంతగమనమునగు, కాలమున కావంతయు, విశ్రాంతి లేదు కదా! ఈదిన మాదినమని నీవు చేయవలసినపనిని నిల్పియుంచితివా, నీవే, కాలమున కెరయౌదువు! కాలమే క్షణరూపమున, నెప్పుడో, దేశార్థవస్తువుల కైక్యత కల్పించునది! కాన జాగ్రత్త!

84. సద్యఃపాతములోనే, విద్యుచ్ఛక్తి యుదయించునది కాని క్రిందపడి పారిపోయిన నీళ్ళలో ప్రయోజనముపుట్టును! జంకితివా, ఘోర లహోరాత్రములై, యొగిరిపోవును! వేచియుంటివా, నిన్నే కాలము, గజేంద్రుని పాదములను మకరివలె పట్టి లోనికీడ్చుకొనును! దుఃఖించితివా, నీ యునికియే కాలవ్యాఘ్రము గోళ్ళచే చితికిపోగలదు! కాన జాగ్రత్త!

85. భీరువుగాక, ఆలసింపక, ఆరాటమున కవకాశమివ్వక, వెనుదిరుగని యనంత కాలగతితో, నీవు నవిశ్రాంతుఁడవై, యద్యైకకర్మలలో నుద్యుక్తుఁడవై, సాగిపొమ్ము! ప్రతిఘడియయు, నీ ఘనకీర్తి కాలవాలమగును! కాలమే ప్రకృతిపురుషుల నాటకశాలలోని వెలుఁగు కాన, స్థితిశూన్యాపర కాళరాత్రి రాకముందే, కాలజ్యోతి యస్తమింపకముందే, ప్రబుద్ధుఁడవు కమ్ము! లేక పరబ్రహ్మమునందు, నవ్యయామనస్కయోగివి కమ్ము! జాగ్రత్త!

86. పాంచభౌతిక ప్రకృతికి, వ్యక్తిభావన లంటుగట్టుటకన్న నాకేమియు కర్తవ్యమే లేదని. నవ్యయువక శుభక్రియాశయ శూన్యత కిరవుగాకుము!

నీవు చేయవలసినది యల్పమేయగుగాక, నిండుమనస్సుతో, నిశ్చలాస్తిక్యతతో నిర్వహించి, యఖండమగు నక్యాలికేగుము! సహస్రకోటి విస్ఫారిత వీక్షణములతో, సహస్రకోటి యుగధారియగు నమేయ విశ్వపరమాత్మ, నిన్నే లేవనెత్త జూచుచున్నాడు! నీ పతనిపై మాపునిక్కించి, నిజముగ విశ్వసించితివా, నీ సన్నపనినే యసామాన్యముగ మార్చి, తన సన్నిధిని నిన్నున్నతునిగా జేయగలడు.

87. పడినకష్టముల పాటించుకొనక, శూన్యతను సుస్థిరమనుకొనక అదృష్టమున కర్తృత్వము వేయక, నీ కబ్బినంత సత్కృతిలో, నిరతుడవుకమ్ము! వీడని యుత్సాహముతో, నిశ్చలమగు నిశ్చితముతో, దృఢమగు ధృతితో, మహోత్తమ మానుష్యతతో, నుడుగక సాగిపొమ్ము! వేగిరము తయనించి, పెంపలకడనే, పక్షులగీతములు నింగిని నిండించునప్పుడే లెమ్ము! సత్కృతికి బహూకృతి, తన్మధురస్మృతియే యనుకొమ్ము.

88. పరస్పరనిందలతో, పవిత్రజీవితమును పంకిలమొనర్చుకొనకుము. కానిపనుల కానించి, కలుగు నసంతృప్తితో కుటుంబ కలహములతో, కలతల కామింపకుము. లేబవళ్ల శీతోష్ణతలకు నేసగించుకొనక, సదాత్మ సంగతుడవకుము. అవకాశములను, సునిశిత వివేకముతో, జాగరూకతతో, చయ్యన నందుకొంటివా, ఈశ్వరుడు నీ కమితసంపదల ననుగ్రహింప గలడు

89. నీవు కట్టగల్గినదే, నీజీవితసౌధము! మంటితోనా, మంచి చలువరాతితోడనా, యని తర్కించుచు మిన్నకుండకుము! ఎండవానల నాపి, నీ యునికి కనుకూలించునది, యింటిభద్రతయే కాని యింటి విలువకాదు! జీవితము పరమప్రభుని యొక విడిదినుండి మఱొక్కవిడిదికి యాత్రయే సుమా! విశ్వవిభుని వీక్షణములలో నీయొనర్చిన కృతిలోని శ్రద్ధయే, వివేచింపబడును కాని (రాళ్ళను మెఱ్ఱెయయిన) రత్నముల, వరవర్ణముల, మూల్యము ముఖ్యము కాదు.

90. అంతరియాత్మ నాపరమాత్మలోనిదే! ఆయా యాత్మల విజ్ఞానవ్యాప్తు లాయగాధ సూత్రాత్మాంబురాశిలోని తరంగములే! ఆన్ని విప్లవకాంత్రులు, నన్ని భూకంపములు, నన్ని యదృశ్యములగుచున్న పృథ్వీఖండము. లవినాశియై అనాద్యంత మూలమూర్తియగు, నతని యుచ్ఛ్వాస నిశ్వాసములే! మహామహిములై వెలసిన యవతారపురుషులందరు, నా యఖండాత్మలోని, నిజయోగ్యతానుసారి ఖండాంశములే! కాన, నవతరణోత్తరణముల యర్థము నందుకొమ్మ!

91. మనము నమ్మినను, నమ్మకపోయినను, ప్రకృతి పరిధానమును ధరించి, యహోరాత్రము లతఁడు, తన యొడిలో, మనలను లాలించుచునేయున్నాఁడు! ఆ యపరిమితార్థ పరమాంభోరాశిలోని, నీల శ్యామల జీవవీచికల కల్లోలములు, కలఁగక, నానంటతీరము నొరయుచునే యున్నవి! అసంఖ్యాక జీవలోక నౌకాసహస్రములు. సహస్రముఖముల, నుపరిభాగ సుశ్వేత నిశ్శబ్ద నిబిడాంబరముదాటుచు, తేలిపోవుచునే యున్నవి! ప్రభుని త్రసరేణు పరిమాణముకూడ పోల్చిచూచిన, లేని, యీ యల్పభూవలయమున, తన గెల్పు బావుటాను పైకెత్తి పట్టుటకు, మానవుఁ డార్భటించుటచూచి, యా యనంతావకాశమయుఁ డేమని నవ్వుకొనుచున్నాఁడో!

92. అల్పావకాశ, దినదినాయుక్షీణ క్లిష్టుఁడగు మానవుఁడు సుస్వార్థాత్మాభిముఖుఁ డెప్పుడగునో, అప్పుడే విశ్వవిభుని దివ్యానను డెఱిగినవాఁ డగును! ఆత్మాభిముఖుఁడైన వాని కన్యాయప్రసక్తి యలవడదు! ఆత్మోద్ధరణ కనుకూలించు నాత్మహితావలోకనమే, యమరును! ఆత్మార్తిని బోనడంచు నదే సత్ప్రార్థనము!

93. సచ్చిదానందమే, సత్య సుందర శివ స్వరూపమగుట మానవుని నత్యుచ్ఛ సత్యసుందర శివస్థాయికి జేర్చునది [illegible]మందిరములు, సర్వసహ్యాసములు, నామచిహ్న[illegible] కావు! మతి

మొత్తమానందసిద్ధికో సంగీత చిత్రములు, గ్రంథములు, గీతములు, కావ్యములు సాధుసజ్జనాచరణలు, [illegible] మతమే మానవ పశుపక్ష్యాది సకల జీవకోటిని. [illegible] సృష్టినర్తయును, [illegible] యావద్విశ్వ మాపరాత్మకు ధామమని, [illegible] సుజీవనవృత్తి నవలంబించి, యవ్యాజ ప్రేమభావమున, [illegible] క్రియా సమర్పణ తన్మయతతో, నారాధించు వాని, ప్రార్థనమే. [illegible] ప్రార్థనము!

94. బలవంతునికే జయము వేగవంతునికే గమ్యస్థాన గమనము, న్యాయవంతునకే యాత్మ సామరస్యము లభ్యమగునను కేవలము తప్పటడుగులు వేయుచున్నను, భగవంతునియందు భక్తిశ్రద్ధలు గలవానికే పరమార్థము దొరకును! భవిష్యద్విశ్వమున ప్రేమభక్తులగు కవులే ఋషులుగను, పవిత్ర సందేశములే పావన మత గ్రంథములుగను, వేదాంతులే జగదుపాధ్యాయ తండములుగ నుండగలరు! ప్రేమయు, స్వపర సుఖకాంక్షియు. నిర్వంచన ప్రవృత్తియు ప్రధాన సూత్రములుగ నుండగలవు! శ్రీ జీసస్ ప్రభువును, శ్రీ అరవిందయోగియు నట్టి దైవరాజ్యమునే సూచించిరి!

95. హృదయపూర్వకము, నాత్మాంతర్నిర్గతమునగు, భావాతురతరమే, ప్రార్థనావృత్తి! దానిచే నాత్మపంకజముపై, పరమాత్ముని యనంత సవితృ ప్రకాశము ప్రసరించును! త్రిపాంసపతిచెంగట విషచ్ఛాయలే కాదు, తెలిమబ్బుల చీకటియు నిల్వజాలదు! అప్రభాత మాశ్రయించినవారిని చిరకాల మఘ క్లేశాంధకారములు గ్రమ్మజాలవు!

96. పరమాత్ముడు. పరంజ్యోతి, పరాత్పరుడు సర్వవ్యాపక సచ్చిదానందమయుడై, సత్య శివ సుందరాకృతియై యున్నాడు; కావున గుడికట్టి యతనికి పరిమితివిధించు టల్పవివేకమే! సకలజీవులు నాతని కావాసములే! మన యంగములన్నియు, నతని కంగములే యగుటచే మన బలమంతయు నతని [illegible]!

97. భూతకోటి, జీవకోటి, ప్రాణము, ఆత్మలు ఆతనిలోనే యావిర్భవించు చున్నవి. అనాదిగా సత్యముగనుండిన సత్యము నేడును రేపును సత్యమే. సత్యము శాశ్వతమైనది. ఆసత్య సత్తే తుమ్మెదలో, కలవింకములలో ఖడ్గాది మృగములలో, మానవునిలో, తళుక్కు తారకలలో ప్రవాహరూపమున, నన్నిటను పాఱుచునేయున్నది.

98. ఆ సత్యసత్తు సాన్నిధ్యముననే, సర్వమహిమలు సాగుచున్నవి. ఆయా వేళలలో, నాత్మరక్షణములలో, నవతారపురుషులలో, నాపద్వినివారణములలో, అధర్మక్షయావసర ప్రళయములలో, నాసత్తు, యకస్మాత్తుగ విజృంభించి, యంతర్హితమగుటయే మహిమ! ఆమహిమ సజ్జనులగు నాత్మవేదులకే, స్థూలాపరోక్షముగా స్ఫుటమగుచుండును. అఖండ చిత్సత్తాకృతియగు, నిజాపరోక్షానుభూతి, యావిధ సులభసాధ్యము.

99. అన్నిట నాత్మవంచన లేనివాడే యనఘుడు. నరుడు నశ్వరమగు తనువునకై నాయకత్వ మపేక్షించి, సర్వజనులకు సమమగు, నాత్మయందు వంచనకు వంగినప్పుడే పాప మొనరించును. యథార్థవాది యాత్మవంచనకు యత్నింపడు కాని పౌరుష్యమునకు పాల్పడును. ఒరులయెడ సుముఖత కొఱవడనిచో నాత్మాభిముఖములగు, నన్ని సద్వృత్తులును పవిత్రములే!

100. పరము లేదు; భౌతికసుఖమే లక్ష్యమని, నోవ్వని నాలుక, నుడువుచునే యుండును కాని యంతరాత్మ సర్వజీవులలో సత్యపరమునే సంస్మరించుచున్నది. విశ్వాసము, సత్యపరములో, వెలయింపని మానవుడే లేడు! యథార్థవిశ్వాసము, మహాశక్తిని లోపల కలిగియుండియు, కార్యనిమిత్తము కప్పిపుచ్చుటయే వ్యావహారిక మిథ్యా జగత్తున కుపాధియగుచున్నది! కప్పుటచే, తనయాత్మయే కనుమఱుగై, సర్వమును తుదకు శూన్యమగుచున్నది.

101. సత్య సిద్ధాంతము లన్నియు, త్రికాలాబాధ్యములై, హింసాదూరములై, యాత్మనుండియే యావిర్భవించుచున్నవి. అది యట్లగుట, నేవ్యక్తియైనను ఆత్మహింసకుఁడో తద్వ్యతిరేకియో కాకతప్పదు! అన్యాయభోగము లభిలషింతువా, ఆత్మసేవ యబ్బనేరదు! అఖండసత్యము నాశ్రయింతువా, యొరులకు లేని భోగములు నీకు కలుగనేరవు కాని, యనంత శాంతి సామరస్య సుఖము సిద్ధించి, యుత్తమ మానవత కారోహింతువు.

102. ఏభావముతో నున్నను, 'అహం,' నిలిచియే యుండుట మానవ జీవితము! ప్రేమతోడి, యహం సత్త యొకటే, సాత్త్వికమై, సార్థకమైనది. అనంత విశ్వప్రేరణముచే ననేకులు, కళత్ర పుత్ర బంధుమిత్రాది రూపముల నిన్నలరింప, శత్రువులు కృత్రిమ సంత్రాస తంత్రములచే, వంత గూర్తురు. వారును వీరును కొంతకాలమున కంతరింప సంతత జీవాంతర్యామియగు, ననంతుఁడే యంత్యమున శరణ్యుఁడగును.

103. మానవ జీవితమానములలోని శతాబ్ద యౌవన దశాది భేదములన్నియు, కాలాగ్నియగు సవితృమండలమునుండి భగవానుఁడు క్రిందికిజార్చిన దారపు పేకలు! వానిని, నేసి, వలయు కష్ట సుఖ వస్త్రములను దాల్చి, ముందువ కన్వేషించుటయు కాక, పైకి నాలోకించితిమేని ప్రభుసన్నిధి, మనకు ప్రాప్తించును. ప్రభువు ప్రకాశము మార్గమును జూప పరమార్థముకొఱకై పయనింతుము! అఖండ జ్ఞానాకాశ భానుభానువు లనంతావకాశములో వ్యాపరించియుండ, అంత్యమువరకు నడచిపోయినను మానవజీవిత మొక యల్పాల్పమడియలో మునిగిసి, సత్త్వప్రధాన మయ్యేనేని, పరమాత్ముని యొడిలోనే, పండి పడును.

104. ప్రతిజీవికి, ఫలవంతమగు నొకశక్తి, యొకకళ, యొకవిభూతి, ప్రభు డిచ్చియే యున్నాఁడు, అది యాత్మారాములు, కష్టసహిష్ణువులు, నిత్య సంతోషులునగు సత్పురుషుల సాహచర్యముతో దోహదమంది పక్వమగును.

ప్రాణేంద్రియములుకూడా ప్రభునిసొత్తే యగుటచే, మంచితనముతో మనగల్గు చున్నాము! స్వీయ కలహకంటకిరమైన సామ్రాజ్యము చీలిపోవునట్లే, చీలిన సంసారములు చెడిపోవునట్లే, నిర్వాంతరాత్ముని విశుద్ధపాలన క్రింతుల ముగా నుండవలసిన మానవులము, పరస్పరాక్రోశావేశ క్రోధ పరవశుల మైతిమా, నశింతుము!

105. అవశ్యకముగ, మనము ప్రభువును మనఃపూర్వక మాత్మానందాను భూతితో, ప్రేమించి, యతని ప్రేరణము నాజ్ఞగా గ్రహించి నడచుకొనుట ధర్మము! మానవులసురులవలె దుస్స్వార్థులును, దేవతలవలె నిస్స్వార్థు లును గాక, సుస్వార్థపరులగుటచే, నిర్వ్యాజ సత్క్రియాపరంపరయే, విత్యవిధియై యున్నది! బుద్ధునివలెనే, ప్రాప్తముదులై, పరమార్థమున, స్వార్థలాభమందుచు, చక్కని మానుషతతో ప్రవర్తించిననాడే, దైవ సామ్రాజ్యము సిద్ధించును! అమానుష హింసాక్రియలనువీడి, అతి ధర్మోప కృతులకై స్వాత్మశక్తులను వెచ్చించుట యుడిగి, ఆ ప్రకృతి పరమాత్మల యడుగుజాడలలో మానవకోటి యనంత శుభానందస్థితి, స్థిరత నందుకొను గాక!

106. ఒకానొకనాడు, ప్రళయావసానమున, ప్రభువు జీసస్సు పరమునితో కూడివచ్చి, భక్తుల నుద్ధరించుననుటలో, మనతో పరమాత్ముడు సాక్షిగ నున్నాడను నిజము, తెల్లమగుచున్నది! శివ, వశిష్ఠ, వ్యాస, బుద్ధ ప్రముఖు లవతారు లందరును, పరముని మనసార ప్రేమించినవా రొకరిద్దరుండినను వారి యాత్మలలో ప్రత్యక్షముగ నుందురు! మనసార ప్రేమించి, సద్వృత్తి నవలంబించి, పరమునియందు విశ్వాసము దృఢముగనుండుటయే, మానవుని విధి! తక్కినది సర్వకర్తయగు భగవానుడే, సత్సంఘ ముఖమున నిర్వ హించును!

107. వసిష్ఠాదేశముచే, విశ్వామిత్రుని బుద్ధిబలముచే, రామరాజ్యము సుప్రతిష్ఠిత

మైనట్టి, చాణక్యుని రాజ్యాంగవిశిష్టతచే చంద్రగుప్తాశోకుల, దుర్నీతిదూర, ధర్మసామ్రాజ్యములు ప్రవర్తమానములయ్యెను! దుర్వాసనా రాహిత్యము, ధర్మసంరక్షణము, నిశ్చయ సత్య తత్త్వజ్ఞానము ప్రధానముగ పాటించిన శ్రీ విద్యారణ్య మాధవాచార్యులచే, హక్కరాయాదుల పాలనము పొంగులువారినది! అఖిల ప్రజాసముదయ సౌఖ్య సామరస్యమే యభినందనీయమన్న శ్రీ సమర్థ రామదాసుపథములో మహారాష్ట్ర సంయుక్త రాజ్యవ్యవస్థ సాగిపోయినది! ధర్మసంరక్షణము, నేకలక్ష్య నిశ్చితజ్ఞానమును లేనందుననే, యని కొంత కాలమే నిల్చి, కుంఠితములై పోయినవి!

108. విఖ్యాత తాత్త్వికుల వివిధాశయములు నానుభూతిలో సార్థములై మీ నానుములోని వచనపుష్పములై పరిమళించినవి! అయా తోటమాలుర కంజలులెత్తితిని! యుగయుగములనుండి యానందానుభూతిని ఫలోన్ముఖముగా నొసగించిన యర్థము లాస్వాదనీయములే! శ్రీ మాధవ విద్యారణ్య కృత జీవన్ముక్తి వివేకమును నాసూచించినటు లాధునికుల కన్వయించుటకై నాల్గేసి వాక్యము లొక్కపేరా (వచనఖండము)గా, నల్లిన, యీ యథార్థ సుమమాల, పంచాత్రిర చక్రతీర్థ కోదండరాములకు వైజయంతివలెనే, ప్రియతమ మగుగాత!

[ వరా:—(1) సర్వమునకు బునాది, యొకండగు భగవంతుం డొక్కండేయనియు (2) ప్రకృతి మహత్త్వాహంకార పంచభూతాఖ్య నవ తత్త్వాత్మక బ్రహ్మాండమే. భగవదాకార పరిణతమగుటచే, పంచతన్మాత్ర దశేంద్రియ ములకూడికతో, పిండాండములో ప్రతిబింబించి, జీవదేహాకృతి దాల్చెననియు (3) విగ్రహారాధనమొదలు విశ్వాంతరాత్మధ్యానముదాక, తన వారిని తన్ను, సాధుటాపిగా దీన దరిద్ర పోషణమునకు యథార్థధర్మములేమనియు (4) ప్రకృతిమొత్తో విస్వార్థము నటులే సాంసారికవ్యక్తుల కవలంబనీయము కావనియు (5) [illegible] కాయలకు వృత్తి క్రియ లన్నియు,

నివృత్తికే దారితీయుననియు (6) విశ్వజీవుల పరస్పర శుద్ధ ప్రేమానుబంధములో, భగవల్లీల యిమిడియుండుటచే. సన్ని యానందములు భగవన్మయములే యని యెఱింగి, సుఖింపగలవాఁడే ధన్యజీవియనియు (7) నాత్మవంచన లేనివేవియును నింద్యములు కావనియు, (8) నిజాత్మవంచనయే యఘమనియు (9) మన్మనోవాసనాక్షయ మొనర్చిన, నిశ్చిత సత్యాత్మజ్ఞానముతోఁడి, భగవంతుని యెడలి యచంచలవిశ్వాసమే, జీవునకు పరమముఖ్యమనియు, గృతికర్త యభిమతము ]

ఓం తత్ సత్

---

ఆ పాతాళయులః ఆహ్వాతాళయులు భీతినివిడిచి
ధాతలః తామైరి — త్రాతలు తామైరి! 6

శక్కరింపులకు వెట్టియోదార్పులు, వెలుగుః గొల్పగా
కలుపని సాయపు చలితుషారములు, విసుగునింపగా
భుగభుగ లెగసెను — నిగనిగ పగలా — పొగలు మింటికెచట! 7

కూలీల గోలాల, చప్పట్లు, తప్పెట్లు
బాజాబజంత్రీలు, మేళాలు తాళాలునై
కంటుగట్టుకొని మూకలుబట్టిరి, బ్యాస్టిల్!
పరాసువిప్లవ పదులను కొట్టిరి, పట్టిల్! 8

ఉండెను వీడుల గుతర్కకీలలు
మండెను మూలల నశాంతిజ్వాలలు
దండిధనంబుల మిండలుగూలగ — త్రోపేలిరి!
స్వాతంత్ర్యం — సౌభ్రాతృత్వం — సమానత్వం! 9

వల్లకాటినిమించు గిల్లాటీనున దంచి
తల్లి వెల్లర నల్లరయే — వెల్లుతో గ్రహల నింకఁగా;
తల్లక్రిందుగ దిప్పి రాజ్యము పొల్లుప్రజ పడకైవఁగా,
కొల్లలుగనయ్యె నల్లరు లాత్రి పోదరయ్యె! 10

ఉల్లముల దార్జన్యపారము లుడుకు లెక్కగనే
ఎల్లరా ర్తులె! తల్లడిల్లగ — కల్ల కలలయ్యె!
పల్లముల కల్లోలములతో కరుణదీపము లారిపోవగ
మొల్లమెదిగిన తరుణకల్పిఃన ముల్లివలె రుచియయ్యె! 11

జీవనాడుల చీల్చి చిచ్చిడి, పోవువారై భూరిరోధులు
చావుటంకెల స్థానమెక్కగ గావుగొవిరి ధనాఢ్యు లెందఱినో!
రావులాలుకు సుఖంపుదీవుల, నీవులిడు మహనీయులెవరో! 12

ఆ భయానక ఘోరస్సువిప్లవ మగ్నిగుండము మధ్యలేచెను
దిట్టరైరి యొక దృష్టద్యుమ్నుఁడూ
కట్ట కట్టెల విచ్చినట్టుల, నిట్టనిల్వున చివరి చేలకు
దొట్టిగిట్టిరి వీరనాథులు, నొట్టుకూ ఫలమేమికి? 13

భూమిపుఁడీల్గిన గ్రామునేలు లేచెను
లూయియు జచ్చి, నెపోలియను హెచ్చెను
కదలిన చక్రికె క్రమ్మరె నరదము! విప్లవ ఫలమేమీ? 14

తాలిమి పరుల సుశీల జ్వాలలు, నీలినింగిలో పొలివవి!
ముష్టివారల యీలలలోన, కష్టాశ్లిలము లూఁదినవి.
భ్రష్టజీవులా నష్టమాలలు, దుష్టములై పెచ్చుగుళ్ళినవి!
కోలుకోనని ధంవనంబుల, కోవిదు కోర్కెలు కూలినవి! 15

దుస్స్వార్థం బొయలకుదప్పి; నిస్స్వార్థం బాత్మకె నొప్పి!
సుస్వార్థం బే జనతకు మెప్పో, నాశ్వాసం బతుకుల బొప్పి!
సిద్ధమిద్ధమని, మధ్యమార్గమును, బుద్ధుఁడె యొల్కెను
శుద్ధుఁ డశోకుఁడె శోభిలజేసెను సొంపుగా! 16

రక్తపాతము వలదోయీ! వక్తముండగా వలదోయీ
యుక్తిసక్తుల యోగ్యధనికుల శక్తిహైన్యము వలదోయీ!
వ్యక్తిసద్గతి బొల్లుసేయక తక్తులీడ్చియు నూడ్చివైచియు
రక్తి సమసౌఖ్యముల నందరు రంజిలండోయీ! 17

రుధిరబిందువు లెందుజిందగ వధలు హత్యలు గ్రందినంతనె
పరులధనముల బొందినంతనె, పురుషకల్మియు పొల్లిరాదోయీ!
కూఁడుగుడ్డల కొఱతలేకయె, గూడులూడని వ్యక్తిబాధ్యత
కూడనిదె, పరిణామ మొనగూడునేమోయీ? 18

వ్యక్తిసాహసమాత్త ముద్యమశక్తి యాశలు వ్యక్తులకె కావాలి,

కీలాక్షి దీప్తుల లాలించె నాదేవి, కాల కాలుని రుద్రుభజిని! 33
మాటరీతులవి, పాటుకు బడగాచే
దూటి వధమ్ముల, గోటికి బడగత్రెళ్ల
కోటికిగూల్చిన కూటనీతి కటు కాలకూటమే ఫలమా? 34
వియంతరాజ్యం! క్రమించి ధనముల నయించి రిత్తపుల
న్యాయంబేదో? అన్యాయంబేదో?
ఏమయ్యిందీ యొక్క గబల్కుకు. ఆయోమయం రహస్యమదియే! 35
అజాలలో పరరాజ్యములన్నియు నోజగ్రహించుటయే
రాజహార్యలకు భాజనమై ప్రజ, బానిసలగుటయే, పాడియే!
మోజాగజెప్పిన భాషలన్నియును మృషలేనా? మృషలేనా! 36
రాజులగాదని రోజుపెద్దలే, రాజసమును జేపట్టంగలేదా?
ప్రజలే దాసుల గుమియయి, పాటుల, బడలేదా? చెడలేదా?
దేశము ద్రైవంబొకటియ యగుచో, జీవులె దేవులు కారా!
నదీ నదములై గదురిన శవముల నెత్తుర కిదెఫలమా! చలమా? 37
ఒక్కవేషము నొక్కభాషయు నొక్కమతమాచు
నొక్కయిష్టమొ, నొక్కతిండియొ, మొక్కవోవక మొనసినజ
చొక్కమా సత్యమతె యదియును, శూన్యమైతే నక్కకోమ్మోయీ!
ఒకనివలె నింకొక్కడుండడు, నొకతెవలె నింకొకతెయుండదు
ప్రాకటమ్ములు సుకము శోకము లొకటిగానె గన్పట్టునా!
వారివారి తలంపుగోలదీ, జీవితంబులునూ, జీవసంపదలూ 39
ఇష్టమున్నను లేకబోయిన, సృష్టియు నిజమోయీ,
కష్టసుఖమ్ములు, సృష్టిజనులకు, నొక్కటె కాదోయీ,
దృష్టిద్రష్టలు దృశ్యవర్గము, నష్టములా కావోయీ, 40
నీలోనీవే దేవుడవోయీ, వేఱుగ దేవుఁడు లేడోయీ!
పెక్కురీతుల్, పెక్కుపోకల్, పెక్కుమనసుల మమతలలో

అక్కడలేదో ఎక్కడైనా, నీవొక్కడవేనోయీ
ఒక్కడవైన పెక్కురూపుల నొక్కవిధానం. రుచి కాదోయీ 41
మాన క్లిష్టగతి నడుపన్నాదులు, మానవులందరి కున్నవియే
యుండగజేసిన, తిండియుజాలిన, నుండకపోని మ్రితరభోగములు !
భూషణమదెసు వ్యాత్మోద్ధరణమె ! ఆశకువలకే అంతం? 42
పొరలిపొంగి యశాంతికరటా ఉరలిదేశ విదేశములనూ
ఇరవుగెల్లనునిండ. నరునీ, దురిత-చింతలు, తరలితెరలెను,
శరము దుఃఖ నిశీథతమసోత్కరము కూడలి, లోకపథమంతా ! 43
శీలాన్నాత్మల పాలనపుష్టియె, జీవన పరమావధిగా ;
నోలిమహాత్ముఁడు, తథాగతుండూ, తేటతెల్లమునరే !
స్త్రీలును బురుషులు లీలలనొక్కన, నడవడి చెడుపోవే !
బలాత్కృతి హత్యాప్రలోభగతులే, పాపనిమిత్తములోయీ ! 44
హాయిగ నందరి కన్నము నీడయు గుడ్డలు కూడినను,
ఆత్మోన్నతికయి శీలాభ్యుదయము గూలంకషమైనా
పాడుపడవు లీకెండలకొలక్కై ప్రాకగ వలదోయీ ! 45
హింసాదేశం, హింసావేశం, రాజులదని, గోజాడుచునే
హింసాకాండకు, పరాక్రమణకూ, పూనెనుసామ్యం ! స్వామ్యం !
రక్తదూషితము కాని విప్లవమె, శక్తికి, మానవరక్తికి, గుఱుతోయీ !
అనుదిన భోజనవసతులనే, అనుమానించెను స్టాలిన్
కవిష్ఠ కఠినత కనీకనకనే; అనునయించెను స్టాలిన్,
తనకబ్బినదే, ఘనభోగముగా, గౌరవించె, గాంధీ !
జనులెల్లయునూ, కనిమెచ్చినదే జయపెట్టెను గాంధీ ! 47
శేపమాత్రకు లవి చేమఫలంబుల విడుగుట నైజంబే !
పాపపరిణతియె కాఁపగు హింసకు, వరలత్వమ్యము లెట్టున్నా !

సహజసామ్యమే బహుళసుఖోన్నతి బలుపును శాంతియుతంబై. 48

## భారత స్వరాజ్యోద్యమము

పరిణతవాదివి కవి వీక్షితే, దౌష్ట్యం. వాణిం, కాదోయీ!
అగ్నికిరీటపు టలజడితో జన మలపటింప వలదోయీ!
అంధువవాచు వసలును మఱతువె? అక్కల చెలామణీ! 49
అత్యాచారం మాంసాహారం బని మాన్పిరి బౌద్ధులూ!
సత్యాహింసలు సారాచారము లని విన్పెను గాంధీ!
ధృత్యున్నతితో నాతనిజాషల, శలదాల్చిరి జనులూ! 50
భారతసంస్కృతి వాది సావర్కర్, తిలక్సుభాషుబోసులూ,
వీరులు, లజపత్రాయి శ్రద్ధానందులు నెహ్రూలూ,
ధీరుల స్వజనుల ద్వేషుల జూపెను తెరువుల జనరైరీ! 51
హింసకు బ్రతిహింసయనుచు, శంసించిన వారెల్లను
దుష్టప్రభువుల నష్టపఱుచు కృషి స్పష్టముచేసిరి, కానీ,
శిష్టుల విమతుల గష్టపెట్టుటకు, నిష్టమె పడరైరీ! 52
గాంధీతాతకు జై జోడించీ, పారతంత్ర్యం బాపనెంచీ
సుభాషు దర్జా సింహగర్జనలు! — సింహగర్జనలు!
విభేదభారతి శ్రుతికందినదీ — శ్రుతికందిందీ!
ప్రభాతఫేరీ, పరదేశములో, వఱలింది! 53
ఝాన్సీరాణీ చాతుర్యమును, తాంతియతోపీ, ధైర్యసాహసము,
స్మరణకు వచ్చినదీ! తరుణము వచ్చినదీ
సుభాషుబోసే, సవ్యసాచియై, సంగరసింహంబైనాడు! 54
దేశము వెలుపల సుభాషుబోసూ, దేశములోపల కృపలానీ,
చెరసాల మోపల చిక్కి సుక్కి, గురువు లజాద్ పటేలురూ
తరిజావ్యాదయమున గాంధీశక్తియు, బ్రజ్జ్వలితంబయ్యింది! 55

మన వరదాతా! గాంధీజీ! — మన పరధాతా! శ్రీ బోసూ!
చేయు యుద్ధముల బ్రిటిషు సింహము, భీతిని జెందిందీ!
సుభాషుడన్నను స్వరాజ్యలక్ష్మిని! గాంధీ తెచ్చెగా స్వరాజ్యలక్ష్మిని!
సమయానకు నతుపలగూ సాంత్వన సూక్తుల కెరయాచూ,
చీలిరి పెద్దలు — చీలెను దేశం — ఇళ్ళలు శ్రామిత మింకెనూ!
పాకీస్థానం — భారతఖండము — ఖండితమయ్యిందీ! 57
"కలగన్న స్వరాజ్యం," గాంధీ, యిదికా దిదికా దన్నాడు!
"అర్థులకే అధికారం, కులాలగోడే వలదన్నాడు!
గాంధీచరితలు, కడు పవిత్రములు, గాలిలోనికే పోయెనా? 58
అర్థ్యాశ్రితులకు నర్యైవారికి నాదరువిస్తే తప్పేమంటారు!
నరులెందఱో పడి పస్తులుజస్తే, తప్పేమంటారు!
తిరిపెగాండ్రకూ, నాస్తియంటే, తప్పేమంటారు!
దీనులకూ, బల హీనులకూ, దిక్కౌగు రాజ్యంబనె, గాంధీ! 59
నీలిచేపలా నెట్టుటకొఱకే గాలము వేసేదీ!
చల్లలమ్మగ జాలుటకొఱకే, కల్లాలాడేదీ!
కొల్లగపదవులు గోల్కొనుకొఱకే, యిల్లిల్లూ దిరిగేదీ! 60
గాంధివేదమును వల్లెవేసియటె, కదిలితి మేమంటారు!
రైతుబిడ్డలా రసికవరులకే, రాజ్యం భోజ్యం బంటారు!
కూలీ కర్షక వికలాంగులకూ, మేలూ తీలేమంటారు!
కాలదేశముల కన్నొఱంగనిది, గాంధీ ధ్యేయం బంటారు! 61
అందలమెక్క దరుద్దైపోతే, తొందర బోయీ లెందుకంట?
బీదసాదలే బ్రదుకకపోతే, అఖండభారత మెందుకంట?
పొలములు పైరులు పండకపోతే, దున్నే కూలీ లెందుకంట? 62
అన్నముకోరి, యొట్టులుజాపే, దీనదరిద్రుల్, వికలాంగకోటికి

సుగతిని జూపండోయీ ; సుకవుల గూర్పండోయీ !
పైరుపచ్చలూ, పాడియు, సాధ్యత, పడసినవారికె, సౌకరియేలో ?
అల్పభాగ్యులకె, విద్వద్ఘనులకె, యమలినమతులకె, వలదో ? 63
రాజ్యాంగభృతుల్, రమణీయములని, రైతులు, నంటారా ?
ఉద్యోగము లూడిన, నగడగువారల, నూరక మనుఁడంటారా ?
విపులోద్యమములు, పేదబాలురకె, వీడుట మేలంటారా ? 64
ప్రాజెక్టుల నష్టైజము లానరగ భజింపుడనియెను శ్రీ నెహ్రూ) ;
వాజవులూరా పదవులనే, భుజింతుమందురె, తదితరులూ ?
రాజులవలె ధనమబ్బిన ధూర్తుల దూడలకే, యూడిగములా ? " 65
అందురు కొందఱు దీనదరిద్రులు, సారాసార విచారులై
ప్రారబ్ధములో రాజకీయములు, సారంబగుదాఁకా,
ఆరంభముననె కారమునూఱుచు, దూఱుట వలదోయీ ! 66
అజాను మేధా, గాంధి మాహాత్మ్యం,
తిలక్కు-త్యాగం, సుభాషు ధైర్యం,
అరవింద యోగం, పారయగమనుఁడూ! వారరయుచునున్నారు! 67
భారతీయతనూ, మనము జారవిడువగగాదు !
దుష్టశిక్షణ శిష్టరక్షణ, కోరయు టుడుగగరాదు !
భారతీయ శాంతివిధానమె, భారతీయుల ప్రబల నిధానం ! 68

## కర్తవ్యమేమి ?

మాయాలోకమని పాయగలే రెవరూ ! "మాయదులోకం!"
మాయయు సత్యమె, మాయసత్యముల మర్మము మనమేగా ?
వోయిలిరుగ్గీ, సామరస్యమూనె, తోరము గనుమోయీ ! 69
సత్య, రసాత్మక, పారవశ్యమే కావ్యం ! సేవ్యం।
వృత్త్యపదేశర, నీరస వాచోజృంభణ, కావ్యంబౌనే ?

శాశ్వత రసకృతి సామరస్యమే, సత్కవిత్వమగుగాదే? 70
సమసమృద్ధిగల శాంతిసురూపమె, హర్షుని వితరణమూ!
సమసమృద్ధి హితశాంతి విలీనతె, విక్రమార్కు మహిమా!
శాంతి సంప్లవక్రాంతి విభూతియె, గుప్త మహీపుల దార్ఢ్యమూ! 71
మహితవిప్లవ మమతకు ఫలమూ, పరిణతి మధురిమయే!
అహితవర్తన లంతర్హితమై, అందరుబ్రోద్యములగుచే!
అశోకసమ్రాట్, బాజీపీష్వా, ఆలపించి రీ యుజ్జ్వలగీతా! 72
శోపపుకత్తులు, పార్టీకేకలు, ధూపములును వలదోయీ!
పాపపువంతలు, లోకపు బ్రాపుల నూకి జెఱుచునోయీ!
లోకకల్యాణం! లోక సుజీవిక, నీ వాలోకింపగదోయీ! 73
ఏపార్టీ లెట్లుపెరిగినా, ఏపాటో, జనహితమై
ప్రాపును, దాపును, రూపును, నేపును, ప్రజ గనవలెనోయీ!
దీపంబాత్మకు జూపుచు జీవనశాంతిని జేఁపుటయే, కర్తవ్యం! 74
వివిధమతంబులు విభిన్నపద్ధతు లీభారతిలో గలవోయీ!
సుకరమంచు, పరమతరీతిని, నిరువురాంద్రనే చేశానిరీ!
వికలంబయ్యెను శాసనసంస్కృతి— శాసిత సంస్కృతి వలదోయీ!
భాసిత యశులగు ప్రభు కృష్ణాదుల పాపులు గాదనెనూ?
శాసనసభలకు సంస్కరణాలకు, గాంధీ!, బంధము వద్దనెనూ!
వాసిగ, జనతయె వాంఛించినచో, మాఱునుసంఘము రూపంతా!
ఏసుగతులో, మన కీహితంబులో, యేర్పడునవియు, తమంతా! 76

రైతు రాజులును, బ్రిభువులుతామై, పొరయగవలె, సుండీ,
ప్రాంతిగ దీనులు, బీదసాదులూ, బాగ బ్రతుకవలె, సుండీ
నేతల కిది సాధ్యమదే, నీతిగ, బ్రిజ కాచరణము సుండీ,
గుగ్గిళ్లుతింటివా బసవన్నా, ఉంటే— ఆ ఊ—డూడూడూ! 77

వల్లెయనుచు భూదానము లిచ్చిరి, కోడలిత్తురే మనసా ?
పల్లెదరిద్రులు సాగుచేసియు, బాగుపడిందెవరే మనసా ?
ఇల్లిలుసొచ్చి బోధజేసిన, కులములుపోవునె మనసా !
సల్లలితంబగు సౌమనస్యమూ, సామరస్యమేదీ, మనసా ? 78
పలుగాకి పనులూ, పాడుమాలికలు, వాదములేల మనసా ?
స్వలాభదృష్టియు, స్వల్పచింతనలు, సమసినవియె, మనసా ?
కులమతములు పేర్చు క్రుళ్ళుపోకలను, కూలద్రోసిరే మనసా ?
వలసిన శీలాస్పదములు లేకయె, వచ్చునె మేలూ, మనసా ? 79
కవులు శిల్పులును, పాత్రీపాత్రుల కుడువగ రాదోయీ।
కాదని దుర్గణ కూటముజేరిన కవులు జాణలే, కాదోయీ !
శుభకర్తృత్వం, సహజస్వేచ్ఛా, వైవిధ్యసామ్యం, భావుకకవిదోయీ!
విమలాచరణం, విశుద్ధశాంతియు, జ్ఞానికి గావలెనోయీ ! 80

## సృష్ట్యాది దక్కను పీఠభూమి

ఆకసమంటే లోకబింబములు, సాకారములందంకూరములై
ఏకోన్ముఖముగ నగ్నిజ్వాలా, నిహ్నుతంబులై, నింగి దూఁటినవి !
వాయువులెల్లెడ వీచినవీ, పాయలపాయల జీల్చినవీ !
దిక్కువిదిక్కుల దేలెనవే, ప్రక్కప్రక్కలా ప్రేలెనవే ?
ఎక్కడిశెక్కడో క్రాలెనవే, పెక్కులు లోకము లెక్కనవే ? 81
అనంతకాలపు టాదికాలం ! నలువయంపిన తొలి "కాంబిల్యా"
వినూతనంబులు, కరుగు లోకములు, ఘనీభవించెను చల్లగా ।
'మాత్రికులు, కరులూ, మనిషికోతులూ, తొట్టతొల్తనే, తొంగిచూచినవి !
పాత్రికవవ్వియును భూములా ; భూములు వానిని సాకనూ। 82
చేరువ మింటిని గూరగరాక ; వెల్తురు తీవలు దూరగరాక,
శారలవంటి శారుక్షృతషముల, దట్టపుటడవులు దారినవి !

నదీనదంబులు గుదురులబడకే, సదాపాఱుచునె జారినవి !
అదే! అనాద్యప్రమేయకాలం! తృణానుసారిగ తూలే పోయినదీ! 83
నీలాంతరిక్షం వాలు బయళ్ళూ!
కీలాంకితంబులు, దీవులు, గుహలూ!
ఆచుంబితంబులు తీవలు పూలూ!
ప్రచురిత మా ప్రపంచ నరులకు,
విచక్షణయేదో? విహితంబేదో? 84
మన స్వాతంత్ర్యమె, మనుజజాతికెటు
ప్రసాదియయ్యెను! పుం స్త్రీ లలరిరో!
మానవభాసం బఖండదేశం
బూనిన దెప్పుడో; ఆత్మవికాసం?
పూనె నెప్పుడో, కూలము లంబుధులూ? 85
వైశ్రవణానుజుండైన రావణున
కాశ్రయమైనవి, దక్కను లంకలు;
మోదము లెచ్చియు జనత యలరగా
ప్రాదుర్భవించియు నాదిమ దక్కను
వైదికులకు నాస్వాదితమయ్యె అటు నిల్చిరి ఋషులూ. 86

## పంపాతీరము

ఆదిసృష్టిలో సృష్టికి నాదిని
సృష్టి మరుత్తులు, నాదము లూదినవీ!
నాదోదితయై, బోధరూపిణిగ
పంపాతట కళ, పంపగ భాసిలెనూ,
పంపాదేవిని, బ్రహ్మాత్మజగా, గనిరీ; 87
తుమ్మెద లేగదు తెన్నుల నడచుచు

కమ్మని వలపుల గ్రుమ్మరించుచును
నెమ్మది నడకల, బంపయు పాడగ;
స్వేచ్ఛాగానలయోచ్చగీతములు
ఊఁగెడు దెమ్మెర డోలలఁబడి, తేలినవీ; సోలినవీ! 88

నింపాదిగ డా బంపాతీరము, సొంపులు బెంపంగా,
తంపౌ భక్తియు దరిదాఁటి తూలుచు, మంపై మెయినిండా,
చలువ కలువలును, శశిధరు బిల్చిరి, చెలిచెల్వము పండా,
పంపాదేవి, నిలింపులగూడియు, నింపెను శివసేవా! 89

మాయనిపలుకుల, గాయము సోలుచు
తీయని వలఁపుల, మాయని తలఁపుల
సాయుధుఁడై మరుఁడోయని యార్వగ
డాయుమృగాక్షిని మఱువఁ డుమాపతి,
నాయకుఁడై తన పంపనూ, పంపనూ; 90

ఆమె తపమునకు, నామె రక్తికిని,
ఆమె హొయలునకు, నామనియగుచూ,
సోమశేఖరుఁడె, యామెత లిడుచూ,
ప్రేమనుగన్నడె, గోముగ, బంపకునూ;
ప్రేమదామ సుమపాశ, బద్ధులై రిర్వురునూ; 91

పంపాపతియూ, పంపను బాయఁడు
పంపాతట మిల, పెంపు వహించెను,
పంపయె హంపీ! హంపియె తుంగా!
సొంపగు పంపయు, శంపాలతవలె
నింపెను, గీర్తుల, నిట్టలమగు, కాంతీ! 92
చరితాంబుధములు గొఱలెను పంపా పగపై!

ఆ హరిశ్చంద్రుఁ డిట కరుదెంచెను తానై ।
జానకి జాని వసించె నయ్యెడనె, ప్రాపై ।
శాతవాహనులు పాఁతిరి రాజ్యపుజెండా ।
ప్రాఁత తెనుంగను వాణి యాడెనఁట చెండూ । 93

వరదాయకుఁడై పరమ శివుండే
నరపుల బ్రోచెను, సరసను గాఁపుండీ
నరసింహరాజ్యము, నరపతి సీమయు
వరుస నొక్కటిగ వఱలెను బంపాతీరములోః. 94

## శ్రీ విద్యారణ్యోదయము

ఆ ఝంఝామారుతం బా విభిన్న భారతం
ఆ ముసల్మా౯ గీరతం! విచ్చుకత్తుల్ విరిసినవి!
హెచ్చువేడిమి బెరసినదీ! పోరులు కురిసినవి!
అంతా ఘోరం బా ర్తియు ఘోరం! అంతా ఘోరం! 95

విమల విరూపాక్షార్చన కచ్చట
నమరి నిలింపులు గుంపులు గొనగా
ఆ పంపాపతి, శాపానుగ్రహ
దీపుని, దాపని బిలిపించె౯ ।
ప్రాపగు ధర్మము మోపె నీపుడమి,
నాపై వాణీవీణుఁడు మాధవుఁడే! మాధవుఁడే 96

పంపాఘట్టం — పంపాతీరం!
పంపారమణీ మణిహారం!
తుంగాంబు తరంగ విహారం!
సంగమ రాజ్యవిచారం! 97

అవతరించినాఁడూ! సహకరించినాఁడూ!

పులకరించినావా! నిలువరించినావా!

సామ్రాజ్యస్థాపన సవనకర్త యతఁడే!

కలఁతఁద్రెంచినావా! తన్మ్రొఱంగినావా!

విద్యారణ్యుఁడు! — వీరయోగి యతఁడే! 98

ధూమకేతువుల తొలఁగగ గొట్టెను

పామరు లెందఱో పరమవీరులైరే।

భస్మమాహాత్మ్యమొ! సాయని మహిమయొ।

పంపాతీరం! ధీరవిహారం! శూర కాసారం! 99

విపులశౌర్యముల విమతుల వెన్నంటి,

విక్రమరాజ్యము సక్రమపఱచెను మాధవుఁడు।

రెపరెపలాడెను, కిటిరాడ్ధ్వజములు! శాంతియు గొలిచెనుగా! 100

కొదవలులేనీ! అడుకులులేనీ!

శరదిందు రాత్రుల సరవిని, బ్రదుకయ్యె!

కుందక కుంధుదీర్పగా, మందమనీషులు మందుకు లేరైరి. 101

అంతకుమునుపై చాణక్యుఁడొకఁడే!

అంతకువెనుకై సమర్థుఁడొకఁడే!

భగ్నజీవికల నగ్నాకృతులా అగ్గిమండే అవములగునని

యుత్తమపాలన ముక్తిని బలిపిరి

ఉద్ధివారికిని, విద్యారణ్యుఁడె! విద్యారణ్యుండే! 102

కొండకోటలే రెండుశతాబ్దులు, మెండురిపులకూ

మిండలగుచు గాఁపుండినవీ! ప్రాపుండినవీ।

దండియైన బ్రహ్మాండతేజమది, విద్యారణ్యులదే!

విద్యారణ్యులదే! 103

అనవధిసాగరం బనంతాంబరము!

ఆ సామ్రాజ్యం బలరెనోహో!
ఆ శాంతకలాపం బమరెనోహో!
ఎంత గభీరమొ? ఎంత సుందరమొ?
ఎట్టిమహోదయ మెట్టి శుభోదయమో? 104
వ్యత్యయపథముల, భాగ్యజీవికలు!
నిత్య వసంత వినూత్నోత్సవములు!
సత్యవేదముల, సమభి వ్యాఖ్యలు
వర్ధిలె నెల్లెడ, వర్ధిలె పల్లియలోయీ!
వేషాన్వేషణ వైషమ్యములే ఈషణ్మాత్రము లేవూ!
దోషము లీషణంబులూ లేవూ! 105
సర్వసంపదలు సామరస్యములె! శాంతిసుఖ సుధాసారములై!
సత్ప్రజాభ్యుదయ సంసారములై!
తేలు బీదల యల్కయె లేదు! తీలుదుష్టుల యశాంతిరాదు!
అన్నముచాలని యనవలె కాదు! కవితలనొల్లని మూఢులె లేరు. 106
దుర్వాసన దోషము! దురాశా ఘోషము!
క్షయించినంతనె, స్వారాజ్యంబనెనూ!
ఆత్మ నిశ్చితంబగు మననూ! ననర్థవాసన బానిసచో!
శ్రీ విద్యారణ్యుఁడదే, జీవన్మోక్షంబనెనూ! 107
ఇమ్ము రసములకు, నెత్తమ్ముల పుటలూ, చెమ్మగిలంగా
కమ్మని హృదిలో, తలఁపు వలపులూ, ఘుమఘుమ్ములయంగా!
తియ్యవిల్తునీ, నెయ్యరి, వసంతుఁ డియ్యకోనంగా!
మృదుమధు కవితామృత మొసంగింపుము! శ్రీ విద్యారణ్యా! 108

ఓం తత్ సత్

# పంపా భారతము — ఆదిపర్వము

## తృతీయ ఖండము

### ఆంధ్రేతిహాస లహరి



నాందిః—

విశ్వజ్ఞాన మయమ్మై
శాశ్వతమణువౌ మహత్త్వ సత్త్వమ్మది, దీ
నాశ్వాస ఫలజ్యోతి ను
విశ్వాసుల కెల్ల నెడద విందొనరించున్.

శ్రీకర వసంతఋతు సుందరీమనోజ్ఞ
గాన నృతియన పాంథుల వీనుదోయి
పై సుధావృష్టి గురియుచు ప్రసవరక్త
కాంతి సుందర పల్లవాత్యంతలసిత 1

చూత తరువుల నెక్కి చంచువుల నెత్తి
లతలఁ బొడుచుచు, నెఱుక లల్లార్చు చుదిత
సమ్మదమ్మున గాంధర్వశాస్త్రఫణితి
కోయిలలు పాడె నపుడు 'కూ' 'కూ' యటంచు. 2

ఆంధ్రవాణిని బాల్యాన నరసి రెవరొ?
ఆదిలో నామె చెలువొచు సలరి రెవరొ!
ఆశ్వయుజమాస వాస రాహ్లాదచంద్రి
కాసితా శాంతముల నిశాకందరముల. 3

తనివిదీఱ చకోరము ల్దాఱుచుండ
పూలఁగూర్చిన వెలి పట్టుపట్టుమనఁగ
సుమగణంబుల తళుకుల నెడములేక
శౌలయు విస్ఫీథిపైని చూఁడ్కులను బఱపి. 4

నడచె నామెయు జంతలు గడలుకొనఁగ
అల్లనల్లన దూరంబునందునుండి
యరుగుదెంచెను మృగముల యలుకు డింత
వెంటనే సింహగర్జనల్ వినఁగఁబడియె. 5

మదగజంబుల ఘీంకృతుల్ మలయజొచ్చె
ఫులుల నిర్ఘోషరావము ల్పొలయఁదొడఁగె
అంత నంతయు నిశ్శబ్దమై యడఁగె
నెంతొ వింతయై సత్యంబు నెఱుకపడమి. 6

ముందునకుఁ బోయె సుస్వప్నమో నిజంబొ
తెలియ దామెయు నుద్విగ్న ధీప్రవృత్తి
ఎట్టయెదుట శ్మశానంబు నెదుర మండు
భీకర మహాతాశనజ్వాలల లేకరీతి 7

గాఁగ నాల్కలు చాచుచుఁ గ్రాలుచుండు
వెలుఁగు మంట కభిముఖుఁడై విప్రుఁడొకఁడు
గూరుచుండి కరంబులఁ గోమలమగు
తాళపత్రపు గ్రంథంబు తనివిదీర 8

కలకల నినాద మాధురీకలన సెలఁగ
వివిధమృగములు మోరల వెలికిఁజాచి
కన్నులను నీరుగార్చుచుఁ గనుచునుండ

చదువు చప్పుడప్పుడు పుట లోఁదవు, శోక 9
భారమున నేమొ మంటలఁ బారవేసె!
తొయ్యలియుజూడ నామె కందోయియందు
మెఱసిపోయెను మంటల మిలమిలలును
తెల్లవాఱిన దిశఁ దోఁచు తెలుపురుచులు. 10

అరుణగిరి దోఁచు నాయరుణార్కకాంతి
రవి రుచిఁ జెందు మంచుబిందువుల ఘృణులు
పొలసు పొలమున వ్రాలు గ్రద్దలబెడంగు
వేడి మలమల మాడించు వేడివెలుఁగు. 11

వేఁటకై వచ్చి నిల్చిన వీరవరులు
వారి శితఖడ్గధారల సారకాంతి
క్రూర భషకాలి నఖలిప్త రుధిరదీప్తి,
ఝురుల, తరు శిఖరంబుల గిరుల దరుల 12

సరస బంగారుపూతల నొరయు సాంధ్య
సూర్య నిర్యత్కరావళి సొబగుఁదనము,
ఇట్లు తొమ్మిది దివసము లేగె నంత
శాతవాహన బిరుదంపు సార్వభౌముఁ 13

డొకఁడు నను దెంచి "కవివర! యొసఁగుడు కృతి
నాకు" నని కేలుమోడ్చిన "నాదు గ్రంథ
మిప్పు డాలింపఁ గల్గనే యిచ్చ" యనుచు
లేఁత నవ్వు మొగ మింతయై, యాతపస్వి 14

యిచ్చె నృపునకు మిగిలిన యేకకాండ
మైన విద్యాధర చరిత్ర; యాకసంబు

నుండి సనుదెంచె వైమానికోత్తముండు
నతి తపోలబ్ధ కవితా కళాన్వితుండు. 15
వర విమానము నెక్కు నా పరమకవిని
నోరగా జూచి యాంధ్రియు నొదిగినిల్వ
"అడలకమ్మా నినుఁ బోరితు రవనిపతులు
నేను గలిపిన పైశాచి నియతి నాంధ్ర 16
మనఁగఁ బొల్చు నైర్మల్యంబునందుఁ దన్వి"
అనుచు నుడివి బృహత్కథా వినుత రచన
చేసిన కవీంద్రుఁ డేగె నిజేచ్ఛ దివికి.
ఇంతలో "వచ్చిరదె వచ్చి రిదియె యవను" 17
లనుచు, గములు దీర్చిన ప్రజ ల్గనిరి భీతి
పోకు పోకు డటంచు నప్పుడ హయంబు
పైని నెక్కిన జెట్టి పెంపారఁ బలికె
మూర్ఛనొందఁగ నున్నట్టి ముగుద కివియు 18
వీనులకు సుధా సేచన విధముఁ దాల్చె
"జయము గౌతమీనందన! శాతకర్ణ!"
యనుచు మ్రోగిరి వీరు లాహ్లాదముునను
పాలికలను లోన నాభీల భూరిసైని 19
క, బలకాయ నికాయ, రక్త స్రవంతి
వెడల, విజయియౌ నారాజు విక్రమార్క
బిరుదమును దాల్చె, శకమొండు వఱలె భువిని
అతని కీర్తిసౌరభము నిరంతరముగ 20
నందియిచ్చెడు మలయ సదాగతి యన

"నాశిక"యును, "శ్రీకాకుళ" నగరరాజ
మును వసించెడు తావులై ముప్పయు సతివ
శాతకర్ణులు పట్టెదు శ్వేతనోచి 21
విస్ఫురచ్ఛత్ర సచ్ఛాయ వెలుగుచుండె
గౌతమీపుత్రి విక్రమార్క ప్రభుండు
పాలనముసేయ నతని కొలుడ్డోలగమున.
ప్రాకృత మహాకవుల్ గొల్చి యాలపించు, 22
కావ్యగీతంబులను వినగాంచె నామె
రాజకవి హాలుఁ డొనరించె రసముఁగూర్చి
సప్తశతియను శృంగారసార సుకృతి
కాని యామె మాటల మెప్పుగా బూనఁడయ్యె. 23

సర్వవైభవ ప్రాభవ సరణి మనిన
గొంతకాలంబునకుఁ గాంత చింతమెయిని
కనులకుఁ గానఁబడకుండ జనియె నెటకొ
ఆమె నెమకుచు నరిగి యొయ్యార మొసఁగ 24
కంటి నొకచక్కి కీర్తుల మింటినంటు
దంట లిక్ష్వాకురాజుల దండనుండ ;
వారు నోడల గై సేసి చారుయాత్ర
లనిపి రామెఁ దూర్పున దీవులను వసింప. 25

అమ్మహారాజు లిక్ష్వాకు లంతరింప
జావయును సుమాత్రయు వీడిపోవ మరలి
యాంధ్ర దేశాన దన పట్టు నరసె నామె.
అట్టియెడ శాతవాహను లుట్టివడిన 26

యమ్మహారాజవాటిలో నమరె తెల్గు
చోడవీరు లానాను బల్చి తోడఁగూడి
యుంచు సుడికాంతముల వెలఁగ నంపి యూఁడి
శాసన శిలాసనముల సర్వ్యసలజేసి 27

రాంధ్రచోడుల శౌర్యాగ్ని యారిపోవ
నాంధ్రవాణియు దశదిశలందు దిరిగి
యెటులొ, మఱుఁగయ్యె పల్లవు లెటులొ జారి
రంత, నామె నన్వేషించు చరిగి యరిగి 28

నిజ పరాక్రమ నిర్జతానింద్య శౌర్య
ధుర్య హర్షుండు, పులికేశి దొరతనంబు
సొంపుఁ జొప్పింపఁ జొచ్చితి; సుందరి నట
నిండువై భవమున మించి నెఱయుదాన 29

గాంచితిని, వింటి పారశీక ప్రభుండు
పంచినట్టి సందేశంబు పరులు వచ్చి
పొగడుచుండఁగ సహజమా గరు, శీవి
నెఱపుచుండె మహాంధ్రరాజ్ఞీలలామ. 30

కుబ్జ విష్ణువర్ధనరాజు గూర్మిఁ బిలువ
నల్ల నల్లన నడతెంచె నంచవోలె
రాజరాజ నరేంద్రుండు పూజఁజేయ
నామె గని రాణ్మహేంద్రపురాంతరమున 31

బ్రాహ్మణవరుండు శబ్దప్రపంచవేది
నన్నయార్యుండు సంప్రార్థనా మృదూక్తి
నిట్టులను 'భారతగ్రంథ మేను వినుతు

లలితముగ నాంధ్రసామ్రాజ్య లక్ష్మి!' యనిన | 32

'వల్లె' యని సమ్మతించె నవ్యామనేత్రి.
ఆమె యటవీ విహారంబు నోముసప్పుడు
దేవతలు బిల్వ నన్నయ దివికి నరిగె;
సోమయాగంబుచే యశస్వితుండైన
తిక్కనామాత్యుఁ డామెకు, దక్కు కథను | 33

స్వాదుశబ్దార్థ వైచిత్రి వరల ప్రౌఢ
గానమొనరించె సందర్భగరిమ మెఱిగి
నాచనయు, మారనయు, కేతనయు, కవీంద్రు
లతని నుడికారముల కాత్మ నక్కజపడ, | 34

కాకతీయాంధ్రవీరుండు గణపతీశుఁ
డాదరింపఁ బ్రతాపుండు నధికభక్తి
నొక్కశతకంబుఁ గొక్కగా నొసఁగ నెసఁగి
యుండెఁ గొన్నాళ్లు దన్విమహోత్సవమున. | 35

అశని నిర్ఘోష భీమఘనారవముల
విలయకాల పతద్వర్ష సలిలధార
తత్క్షణోద్వేగ కరతటిద్ధాళ ధళ్య
ములను మఱుగయ్యె దేశ మంబుద వృతంబు | 36

అవని యెల్లను నిండి మహమ్మదీయ
సైన్య రింఛోళి దక్షిణాశాస్థలంబు
నాక్రమింపఁగ వచ్చుచు నంతరమున
పురుల జానపదమ్ములఁ బొలము లెల్ల | 36

నాత్మలాభార్థమై దోఁచి రాత్రివనధి

ముంచి రసయులొాచు ప్రజాసమూహములను
యవనవీరుల దాడికి నగ్నిఁగుమిలి
కాకతీయ ప్రతాపంబు గరగిపోయె 37

రాజ్యకాంక్షుల కాకతిపర్భిల మఱచి
రాచవారలు రెడ్లు దుర్వార శౌర్య
ఘనధులగుచును విమతపర్వతము లాపి
శంభుదాసుని, శ్రీనాథు సత్కవితల
రచ్చకెక్కించి రంత భాగ్యోచ్చులగుచు 38

నస్తమించెడు రవి, తమంబడచునట్లు
తన్ను నెవ్వరుఁ బ్రోవమిఁ దాల్మిలేక
పరువిడియె త్రస్తయై భామ పరుగులిడుచు
నేను నామెను వెన్నంటి యేగి యేగి 39

తుంగభద్రా సరిత్తుంగ భంగ శీక
రప్రకర పరిచ్ఛన్న తీరప్రదేశ
మంద పవనాత్తసీమ నానందకంద
ళిత హృదబ్జుండనై కంటి లేమ నామె— 40

II కాకతీయేశు సంగ్రామ రంగమున
బోకార్చి యవనులు పోరిఁ బోరి రాఁగ
కృష్ణనాయకుచేతఁ గృత్యంబు లెఱిఁగి
జిష్ణులై యాంధ్రు లార్జించిరి యశము
కాని నిల్కడలేమి, దీనత గనిరి. 41

ఆనెగొందినిఁ జేరి యాహవంబులను
బోనాడి తురకల బుక్కసోదరులు

మానితబుద్ధియౌ మాధవాచార్యు
నానతిఁ దలఁదాల్చి యరిభేదులైరి. 42

ఆనృపులుఁ గట్టి రగ సుప్రతోళి
కాంచితంబైన విద్యానగరంబు
నించె మానియు ప్రజానిచయంబుచేత!
హరిహర సోదరుల్ హరిహరాకృతుల 43

పరవీర హరణంబు భక్తరక్షణము
వెలయింప, దర్వాత, విబుధాగ్రగణ్యు
లొలసి సేవింపంగ లలిత చరిత్రుఁ
డగు దేవరాయల యౌదార్యకీర్తి 44

నిగిడె దిక్కుల, సుధీ నిర్నిద్రుఁడైన
శ్రీనాథ కవిరాజు చెందె నయ్యెడ, న
నూన జాంబూనద నూత్నాభిషేక
గౌరవం బంతట, గమనీయ యగుచు, 45

హారినూపుర ఘల్లులాంచితయగుచు
నాంధ్ర సామ్రాజ్య మహారాజ్ఞి, పరపు
రంధ్రు లూడిగ మనురక్తి నల్పంగ
తురకల వెనుకకు దొరలించి మించె! 46

చరితార్థుఁడగు సాళ్వ సమ్రాట్టు శక్తి,
తుళువ నృసింహుని తోరంపుఁ గీర్తి,
నలువుగ నరి తమో నాశకంబగుచు,
ప్రాభాత రుచివోలెఁ బరిణతిగాంచె. 47

ఆభీల తరమూర్తి నరుదారుచుండు

వీర నృసింహుని విక్రమస్ఫూర్తి
చారు సూర్యోదయ సమయ సంజ్వలిత
రక్తాంబరమువోలె రమణీయమయ్యె. 48

అతుల మేధావంతుఁడైన తిమ్మరుసు
హితుఁడయి యాంధ్ర రాజ్యేందు బింబాస్య
కొనరించె రక్షణ ముద్యత్సదుద్య
మ, నయుఁడౌ కృష్ణుని, మహనీయచరితు 49

రాజ్య ధౌరేయుగా రమణఁగావించె
పూజ్య మహాకవు ల్పొందిరి ముదము.
ఉదయాద్రి భేదించె నోజఁ దర్పమున
నదయుఁడై పాత్రుల నాజి మర్దించె. 50

కొండవీటిని రిపుకోటి సుక్కించె
దండితారాతి యుద్దండ శౌర్యుండు
రాజరాజగు కృష్ణరాయ భూమిపుఁడు,
లాఁజ లంగనలు చెల్లంగఁ దిమ్మరుసు 51

తోఁ గూడి భద్రదంతులు తన్నుగొల్వ
రాయచూ రనెడు దుర్గము జుట్టె సేన,
రాయలువేసె శౌర్యమున ముట్టడిని
సుల్తాను గర్వంబు సురిగిపోవంగ. 52

విజయపురేశుఁడై వెలయు సుల్తాను
భటుల, నత్యుద్ధత పరిపంథి చయముఁ,
బరిమార్చి విజయంబుఁ బడసె రాయండు
చటుల మార్తాండ ప్రచండ శౌర్యుండు ! 53

వర్ణాశ్రమాచార వరధర్మ వితతి
పూర్ణంబుగాఁ బ్రజాభ్యుదయ హేతువయి
యలరారఁ దొడఁగె, మహా ధనికులగు
బుడతకీచులు తన్ను బొగడి, వర్తకము 54

సేయ నంగీకృతిఁ జెంది, రాయలకు
మణిమయాలంకార మహితోపదలను
ప్రీతి నర్పించిరి భీతిఁ బోవిడిచి.
వాణిజ్యమెందును రాణ నొప్పారె. 55

ప్రకృతి వర్గం బెల్ల పడసిరి సుఖము.
కృష్ణా స్రవంతీ సుకేదారసీమ,
సహ్యతుంగాద్రి, రేనాటిలో భూమి,
నిరత కావేరీధునీ సిక్త మహియు, 56

వైభూజలాంచిత వర తరువనులు,
కనులపండువు సేసెఁ, గాిరె సస్యములు,
వద్విబుధాశీర్వచ స్సమర్థతయు,
నిగమ మంత్రోద్ఘోష నిష్ఠలు క్రతువు, 56

లెల్లెడ వర్ధిల్లి యెసకమెసంగ,
భద్రదంతావళి ప్రకరంబు నడువ,
అమల లక్షణయుత హయకోటి నడువ,
కవులు గాయకులు, స్రక్చందనాంకితులు 58

సామంతరాజు లుత్సాహ సద్గోష్ఠి
నెనలారుచును ముందు కేగుచునుండ,
నొకచేత ఖడ్గంబు నొకకేల పూల

మాలను బట్టి యుమాసతివోలె 59
నొకకరం బభయంబు నొసఁగుచునుండ,
మత్త సింధురముపై మండపాంతరము
నందు స్వర్ణాస్తరణంబుపైఁ, బేర్మి
నుపవిష్టయై, మంత్రి యొదిగి నిల్వంగ, 60
కృష్ణ మహీజాని కేల తెల్లని గొడ్గు
పూని, సంభ్రమముమై పొలిచి, నిల్వంగ,
నాంధ్ర సామ్రాజ్య మహాలక్ష్మి, వచ్చి
నవరాత్రవేదిక – రత్నాలమీద, 61
సింహాసనమున నాసీనయై నిల్చె.
పెద్దనార్యుండు సంప్రీతిమై నుడివె,
అంబరచుంబి నగాగ్ర సర్ఝ
రీ ఝరద్ఝంగాలి రీతి, శబ్దములు 62
శ్రవణ మోదావహ శయ్యా నొప్పార,
నాంధ్ర యశోగీత లందఱు వినఁగ;
శాంతి సమీరుండు చల్లగ వీచె,
తరుణచూతము రాజు, తమ కంఠమెత్తి 63
మఱచిపోవని యట్లు, మఱిమఱి రాగ
మాలపించిరి కోకిలా రవుల్ కవులు!
వసి వాడనట్టి సత్పారిజాతముల,
మల్లికావాసిత మంజుకుంజముల, 64
ప్రసవమ్ములఁ బొల్చు వల్లికావళుల,
నైసర్గిక విలాస నవ లతాంతముల,

మకరందమును గ్రోలి, మత్తిల్లు నళుల
ఝుమ్ఝుమ్మను రొద సొంపు గల్పించె. 65

ఎదుర నాపగయందు నీదు చొండ్రోరులు
ననురాగ భరముమై యనఁగి పెనంగి
మందయానములతో మలయు, మరాళ
మిథునముల్ ప్రకృతిని మిగులఁ గైసేసె. 66

ఒండొరు నోళ్ళకు నొయ్యారముగను
మధుర మధుస్రవ మా కంద ఫలము
లందియిచ్చుచుఁ బ్రేమ యగ్గలంబగుచు
గదియు జిల్కల కలకల నినాదములు 67

తుంగభద్రా సముత్తుంగ తరంగ
పతన జన్య మృదంగ పాటనధ్వనులు
కలసి తౌర్యత్రిక గరిమ నూపంగ,
నంతయుఁ గనుచుఁ "జిన్నాతిర్మల" మల 68

నిరుదెసల్ జేర్చి, మహీంజాని యొప్ప,
కర్పూర తాంబూల ఘన కరండముల
కరములఁ దాల్చి ప్రక్కనునిల్చి శ్రితులు
తెలనాకు మడుపు లందిచ్చుచు నుండ, 69

కాదంబరీ పాన కలిత మదాత్త
తరుణ సుందరివోలె ధన్య నేనంచు,
నర్ధ నిమీలితంబైన కందోయి,
అతి పరిమళ మిళితాబ్జ స్రగాలి 70
వ్రాల, పాన్పుననుండు, ప్రాభవోద్రిక్త

నాంధ్ర సామ్రాజ్య మహామాతఁ గంటి!
సార్థకతఁ గాంచె జన్మంబుననుచు
సకల నదీనద సంగతం బగుచు 71

సార సంపత్పూర సాందర్యంబు నగుచు
వెలయు నాకృతితోడ వెలసి యావేళ
భరత భూదేవి శుభప్రాప్తి రస్త
టంచు దీవెన లీయ నాలకించితిని! 72

కాలంబు గిరగిర గాంచుచుండగనె
యెన్నియో చుట్లిడి యెగిరియే పోయె!
కృష్ణరాయలు జేరె కీర్తికాయుఁడయి
దివ్యత్సుధర్మపై దీర్పంగ గొల్వు. 73

అల సదాశివుపేర నవనియంతయును
పాలింపగాఁ జొచ్చె, ప్రభు మంత్రశక్తి
యుక్తుఁడై రామరా జొక కొంతకాల
మట్టై తురకల నొంచె నధిక దర్పమున. 74

మాధవార్యునిదీప్తి మఱుగు కాలేదు
కృష్ణరాజేంద్రుని కీర్తి యిప్పటికి
దఱుగకున్నది, మాన్యతముఁడు తిమ్మరుసు
మతి విశేషంబులు మఱచిపోలేదు!—— 75

III ఉభయకవి సుహృత్తు సుక్తి యౌచిత్యంబు
సహజపండితు రస సంపదయును
సింధు భంగములగు శ్రీనాథు సూక్తులు
పెద్దనార్య సత్కవిత్వ శక్తి 76

ముక్కు తిమ్మనకవి ముద్దుఁబల్కుల తేట
పిన్నవీరన మధుబిందు పాక
మరితి చాడి చిత్ర మంకించు చందంబు
శ్లేష శబ్దములను జేర్చి కూర్చి
భట్టుమూర్తిగాన పరతఁ జొక్కింపంగ
నెంచె కాని మాత యెఱుకఁదప్పె! 77

సూరనార్యుఁ డదియుఁ జూచి కల్పించెను
నూత్నకథను జొన్పి, నూత్నశయ్య. 78

పిల్లవాని మధురపేశల కల్పనా
లసిత పదములంచు లలన గొంత
సేపు వినియు, మఱపుఁజెందె కళాపూర్ణు
గాథ, యంత గల్గెఁ గలకలంబు. 79

మొగముద్రిప్పి చూచె మోహారంబున గొగ్గి
'తల్లికోట' యొద్దఁ దనయులెల్ల
రామరాజుక్రింద రణధీరులై మించి
యవనసేనఁ గొల్లలాడు టెల్ల. 80

ఒక్కటిగ మహమ్మ దోర్వీపతులు, పోర,
రామరాట్ఛిరం బురస్థలంబు
పీడె ఖడ్గధార; విచ్చె హిందూసేన,
జయముఁ గనిరి మ్లేచ్ఛజనత యనిరి. 81

చేరె దివ్యదీప్తి, జేగీయమానమై
మాత దాక్షిణాత్య మహికిఁ దరలి.
చేమకూరి కవియుఁ జింత దీర్చుచునుండ
తత్త్వములను బాడె త్యాగరాజు! 82

అప్పు డెటిఁగినాఁడ నాంధ్రలక్ష్మి యనంత
రూప విభవ యనుచు, రూఢికెక్కు
నాంధ్రదేశగత మహాజన హృదయంబె
యామె వాసభూమి యనుచు, నేను— 83

IV మ్లేచ్ఛసేనలు పంపాపై మిడిసిపడఁగ
బాలకు ల్నిదురింప నుయ్యాల లూఁచు
భామ లెందఱు తప్తలై పరువులిడిరొ?
తల్లులను వీడి యెందఱు తల్లడిలుచు 84

నేడ్చిరో బాలకులు రిపులెద్ది కొట్ట?
విభుల బిగియారు కౌఁగిండ్ల విడువలేక
సుగ్రీవ వసివాడి పసిఁగిడి సోలి యరుల
చేతులకు జిక్కి మానంబు జేడ్వడంగ 85

పంక్తికంధర గ్రస్త రంభావిధాన
దీనలై ప్రాణములొ్వి దానఁజేసి
కార్చిరో నీరు తరుణులు కనుగొలుకుల
నెడలి గండంబుపై జాలి నెంద అపుడు? 86

ఘటిఘటిల్లను ధ్వనుల నాభీల కీల
లెల్ల వలఁకుల ముట్టిన నేది తెరువు
గాన కెందఱు మందిరాంగణములంద
మ్రిందిరో పుత్రపౌత్రులు మాడఁ గనుచు? 87

ఎన్నిదినముల నుండియో యేర్చినట్టి
రత్నరాసులఁ జూచి వర్తకులు విడువ
నేర కట్టులె తురకల ఘోర తోఁడ

నంబునకు గ్రమ్మ రెంద రనాథలగుచు?                88
ఏమి యనుకొన్న వచ్చెడి దేమి ఫలము?
కలికి తురకల వేడికిఁ గరగి విజయ
నగర తుహినోపలము జేరె నవ్య తుంగ
భంగ తుంగభద్రా సరిత్పథమునందు!                89
హాయి! హాయి! శ్రీకృష్ణరాయాధికార
గరిమ బెరిగిన విద్యానగర వరంబు
వింత భావంబులకుఁ దావు వెదకఁ జేసి
యడలు గుడుల గోడల తిట్ట యయ్యెనయ్యొ!                90
ఉత్కలాధీశు నిర్జింప నుద్యమించు
నేనుగులకుఁ బట్టులైనట్టి వీ గృహములె?
వల్గు ముఖ్య విచిత్ర ధావన విశేష
జాల మెఱిఁగిన మావులశాల లివియె?                91
మంత్రి తిమ్మరుసుఁ గూడి మంతనమున
దండనాథుల వేర్వేఱఁ దఱచి యరయు
రాయల రహస్య సౌధాంతరంబు లివియె?
ప్రకృతి వర్గంబు పౌర సభ్యప్రకరము                92
తోడఁ గూడి వసింప సంతోష చిహ్న
తాన్య వనరుహుఁడై పను లడిగికొనుచుఁ
గొలువుదీర్చెడు కృష్ణరాయల ప్రియంపు
సభయు, త్రిభువన విజయాంక సభయు నివియె?                93
అనుచుఁ బాడుపడిన మందిరాంగణముల,
అందమొల్లఁ జెడిన గృహాళిందములను,

భిక్షువని కంటఁబడెను గబ్బిలపు పిండు
లంటియుండెడి, రాడ్భవనాంతరముల, 94

చుట్టు గళ్ళికల్లను నిండి చొఱఁగరాక
కంటకావృతంబయి చంద్రకాంత శిలల
నిర్మితంబగు నత్తుంగ నిలయ హర్మ్య
వాటికలఁ గాంచి యడిగితిఁ బ్రశ్న లెన్నొ! 95

ఇసుక తిన్నెల లోపలి యిండ్ల నెంచి
రాతి నొకటఁ జెక్కిన సువిగ్రహము లెంచి
స్తంభములఁ బొల్చు మూర్తుల సరణి నెంచి
యాంధ్రశిల్పుల యౌన్నత్య మాత్మఁ గంటి! 96

మహతిఁగొని నారదుం డుడు మార్గమందు
వచ్చుచుఁ గాన మొనరించు టచ్చుపడఁగ,
చెలఁగి వీరవరులు కురుక్షేత్రమందు
నిలిచి బవరంబు నల్పుట నిజముగాఁగ, 97

రాస కేళీ విలాసంబు రాజిలంగ
ప్రాణములతోడఁ జిత్రింపఁ బడసినట్టి
శిల్పి నెంతని పొగడి హర్షింపగలము?
ప్రభువరేణ్యుల నేమని ప్రస్తుతింప? 98

పతిత రక్షాప్రవణు విరూపాక్షుఁ గాంచి
మైథిలీ స్నానపూత మంభస్తటంబు
జానకీ రామలక్ష్మణుల్ సరసఁగూడి
వెలయు చక్రతీర్థపుఁ బ్రాంతములనుఁ జూచి, 99

ఋశ్యమూకాద్రి శిఖరాన, నింత నిల్చి

ప్రథమ కృతికృత్య హేవాకి, శ్యామలూరు
తనయు, స్మృతిపథంబునఁ గొంత తడవి తెలిసి,
కనుల బాష్పంబు లురల వెన్కకును మరలి,
యరుగు నుత్తుంగ తుంగభద్రాపగ గని, 100

తల్లికోట పోరాటలో నెల్ల రాంధ్రి
జనులకున్ వంచనముఁ జేయఁజనునె? యనుచు
సిగ్గుచెందినదో యన నగ్గలించు
వక్రగమనంబుగల నదీవనితఁ జూచి, 101

అలఘు ఫేనహాసముల, నీహార బిందు
శీకరాసార గాఢ నిష్ఠీవనముల
నుత్పతన్మీన రుచి నయనోత్పలముల
చారుతర తరంగ రవ ధిక్కారకములను 102

చూచువారికి నబ్రంబు సూచునట్టి
యమల పులినాత్త తుంగభద్రాపగాంబ
రొడ్డును దరించి, యవ్వల నున్నయట్టి
యంజనాదేవి గుహ జూచి, సంజెవేళ 103

రమ్య పంపాసమాఖ్య సరస్సు జేరి
రపమునసల లక్ష్మికిని హారతులనెత్తి,
తత్త్వవేది పురందరదాసుఁ గొల్చి
పొల్చితిని నే గభీర ప్రబుద్ధమతిని. 104

V భానూదయమ్మై పగలు బయలుగా
చక్రవాకి పతి సరస భజించును,
మాకందములన్ మలయుచు నుండును

చలదళి వృతములు పుంస్కోకిలములు 105
కాసారములఁ గనువిం దొనరగ
రమణీయములగు రాజహంసములు!
నీలాంబుదములు చాలై మొఱయగ
నీలకంఠములు నెఱపెదుఁ గేకల! 106

చల్లనిజొన్నల శశికళ జల్లగ
చాతకంబులును సంతుష్టినిగను!
పరమమునీంద్రుల పాలిటి బ్రహ్మము
నోంకారమునం దొలుకుచు నుండును! 107

నవ యౌవనమున నవయు గృశాంగికి
మోహామెసంగు సముద్రము చాడ్పున!
మానవాభ్యుదయ మహానీయోహాల
సత్కృతి యుల్లము సంతోషించుఁ. 108

ఆదిపర్వాంత మంగళము:-

ఆకాశంబును నిట్టిదట్టిదని మాట్లాడంగగానట్టులే,
రాకాజృంభిత మబ్ధిరూపు దెలుపఁ రానట్లు, విద్వాంసులుఁ
మూకీభావమునొంది మెచ్చిరెవనిఁ, మూర్ధాభిషిక్తుల్ననో
వాకంబుల్ బఠియించి, రాయతిని ధీవార్ధిఁ, బ్రశంసించెదఁ 1

సాధుశ్రోత్రియులుఁ గవుల్ సుజనులుఁ సంతోషముఁ జెంద, ను
త్సేధశ్రేయము భారతీయమతి సత్సిద్ధాంత మాచారముల్
బోధంబైనవి మాత్ర మీకృతిగతిఁ బూరించె - కుంతవ్యుఁడో
బోదార్షేందు కవీంద్రుఁడుఁ - సుమతులుఁ బోషింపుఁ డీకావ్యముఁ

ఓం తత్ సత్

శ్రీరస్తు

# పంపాభారతము — సభాపర్వము

## మున్నుడి

తాను, తనకంటె నితరము నను రెండు విధములయిన విభేదమే మానవుని ప్రవృత్తిచర్యకును మూలభూతమయి యొప్పుచున్నది. వ్యక్తి, తన యనుభూతి ననుసరించి, కోర్కెలను పొందుటకు తనకంటె నితరమయిన దాని నుపయోగించుకొనుచుండును. వాఙ్మయము కొందఱికి జీవనాధారము. కొందఱికి కీర్తి సంపాదనకు హేతువు, మఱి కొందఱికి ఆత్మీయమయిన రాగద్వేషముల తెలిపుకొనుట కవకాశము. ఇట్లే భిన్నములయిన యుద్దేశములకు ప్రయోజనములకు రచయితలు ప్రవర్తించుచుందురు.

శ్రీ వేంకట నారాయణరావుగారికి, ఆత్మీయమయిన, యనుభూతిని నిర్మలమయిన సత్యస్వరూపముతో, తెలిపుటయే, రచనా ప్రయోజనమని నాకు తోచుచున్నది. వీరి రచన లట్లే వెలసినవి. కేవల రసమయమయిన వీరి వాఙ్మయ సంస్కారము విమర్శనాత్మకముగా, చరిత్ర వివరణ పూర్వకముగా నాంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహరూపమున వెలువడినది. అక్కడి వ్యక్తి, కవి వేది! అశోక సమ్రాట్చరిత్రమున, నీయన దృష్టి, లోకానుభవమున, అంతరంగిక దృష్టివలన, భిన్నానుభూతి సమన్వయమున, సుస్పష్టమయి పరిణతమయినది. అశోకచరిత్రము, దివ్యమైన స్వరూపమును తెలుపుటచే, ఆ తేజోమూర్తిని లోకుల కందించినది.

నేటి యీ పంపాభారతము ఒక విచిత్రమయిన గ్రంథము. ఇది విజయనగర సామ్రాజ్య చరిత్ర. ఇందును శ్రీ విద్యారణ్యమహర్షి స్వరూప చిత్రణములో, కవిగారు, కృతకృత్యులగుటకు హేతువు — వారి ఆత్మసాక్షాత్కారమే! శ్రీ విద్యారణ్యాదులతో వీరికి తాత్కాలికాభేదము — “నేహనానాస్తి కించన”

"జీవో బ్రహ్మైవ నాపరః," "ఐతదాత్మ్య మిదం సర్వమ్"। ఇత్యాది శ్రుతి వాక్యముల భావము, వీరిలో పరినిష్ఠిత మగుటవలననే కలిగిన దీపని.

ఇంక కావ్య బహిరంగ రూపము — నేడు దేశచరిత్రను చంపూకావ్యము లుగా వ్రాయ యత్నించుట — ఇది కేవలము నూతనముగాదు. మన పురాణ ములలోనిదే — కాని విస్మృతమయినది. చారిత్రక పురుషులను గ్రహించి, యీరీతి రచనచేయుట యొక క్రొత్తయని చాలమంది యనుకొనుచున్నారు. ఇది పాత క్రొత్త — అనగా — పాతదానిని మరల బయటికి దీయుటయే! అట్టివానిలో, శివభారతము, ఆంధ్రపురాణము, అశోకచరిత్ర — పరిచితములే! ఈ పంపాభారతము నాచాయయే.

ఇందు కావ్యధర్మము, దేశచరిత్ర, సత్యశోధన, వేదాంత విజ్ఞానము కలిసి మెలసి యున్నవి. "నానృషిః కురుతే కావ్యమ్" — అని పెద్దలు చెప్పిరి. శ్రీ నారాయణరావుగా రట్టికావ్యములు వ్రాసినారు అని నే ననుచున్నాను — లోక మీ యుత్తమగ్రంథము నుపయోగించుకొందురు గాక!

శ్రీ విద్వాన్ జి.జె. సోమయాజి, M.A
(Head of the Department of Telugu
Andhra University.)

వాల్తేరు
3-3-59



శ్రీరస్తు

ఆశీస్సు



ఈ గ్రంథ ముద్రణమునకు రు. 500/- తోడ్పడిన

కమ్మరైతురాజు

## శ్రీ రేణుమాకులపల్లె-

## పెద్దరామప్పగారికి

శ్రీ పంపాతీర కోదండరాములు

ఆయురారోగ్య జయశ్రీలనిచ్చి

యశ్రాంతము బ్రోచుగాక.

శ్రీ రస్తు

# పంపా భారతము — సభాపర్వము

## ఆదిఖండము

### శ్రీ మాధవాచార్యుల బాల్యము

నాంది:—

తునెకానిది, మొట్టమొదల్
గొనములు మూడేచకుండ, గుట్టుగ దనలో
గను నెది, విషయాతున్నము,
ననఘుంబది, జోతి, యిచ్చు నవ్యయసుఖముల్.

భైరవిరాగము — ఏకతాళము — గేయము ( తేఁటి పాట )

పల్లవి:—

మగలు తెలుంగు లపారధీరులని మాటికిమాటికి
పాడు ఝుంఝుం తేఁటి ! పాడు ఝుంఝుం,

పదము:—

కవిసెను చీఁకటి ! దవిలె నుపద్రవ నివహాము ! మ్లేచ్ఛులె
పారు తేఁటీ ! దవ్వు పారు తేఁటీ
తూరుపుదిక్కున నీరదగర్భము, దూరిన శంపను
చూడు తేఁటీ – పైన చూడు తేఁటీ
వర్షము గురిసెను – హర్షము లొదవెను ధర్షితు లరులును
చాటు తేఁటీ – జయము చాటు తేఁటీ
అదె విద్యారణ్యాము తుదిమొద లగణ్యాము భారతఁపు పుణ్యాము
పలుకు తేఁటీ – గీత పలుకు తేఁటీ ॥మ॥

వేదరక్షా వినుత వాదిశిక్షా విజయవాసదక్షూం జగని
    చేసు తేటీ - యతిని చేసు తేటీ
విజయపు నగరము గజన భీకరము కుజన కఠోరము
    తీసు తేటీ - మీనాల్ తీసు తేటీ
నిగమ వ్యాఖ్యానము సుగమ సామ్రాజ్యము విగతారి విక్రమము
    వేడు తేటీ - శక్తి వేడు తేటీ
సద్యోపాపహారము విద్యాశాంతి భరిత విద్యారణ్య చరిత
    మీటు తేటీ - వీణ మీటు తేటీ ॥మ॥ 2

## బ్రహ్మేంద్ర యతి వృత్తాంతము



"ముంధవాడి"లో జన్మించె, ధూత కల్పి
షంసు, విష్ణుచింతనేసు బాలుండు, సతని
ద్వాదశాబ్ద వయస్కుని, తల్లిదండ్రు
లిరువురు బాసి చని వటు విరవుపేక 3

దేశదేశముల్ మూడేండ్లు దిమ్మదిరిగి
లేమియను చిమ్మచీకటి, నేలు విరుగు
బండివలె, నిరాశాహతి బగిలి, నిల్చె
కాశిలో విశ్వనాథ నివేశము కడ. 4

అచట జ్ఞానేంద్ర యతిరాజు సంఘ్రియుగమె
మాశ్రయంబుగ బ్రహ్మవిద్యాసమాసపు
నడుగు, నిత్యంబు వేదాంగపారజలధి
దోంగి, సచ్ఛాస్త్ర పారంగతుండునయ్యె. 5

యతివరుండును బ్రహ్మవిద్యాత్మ దీక్ష
నొసగ, బ్రహ్మేంద్రుఁడను పేర నెసఁగి
విష్ణుపంతు, సర్వత్ర పూజ్యుఁడై, పడసె కీర్తి
నవల సుక్షేత్ర తీర్థంబు లన్ని యరసె. 6

తుట్టతుద కాతఁ డాత్మసంతుష్టి నెసఁగి
పరశురాముండు మున్ను దేశంబునల్పె
నెచ్చటచ్చోట పదిరెండునేండ్లు దీక్ష
దారయు, సుధ్యానయోగంబుతో దలిర్చె. 7

పరశురామాఖ్య సుక్షేత్ర పదమునందు
మఠము నాశ్రమముఁ జనమాన్యమయ్యె
అదియు "చిపలూను" చెంగట బొదలె గాన
శిష్యులైరి కొంకణ జనశ్రేష్ఠులెల్ల. 8

ఛత్రపతి సాహు మొదలుగా సకలఘనులు
యతికి సువిధేయ సర్దారు లైరి; హస్తి
కనక మాణిక్యముల్ మస్తుగాగ నిచ్చి;
వరయతి పురాతనాలయోద్ధరణ పరుఁడు
ఋణములిడె మిగులెల్ల సత్క్రియలకొఱకు. 9

కోటికి విద్యారణ్యుడు
హాటకమిడి ధర్మరాట్క్రియావసరములఁ
మేటి విరూపాక్షుయశము
మీటించెను, భరతభూమి, మేలిమి గనఁగ. 10

లక్షలకు ఋణమొసంగియు
నక్షయముగ బాజివిభుని నయ్యోపనులఁ

దక్షునిగ జేసి యతియు, సు
భిక్షముగా మహియు మనఁగ బ్రియమొదవించెన్. 11

మాధవువలె బ్రహ్మేంద్రుఁడు
వేధోవాక్తత్త్వవితతిఁ బోధి యొనర్పన్
సాధితములయ్యె జయములు
శ్రీ ధర్మాదులును సుజనసేవ్యము లయ్యెన్. 12

## గృహస్థుఁడగు మాధవాచార్యుని భావనలు – నిత్య జీవితము



అద్ది పరశురామక్షేత్రమందు నిగమ
వ్యాఖ్యలను వించు కౌతుక స్వాంతులగుచు
పరమ మతి, మాధవార్య యాభావనపు రీతి
మెట్టిదను వటువులకు, బ్రహ్మేంద్ర యతియు
కథకు మాదిరి, యిట్లు వక్కాణ సమర్చె. 13

ఎలవయసునసె మహిమకు నెల్లయగుచు
ప్రకృతిమయుఁడగు విభుని ప్రవృత్తి నెనసి
యొనరు, మాధవాచార్యుని యొక్కరోజు
చర్య యాధారముగ, గథాసరణి సాగ
నపుడు మొదలిడె, బ్రహ్మేంద్రయతియు, నిటుల. 14

ఒక్క వేకువ మక్కువ నోరసి, తమ్ముఁ
డగ్రజుని వెంబడింపగ నాకసలకయి
యరుగు వేళ మాధవుఁ డభ్యమందు నోడివె
పదిసర ప్రకృతిని దృష్టి బరపి యిట్లు. 15

ఇదె యరుదెంచె మాధవుఁడు, నీ సమయాన నవీనశోభ దఁ
బొదువ, వసంతలక్ష్మి, పువుమొగ్గల జుట్టునజుట్టి, సౌరభా
స్పద సువికాస హాస, విలసన్నవ పల్లవ వల్లరీ ఫల
ప్రద బహుదోహదక్రియకు బాల్పడె! పాటున కింతులే నిధుల్. 16

కరమును బాటుపడ్డ వనకాంతకు నించుక సేదదీర్పఁగన్,
వర పరివాదినీ నినద వాఙ్మధురార్ద్ర కషాయ కాకలీ
స్వర విచల "తుకూ-హూ" నవరస స్ఫురణామల కంఠమెత్తి యో
పరభృతమా! రసాల మృదుపాదపశాఖల లేజివుళ్ళపై
చరణముమోపి కోమలము జల్లుము రాగసుధా ప్రపూరముల్. 17

అధమ ధనాఢ్యులై, గుడువ నన్నము, గట్టఁగ గుడ్డ చాలమిన్
ప్రథిత కులీనులున్ నిను గరంబును వెంగలిగా గణింతురే
విధియు విరామ మించుకయు వేఁడవు కోకిల! పాడుచుంటి వీ
సుధ ముదమార గ్రోలఁ గనుచుండెడు భోగులు కొందరే కదా! 18

పాలముల గుండ్ల రాగిత్రుణముల్ నెరబూఁచిన శయ్యలన్ నిరా
కులమతి, నెట్టజెట్టగమి, కూరుకు చేద్చఁడగా, నహార్ముఖ
స్ఖలితములైన తారల, నిశాసతిజేరఁగ దోలు, నీ ప్రభా
త లలిత కాంతులకు థళ్ళళ సాగుచు లేచి జారగన్. 19

ఎండలు మెండుగాఁగ పగలే యధికంబుగ నుండజొచ్చె పె
ల్లండుటయే స్వభావముగ: మాఘ్యము వెన్కకుబోయె, దీవలన్
నిండుగ సాగజేసి తననీడ గణింపక బూఁచె మల్లె, యు
ద్దండ సువర్ణదీధితుల దార్కొనె సంపెగపూవు లామనిన్. 20

రాసులుగాక నేలబడి రంగులనీనెడు గుల్కరాలలో
**పాసిన పూలగుత్తులవె** పాపపలేవడి గ్రుంగి శీలముల్

మాసిన బీదవారివలె మవ్వపు నన్నెల గోలుపోయె, సం
త్రాసము జెంది లేళ్ళగమి దప్పికి నీరముచెంత గ్రాలెడున్. 21

వికృతి వెలార్పకన్ నెమరువేయుచు, గొండొక చెట్టునీడ బ
చ్చిక నెలవుల్ బయళ్ళ, నృపశేఖరులట్లు పరుండి సోగకం
డ్ల కొనలతోడ దోమల నదల్చు నవే బసవన్న, లావులున్
నికటత బాయు దూడలను నెవ్వగ మోరలనెత్తి బిల్చెడున్. 22

కలికి తురాయి నెన్నుదుట గ్రాలగ గజ్జను దోల్చు పక్షి, సా
ర్థులఁ దినగోరి, ముక్కుకొనకొప్పు టులిన్ టుకుటుక్కటంచు, బో
టులనిడ, గొజ్జెకాపరి, యెటో సులతాంత లతావితాన మా
కలముల గ్రిందవేయగ, సజావలి నమ్మితిమంచు బల్కెడున్! 23

ఇంద్రధనుస్సదే! కను మహీన విభిన్నరుచి ప్రణాళికా
సౌందర్యము! తెల్లనౌ మొయిలు చక్కియనంటి, మనోజ్ఞనృత్య ని
స్తంద్రు, సుమాసమన్వితుని సంస్మృతిఁ బేర్చి, వియద్గతంబులీ
వైంద్రియక ప్రపంచ జనితాద్భుత దృశ్యము లీశలీలలౌ! 24

శ్యామల శాద్వలస్థలి, గ్రేళ్ళువాఱుచు
లేళ్ళపిల్లలు నాట్యలీల జూప
ప్రసవ భామల క్రేవ, భసలముల్ ముదితులై
ఝుమ్మని ఎలపుల సొగసు బాడ
మంతనమ్ములకు, శకుంత కాంతలు వల్ల
భుల బిల్చుచున్ బ్రీతి పొల్పుదెల్ప
పల్చని కిసలయపాళి కేలొమ్మద్పుల,
గున్నమామిడి చేతి గుంపు గొల్వ

దక్షిణా, మరుత్కిశోరు లుదార డోల
లెక్కియూఁగగ, చలునల కిరవు నెఱయ
ప్రకృతియు, వసంతు నుద్యానవాటిలోన
ప్రకట సంసారిణి గతి సంభ్రమము జూపె. 25

కాలము జాలుకొద్ది, మమకారములున్ దిగజాఱు, గన్నుఅల్
బాలుడివోవగా బ్రకృతి బాష్పము లారు, కనీనకవ్రజం
బోలి సమస్త కష్టముల నోర్మిమెయిన్ భరియింపజేయు, ధీ
శాలియగున్ మనుష్యుఁడు కృశత్వము బెంపును నీవె కాలమా! 26

అల్లాడన్ బనియేమి? కర్మలవి వ్యత్యాసంబొ, క్లిష్టంబొ, సం
పల్లాభంబొ, వెలార్చుచుండె, నెపుడున్ - పాపంబొ, పుణ్యంబొకో
యుల్లం బచ్చెరువంద, జిత్రఫలమేదో యబ్బు! పంకంబునన్
ఫుల్లాంభోజము, భోగిలో విషము నుద్భూతంబులౌ చందమై. 27

మానక కర్మదేశముల మల్పుల బుట్టు ఫలంబు లన్నిటన్
లీనవు కాలరూపిణివి! లెక్కకు మిక్కిలి వంతపుండ్లపై
నీ నవకోమలాంఘ్రులు గనీనము మోసినజాలు! ఔషధం
బై, సనలెత్తి క్రొత్తవగు నర్థములన్ మది యూఱడిల్లెడున్. 28

అక్షయ, యీమెడన్ జరుగు, హాయన మేమి యరిష్టమానొ? ర
క్తాక్షినె మోరుగ ల్పతన కష్టము మూఁడెను: రౌద్రినుండి యే
దో. క్షయవార్త యాంధ్రతలి దోఁచుచునే మది జిచ్చువెట్టె నీ
శిక్షణ మేగతిన్ దొరయు? చెప్పగ నేరికిసాధ్యమయ్యెడున్. 29

వేదవిధానము ల్సమసె - విప్రకుటుంబము లార్తిచెందగా
వేదపథంబు మృగ్యమయి విద్యాపు లాటవి జెన్నఱంగ; ద

న్నాదృతి నుద్ధరింపు(డని భారతమంతయు గుయ్యిడన్ శుభో
త్పాదక కోవిదుం డెవ(డు దక్షు(డో? ధర్మము, నామె బ్రోవగన్ 30

ఆ మహామదు బిన్ తుఘులఖు(,
డేమార్గము దొర్కు(వా(డో? యేయేనృపు లే
బాముల బడువారో! కటా
తామసమును వీడి హరు(డు దయ(జూడ(డొకో. 31

ఒకచో వృష్టియు! నొక్కెడన్ దరుణసూర్యోం డంబుదచ్ఛన్ను(డు;
అందకటా! నీలభుజంగ మొక్కటి విహంగాండంబులన్ మేయగన్
వికటాటోప ఫణాగ్రముల్ పయికి( గ్రవ్వింపన్ శకుంతాంగనా
వికలారావము హెచ్చె! హా!! మృగయు(డున్ వేసెన్ వెసన్ సర్పము
స్తకమే వ్రీలిపడంగ! వింతలవురా! సర్వంసహాదృశ్యముల్. 32

ఈ పులినంబునం దుదయమే పెరుగమ్మగబోయి సోలి, యే
దో పరమాప్త భావరస మూరెడి పల్లెల పాటలన్ మన
స్సోపిక బట్టి పాడి రదె సోయగపుం జవరాండ్రు, గొల్లెతల్
దాపులజేరి పెన్నెమటతగ్గి లలాటపు జుక్క లారగన్. 33

ఇళ్ళకుబోవ గర్షకులు నెద్దులపై నొగలంటియున్న పె
న్మళ్ళను విప్ప(జూచిరి, నభోమణి శృంగము నెక్కినిల్చె! వి
స్తళ్ళకు మట్టియాకు లే(క జాలును తమ్ము(డ! లెమ్మ గుళ్ళవా
కిళ్ళను మూతు రర్చకులు; క్రిందికిరమ్మని చేయివీచుచున్. 34

సన్ననిదేహ ముచ్చభుజ శాంతవిలోకనముల్ విశాల వ
క్షోన్నతి, దీర్ఘబాహువులు, నుత్తమ హేమరుచిప్రసన్నతల్
చెన్నుదలిర్చు భూమిసురశేఖరు( డాత(డు హంపిచేరువన్
గ్రొన్ననలెత్తు తో(పుకడ గ్రొవ్విన గుజ్జువటంబు చాయలో. 35

చెట్టుపయినున్న తమ్ముని జీరి; పుడమి
జెదరిసట్టి పత్రింబుల జేర్చి, కుప్ప
లైన, తొడిమలఁ జంటించి, యానునట్లు
పఱచి, సంచినుంచి, వటాంఘ్రిపమును మ్రొక్కి. 36

"భోగినాథా! యిదేమి? నీవును దరస్మి
తాననుండ వైతి" వటన్న "మాధవమహర్షి
యుద్యమప్పు రొట్టియును, ననాహూయమాన
లాభమా నేతిలోఁబడి శోభఁజెందు". 37

అనఁగ నాలించి, యీషద్విహాస భాసు
రాస్యుఁడై, మాధవుఁడు దేనినాశ్రయించి
పల్కెదిట్లు? మహర్షినే? పడుచువాఁడ!
కొంటెవైతివి చాలింపు మింటినంట! 38

అనుచు నదలించి యేగెడు నన్న యడుగు
జాడ జనుచుండు ననుజుండు, "సరిగ నపుడె
మహమదీయుల దాడిని స్మరణఁదార్చు
నీకు విహగావనంబు కంటికిని బడదె?
ఎచటి మృగయుండొ? ఫణి నేలనేయలేదె? 39

ఏతమున బైకి క్రిందికి నెక్కిదిగెడు
నీ కనుబొమల్ గుదుటఁబడి నిల్వలేదె?
శ్రుతులు దాత్కాలికంబులు, సూనృతార్థ
విస్ఫురణ లంచు మున్నీవ వినుపలేదె?" 40

మెల్లగా నిట్లు నుడివిన వల్లెయనుచు
"కవిత జెప్పఁగ వలఁతివైతివి, కుమార!"

యని రయాన, విరూపాక్షు నాలయంబు
దరిసి, లోనికి జనిన మాధవుఁడు, సాయనుండు
నందించు, శుభ్రాంబుకుండికఁ గొని. 41

కరయుగంబును బాదముల్ క్షాళితముల,
షష్ఠిపంచె యంచున దడిఁజార్చి యీశు
సన్నిధిఁ జొచ్చి యర్చకుల్ సారెచూపు
హారతుల జొక్కి తీర్థ తుష్టాంగుఁ డగుచు. 42

"అమ్మహితుఁడె, పాతిక, వయస్సయ్యు, లోక
బాంధవుండు ! సజ్జన మనః ప్రాణవిభుడు
మాధవ మహర్షి ! యోగ సమామ్నాన్యకాయుఁ"
డనుచు నగ్గించు జూపఱ నరసి సేమ
మడుగుచుఁ స్వీయగృహమున కంతఁ జనియె. 43

పంద్రెండునూర్లు నిర్వదిమూఁడు వర్షముల్
శాలివాహన నృపు శకమునందు
శుభకృత్తులో దొలిచూలు శ్రీమతి మాయ
ణాఖ్య దంపతులకు నాత్మజుండు
వనజాతభవునంశ వర నిగమాగమ
వేది మాధవసూరి వృషభుఁ డుదితుఁ
డతని తమ్ములు సాయనాచార్యుఁడును, భోగ
నాథుఁడు జ్ఞాన సనాథులగుచు
గొలువ ధర్మోద్ధరణ శక్తి కలితుఁ డాత
డుర్వినుతుఁడు, విద్యారణ్యయోగి ! యాగ

భాగి! శీలానురాగి! శుభపరిజావ
నేద్ధ భాగ్యైకభోగి పరిసిద్ధుఁడయ్యె. 44

దీక్ష, గురుత్రయంబుకడ దివ్యమనీషయు, వేదశాస్త్ర సం
శిక్షిత పాండితీ విభవ శిష్టతయుఁ గని, యారితేరగా,
నక్షయ నామ వర్షమున కబ్దము లిర్వదియైదు జారె, స
త్య క్షమలుఁ దపోనిరతి త్యాగము లాతనిరూపు గైకొనెఁ. 45

అనురూపము, ననుకూలత
యనయం బప్రతిమభక్తి యనురక్తియు నిం
చినయువతి, పీతిహోత్రయు
దన యిల్లాలుగ నతండు, ధన్యతబూనెఁ. 46

వేలును లక్షలై జనులు వింధ్యముక్రింద వసించువారు, ను
ద్వేల భయాప్తి దక్షిణపుదిక్కె శరణ్యముగాగ వచ్చి, యీ
శాలయ పార్శ్వముఁ దొఱఁగి యాశ్రితవత్సలు మాధవాజ్ఞ చేఁ
గ్రాలి, నికేతనంబులను, గట్టిరి, హంపి పురోపభూములఁ. 47

బాజీరాయఁడు బ్రహ్మేంద్రయతిని దర్శించుట.



అని బ్రహ్మేంద్రుఁడు, వేదభాష్యరుచిర వ్యాఖ్యానసూక్తిఁ దమిఁ
విను, శిష్యార్భక పంక్తితో బలుకు నవ్వేళఁ, బృహద్వాజి పీ
ఫున, జీనుఁ గదలాడ, గ్రిందడిగుచుఁ, భూదేవుఁడుఁ మంత్రియుఁ
ఘనసేనానియునైన, బాజిపతియుఁ, గైమోడ్పులఁ డగ్గఱఁ. 48

శ్రితునిఁ, వీరవరేణ్యసన్నుతుని, బాజీరాయనిఁ జూచి, సాం
పరిత సంప్రశ్న పురస్సరంబు, జిరుచాపఁ గూర్చొనంజేసి, స
త్కృతిఁగల్పించి, ముగించె ఋగ్వివృతి, వాగీశాది దేవాత్త సు

వ్రతి, బ్రహ్మేంద్రుఁడు; శాంతిపాఠతతియున్ వర్తిల్లెనంత్యంబునన్ 49

వచ్చిన రాజ భృత్యులును, చారులు, పంక్తులుదీర, మధ్యలో
నుచ్చ సువర్ణపీఠిపయి నున్నతదండము జేతఁబూని, తా
నొచ్చములేక నెల్లర సహోదరులట్లు ప్రియోక్తు లాడుచున్
జెచ్చెర వడ్డనల్ మిగియజేసి యనంతర మా యతీంద్రుఁడున్. 50

హస్తోదకముల సుకృతి
న్యస్తములన్ గొనియు, మాధవాది నుతిసుధా
విస్తృతి, బాలనుగ్రోలి, స
మస్తుల భుజియింపుఁడనుచు మగుడన్ నుడువన్. 51

కలమాన్నంబును, మాహిషంబుదధి, సుల్లం బొక్క భక్ష్యంబు, స
ల్లలితం బామ్రఫు ముద్దపప్పు, రసముల్లం బల్లనూఁగించు, గా
రెలు, మిన్నప్పళ మూరుగాయ, వడియాల్, రెట్టింపుగా గోఘృతం
బలరన్ భోక్తలు నుల్లసిల్లిరి, మహాభాగ్యంబుగా మెక్కుచున్. 52

నల్లేరువరు గెంతో నాణెంపు రుచి యొక్క:
నల్లఫు బచ్చడి యంతనీటు?
విగడ మావులనేయి! సొగసైన విస్తళ్ళు
ఎద జల్లనన్ జేయు హిమజలములు
మఱి చాలునన బలుమారులు వడ్డించు
ఛాత్ర జనాలు విశ్వాసపరులు
వరియన్నమున్ మాకు వలదంచు జేయొడ్డు
నోరులకు రొట్టెలు సరటికూర !
యనుచు వేత్త్వోఱ నగ్గించి రందరతిథు
లంత భోజన యజ్ఞంబు నంత్యమయ్యె,

షానివరుఁడు, గోక్షీరముల్ మాత్ర మాని
వస్తుఁదీర్చె నఖండతపస్వి యతఁడు!. 53

శ్రీరామనవమి పారణ
మారాధన పూర్ణమై, సమారాధనలున్
బూరితములయ్యె భూసుర
వారంబులు, నితర భక్తవర్గము పొగడన్. 54

అంతట నపరాహ్ణమునన్
జెంతనె కూర్చుండి, బాజి, చిమణాజి యుతుం,
డెంతయు నమ్రతఁగల వృ
త్తాంతంబును జెప్పి, యతియుఁ దర్పరత వినన్. 55

పర్షియకున్ రాజగు, “నా
దిర్షా” సైన్యముల బంపె, దేరువుల గొట్టన్,
ఘర్షణలకు సిద్ధుఁడట, య
మర్షముతో, భారతీయ మతనిష్ఠులపై. 56

పరులు, ఫరంగీలును, దు
ర్భర బాధలబెట్టి, జనుల, స్వమతాన, బలా
త్కారణంబునఁ జేర్చిరి, ఘా
దిరుల మతావేశ దుష్ట దీక్షకు లోనై. 57

గోవా, డయ్యూ, బసాయిల్
నావల కేంద్రముల బూని నానార్థంబుల్
పోరివులుగ దోఁచి రంబుధి
దోవలలో బుడతకీచు దొర లుక్కుగులై. 58

వేయియు నూర్లేడును, ము
ప్పైవ్రయెన్మిది యేండ్లు గిస్తు ప్రభునిశకములో
బోయెనని, బుడుతకీచులు
సోయగముగ, బంధువులను సొక్కుచు నటుపై.
59

దాయలవలె, నెల్లరుఁ
గూయిడగఁ గూలదోలి, కొల్లగొనిరి, దో
షాయతులు, నిశాచరులుఁ
జేయరు, దుండగము లట్టి చెడు కర్జములఁ.
60

అన్యమతులని కారాగృహంబు లందు
భర్తలను ముందు బంధించి పాపులగుచు
భోగినులఁజేయ, గర్ష కనాగయాన
లెందఱినో దొంగలించిరి, సుందరులను.
61

చెప్పవాల్పక దెల్లవా రొప్పుకొనని
యువిదలఁ నిల్పి పైటల, నోరకీడ్చి
యెదలపై, గను మీటుదు రుదితమోహ
తమము నౌచిత్యరీతుల దప్పఁజేయ.
62

కన్నుమూయక, వేఁగుచు కాంతులకయి
శీతశార్వరిఁ గాచెడు రోఁతలేల
యిటులనని పడుచులకు దుప్పటుల గప్పి
రాత్రిల బలాత్కరింత్రు గరాసులగుచు.
63

అలమట బడియు, మానంబు నాస్తిపోవ
వేనవే ల్కాంగినీకులు, వెడలివచ్చి

రార్తకథ లిట్టివనుచు నోరార జెప్ప
కొనరు సిగ్గు, సంకటము పెంపున, మునీంద్ర! 64

దొరలు కొందరు మేనిపై దూఁకునపుడు
సురిఁగెడు తురుంభము పూలసోన గురియ
నుఱికి, యొఱనుండి యసిఁ బీకి, వరుస నల్వు
రరుల జెండాడె, చండిక యనఁగ బొల్చి,
యొక కృషీవలాంగన యనియుఁ వచింతురు. 65

చెఱల బెట్టియు గులముల జెఱుపబూని
పలల మన్నంబు నోళ్ళ లోపలికి దుఱిగి
పస్తుపడ, దస్తలోహాల వాతలేసి
సంజ్వలిత వహ్ని గొందఱ జంపి రంద్రు. 66

దుర్భరంబులు కష్టాలు దుష్టపీడ
లంటియే యుండె నక్కట హైందవులకు
ఐకమత్యాన ఫురుష కారాధ్యు లగుచు
భారతీయులు గా జనుల్ బ్రదుకుటెపుడో ! 67

అనుచు, జేవురించిన మోము, కనుల మిడుగు
ఱులను జెరగ, దేశికు కెలన బల్కు
బాజిరాయని వచనము ల్పరమసత్య
ములుగ, దలయూఁచు, చిమణాజి, యలిగె, కలఁగె. 68

## బ్రహ్మేంద్ర యతి హితోక్తి.

మునియు నాలించి, మ్లేచ్ఛులు బుడుతకీచు
లొక్క తెలుఁగు, భారతజను లొక్క తెలుఁగు

మతములఁ భాషలఁ స్వజీవితము లందు
ననుచు మున్నాడనే పోరునవసరముల ? 69

కయ్యామునకు నెయ్యామునకు
వియ్యామునకు సమతవలయు ! విధిలేని యెడఁ
డయ్యక, నెదిరి బలంబుల
నయ్యో లోపంబు లరసి, యణపఁగవలయుఁ. 70

ఊరక బరహింసకు నై
పోరగరా దాత్మభంగముల, ముప్పులలో
వీరులు బవరము లాడియె
యారాధ్యులు, ధర్మరక్షణావేశముచే. 71

భూతహితంబుగా నడువ బుణ్యాము లబ్బెడు, చెల్లియుండియుఁ
భూతవిపత్తు దీర్పమియు భూతవిరోధము సేత, పాపఫుఁ
గోతులద్రోయు, ధర్మముల కూడలియుఁ దయయే ! పరస్పర
ప్రీతులు, భక్తిశ్రద్ధలును, ప్రేమ, దయాప్రసరంబులే యగుఁ. 72

దయయదిలేక, శాత్రవుల దారలబట్టుట బానిసీలగా
భయవికలాత్ములఁ దురము బాల్పడిన ట్టిరులఁ గ్రహించుటల్
నయగతి యంచు సమ్మెదు జనమ్ములు బైపడ భండనమ్ములఁ
ప్రియగతి గాదొకో కృప ! పరాజయకారి పరార్థ నీతియుఁ. 73

విమతారాతుల నిశ్శే
షముగఁ దునుముటయె లెస్స, సమరతలమునఁ
సమ కాఠిన్యము వలయును
శమముఁ ధర్మమును జెల్లు స్వమతీయులలో. 74

పతితుల నుద్ధరింపనగు, పాపులతో బ్రియమాడవచ్చు, దు
ష్కృతులను నోర్వఁగనౌ ! నకట జంపఁగవచ్చిన వాని మాటకున్
బ్రతుకెనరాట పథ్యమొకో, భావుకమే సరిపంథి రక్షణ
వ్రతమతి, నీకు ? పన్నగముఁబట్టి వసింపఁగ జేయఁబోలునే ? 75

విధ్వంసితమైన గోరీ
సధ్వాన్నపు ధర్మమెన్ని, హతశేషునిగా
పృథ్వీరాజని విడిచియు
వధ్యన్వితుఁడయి, వినాశవశుఁడుఁ గాఁడే ? 76

విమతులె ప్రజ యయ్యెడిచో
సమతనె పాలింపవలయు ; సత్య మహింసా
క్రమమె మహోత్తమ మయ్యును
దమియించునె న్యాయ్య మనులదర్పము నాజిన్. 77

పలువుర కహితం బగునది
సలలితధర్మంబు సరణి సాధితమైనన్
విలయమె ఫలము ! అధర్మమె
కలుగున్, ధర్మంబు భూతకల్యాణ మిలన్. 78

దుష్టుల జంపుటవలనన్
నష్టం బెందును గలుగునె ? నల్లుల నళులన్
సృష్టియని విడిచిపుత్తురె
కష్టరహిత వసతి వలయు గాపురమునకున్. 79

చెప్పితిని మున్నె యెన్నియొ
యొప్పుల బెడచెవినిబెట్టి యూరక, ఢిల్లీ

త్రుప్పు దొలిపియు, నిజామున్
ముప్పునఁ ద్రిప్పగల దఱిపి పోరుడుగుదువే ? 80

ఈదున్ జోడును దోడునీడలయి, మీరే పోరిలో నిల్చినన్
గోదున్ గూడి రిపుప్రకాండములు, నుగ్గున్ నూకలై పోరొకో ?
వేడన్ వచ్చిన యంతమాత్రి కుటిలున్ వీడంగ బోనిచ్చి య
వ్వాఁడే పిమ్మట దాడివేసిన, పునర్వ్యాసంగమున్ జేసెదే ? 81

వికల స్వోత్కర్షయుతం
బకుటిలమా కరుణసూపి, యరిరాడ్గణమున్
జకితుల జేయని నీవెర
వకటా ! సంకెలయె పిదప స్వావని కనుచున్. 82

అన్నయు దమ్ముఁడు, నిర్వురు
నున్నయ పథరీతి దెలిసియున్ గితవులపై
మన్నన సూపుట దగదని
విన్ననువున జెప్ప నొప్పి వినుచుండంగన్. 83

మునియు రహస్య విషయముల
కనువగు యోజనల నుడివి యంతట బాజీ
యనుజుఁడు చిమణాజియు దన్
గని విద్యారణ్యమాని కథ యెందులకై. 84

దడవితి రని ప్రశ్నింపఁగ
నుడివితి వేదార్థ వివరణోద్యమి ఘనునిన్
వడుగులకున్ దెలియ నతని
యడుగుల జాడలనె నీతి నాడితి మునుపున్. 85

రాజసికులు వీరాగ్రణు
లోజఁ స్వార్థంబువిడువ రుద్ధతి దమలో
నాజుల గల్పింతు రనియె
సాజంబగు రాజ్యరచన సాగించుటకై. 86

హరిహరునకె బట్టం
బిరవై యుండంగ బెట్టియే, తమ్ములచే
పరసీమల గెల్పించియు
వరగతి వారలనె రాజ్యపతులుగ జేసెఁ. 87

విద్యారణ్యాజ్ఞయె, యన
వద్యంబుగ నమ్మి వారు, హరిహర సామ్రా
జ్యోద్యమ సాధకులగుచుఁ
సద్యస్సుఖమూని, ధర్మసంరక్షకులై. 88

నెగడియును, మాతృభూమికి
వగ పుడిగించిరి! తదీయ పథ మనుకృతమై
ప్రగతిని జూపు; శిరోమణి
సుగతిఁ బాజీశు గొల్వజూచిరి పతులుఁ. 89

పునహా, ఛత్రపతి "సాహు"చే బూతమగుడు
ఘూర్జరంబున "దామాజి" కొలుకొనియె,
"హాల్క" రిందోరులో సుఖమొనర, నాగ
పురమునందు "రఘోజియు" బిరుదువడసె
గ్వాలియరునందు "సింధియా" కాపులుచుండె. 90

వీర లేవురు బతులు నుదారు లగుచు
బాజిరాయని కూతగా బరగి ప్రగతి

శీల కార్యప్రణాళిక కాలవాల
మైరి! దీనిమూలము మాధవార్యనీతి! 91

అని బ్రహ్మేంద్రుఁడు వల్క సంతసముతో నార్యా! యికఁ ద్రావణం
బును దాఁపై పడునంత దాక విసఁగక బ్రోత్సాహముఁ బుట్టి, క
య్యనఘుం డేమియొసఁగ్చె పంపకడ? విద్యారణ్యుఁడెట్లయ్యె? నా
తని యాజ్ఞాచిత ధర్మ మేగతి సమృద్ధంబయ్యె? దెల్పక దగుక. 92

వినుతికి నెక్కినవగు, స
జ్జన చారిత్రములు లోక సౌజన్యకర
స్వన వీణలు, శ్రేయములక
నినుచు ననుకరింప విజయ నిశ్శ్రేణులుగా. 93

అని, చినమంత్రి వేఁడగ మహామతి మానియు వల్లెయంచు నా
యనుజుల వీడుకొల్పె నఘ డాద్మృతి; నవ్వల నొక్కనాడు, భ
క్తినిరతుఁడౌచు నాశ్రమము క్రేవ సటక చిమణాజి చేరె బూఁ
చిన తులసీవనంబునకు జేరువ నొక్క కుటీరవాటికన్. 94

ఆత్మృత చిమణాజి, వినన్
చేతనులు ధరింప సత్కసిద్ధిద సుగుణ
ప్రోతము, గిరిశ గృహీతము
పూతమునగు సంపచరిత మునియున్ దెలిపెన్. 95

పంపామాహాత్మ్యమును, బ్రహ్మేంద్రుఁడు నుడువుట.

---

పంప మహాతపంబు, బెనుపక స్సృడుఁ డెంతయు సంతసించి, క
వింపుగ ధాత పెంపున నహీనరతిక భజియించి తేమి పా
పింపఁగనో యటంచు మురిపింపగ, గన్నులువిచ్చి, పేర్మియుక

బెంపుగనన్ బినాకి పదపీఠమునన్ దలవెట్టి యిట్లనెన్. 96

వరద ! భవత్కృపాకృతియె పాచె నితాంత దురంతచింతలన్
వరుఁడవు నిన్నెకోరితి గవాంపతి నందియు నెట్లొ యట్టులే
వరవుగ నన్ గ్రహింపు మురుభక్తిని నీ కుపచారము ల్సదా
నెఱపుదు నీకుఱంగట ; గణింతు నిదే శతకోటిగా మదిన్. 97

అనియాడిన నవ్వి, దయా
వనధి "విరూపాక్షు నన్ను వర్ణించితి వీ
వు నదే నామముతో నిట
మునిసేవల నందువాడ ముగుదా! యిదియున్. 98

దక్షిణ కైలాసంబుగ
నక్షీణ తపోవిభూతు లమరించుచు, ది
వ్యక్షేత్రంబును పొలుచున్
మోక్షదుఁడై రఘువరుండు ముందిటువచ్చున్. 99

అనియు, మహేశ్వరుఁ డచ్చోటు
నెనసిన లింగాంతరంబు నెయ్యిన మొదలా
యనిమిషులును మానవులున్
దనిసిరి, పంపావిభుండు దనరె వరదుఁడై. 100

అది "కృత" మా యనంతరము సంజనకున్ జనియించె వీర్యసం
పద బొలుపారి భావివిధి, పావని, తేజము, రామదూతమై
ముదిమిని, వంగెయున్, శబరి మోదముతో రఘునాథురాకకై
సాద మెదురుండగా, నెదురు జూచుచు వేచి వసించె నచ్చటన్ 101

మర్కటేశు నర్కజు గాచి మైత్రినేచి
వాసిగనె రాముఁడు మతంగవాసి యగుచు

మాల్యవంతాద్రికడ హనుమంతుఁడిచ్చె
ధరణిజాత చూడామణి, దాశరథికి. 102

పంప బేరనె తుంగయు బరగు కతన
పంపయని పిల్చె వాల్మీకి ! పరమకవియు !
పంపయుఁ దుంగభద్రికు బ్రిక్కనిల్చె
రమయు నాచేరువనె కాపురంబు బెంచె. 103

కలితరణ గుణాలంకా
రులు మాన్యులు శాతవాహ రూఢాన్వయు లా
తలమున జన్మించిరి, జయ
ములఁ దుంగ మొదలిడి గంగపుంచిరి, ప్రభుతన్. 104

వారు మహారాజులగుట
దీరె "మహారాజవాడి" తెన్నున పేరై
వారల పిదప జళుక్యులు
మారిరటనె, రాష్ట్రకూట మహిపులు గెలువన్. 105

పథికులు కుంతల దేశా
వధియని యటనిల్చుచుండ, పంపాపతి, స
త్య ధురంధరుఁడై ప్రోచెను,
మధువనములు నచటవెలసె మహితము లగుచున్. 106

బిజ్జలుని యనుజు పౌత్రుఁడు
సజ్జనహితుఁడు నరసింగ సమరార్జునుఁడున్
గజ్జెల గట్టెను జయరమ
కజ్జగతి నృసింహరాష్ట్ర మనఁగన్ జెల్లెన్. 107

ఆ నరసింహుని వంశ మ
నూన దశాబ్దంబు లేలె నష్టాదశముల్
జానుగ బ్రతాపరాయలు
దానూనెను బాలనము నుదార యశుండై. 108

ఓం తత్ సత్

[ షరా:- (1) సదాశివరాయల కాలములో నెల్లూరువరకు మార్జవాడి యనుపే రుండెననియు, నది శాతవాహనచక్రవర్తుల కాలమున రాయలసీమకు నామమగు మహారాజవాడి అనుటకు రూపాంతరమనియు, (2) మాధవ నిదానమును రచించినది మాధవ మంత్రియే కాని మాధవాచార్యుడు కాదనియు (3) మహమ్మదు బిన్ తుఘ్లఖును, ఆనెగొందినుండి వెనుదిరిగి పోవునప్పుడు, ఆర్వీటి సోమదేవరా జోడించి దెబ్బతీయగా పిచ్చిపట్టి దేవగిరికి డిల్లీజనులను మార్పించెననియు ( చూ — శ్రీ వీరభద్రరావుగారి అళియరామరాయలు ), (4) బిజ్జలుని సోదరుడగు విజయధ్వజుండు కట్టినదియే విద్యాపురిగా కొత్తగా వృద్ధిచేయబడినను బుక్కరాయల కాలమునుండి విజయనగరమనియే వ్యవహరింప బడెననియు, (5) కంచిలోని సర్వజ్ఞ విష్ణువే విద్యాతీర్థులైరనియు శ్రీ వేదాంతదేశికులు, విద్యారణ్య సతీర్థ్యులలో నొకరనియు చరిత్రకారులు నిర్ధరించిరి. ఈ యంశము లటనట ననుసంధించుకొనవలెను.]

శ్రీరస్తు

# పంపా భారతము — సభాపర్వము

## ద్వితీయ ఖండము

### జంబుకేశ్వర రాజ్యాస్తమయము.

నాంది:-

వరదాయకము, వరేణ్యము
నిరులంతయు దెగిన తుది సహానద్యుతితో
స్థిరము, బరమ్మును, గలి సం
తరణముసగు జోతిఁ యిచ్చు తత్పద సుఖముఁ.

అసదృశ శక్తి మహైశ్వర్య సౌందర్య
బింబయా పంపాంబఁ బ్రీతిగాంచి,
నిటల నేత్రానల పటలోగ్ర నటన సై
భవు కృపానిధి విరూపాక్షు నెన్ని,
చామీకరేక్షణు చారు విద్యుత్కాంతి
మహితు వీరుని హనుమంతు సమ్మి,
విశ్వసంత్రాత విభీషణాభయదాత
యైన శ్రీరాముని యండఁ జొచ్చి,

కలియుగంబున వైదికకర్మ సమసి
ధర్మముత్సన్నమై పోవు తరుణమందు
నుదితుఁడైన మాధవమహర్షి, యుద్యమంబు
లేవఁదీసెను, వేదముల్ చేవదేరయ.

విద్యారణ్యాము నీశ వాస మహిమన్ వేద్యంబు, పంపాతటం
బుద్యద్రాజ్య జయప్రభాసహిత శౌర్యోత్సేధ సంపత్తిచే
నాద్యంబున్, నిగమాగమ ప్రతతికిన్ వ్యాఖ్యానముల్ బూన్చు స
ద్విద్యావంతుల బుట్టినిల్లును, జగత్ప్రఖ్యాత తీర్థంబునై. 2

అతఁడును శుక్లవాసరము లందు నొకానొకపూట, గెంపుసం
జె తరిని, పంపదొడ్డున, హృషీకము లార్చి, శివాష్టమూర్తులన్
వెతకి మదిన్ గుదించునెడ, వేఱుగ వేఱుగ నాకసంబు నం
దతుకులుగాఁగ దెల్లవగునద్దపు లాకృతులన్ వహియింపజూచుచున్.

ఎనుబదినాల్గు లక్షలు మహిన్ గలయట్టివి జీవరాసు లిం
బున తమరూపరేఖల నభోతలిలో దలక్రిందులై బడన్
ముని కనుగొల్కులన్ కొలఁకుమూర్తులు తామయి తాండవింప వి
స్సనువున మింట గుంటఁ గనె సవ్యము లాత్మని చిద్విలాసముల్. 4

క్షణికములయ్యు, స్పష్టముగఁ జారు శరీర నిరూపణంబులన్
గణనకు మేఘమాలికల ఖండము లెక్క, తమంత మాయుచో
నణఁగె సఖండ మేకమయి, యంతట జుట్టునుజుట్టు విన్నునన్
మునుగుట లెత్తి దోఁచుటలు, మున్మర మాసురవర్త్మ మెట్టిదో!

గగనంబునుండి శంకరుఁ
డగజాతన్ గూడి వృషభ మవరోహింపన్
డిగి యొక యద్భుత తేజము
నొగి దన్నున్ బాదివిసట్టు లూహకుఁ దట్టెన్. 6

ఎన గనఁగాని చిత్తము నహీనత నొక్కెడ నిల్చుచో, సుధీ
ఘను మదినిండ, నిండె, నవికార జగద్వపువామహేశుఁ డిం

పున సరసీజ మిందుఁడును బొల్చెను మొల్చెను గంగలోన నీ
వును గనుమంచు భార్యతికి బొల్పుగ దెల్పు సతీసమేతుఁడుఁ. 7

సుస్మితవక్త్రి భర్తఁగనుచుఁ నిలుచుండిన వీతిహాత్రికుఁ
విస్మిత కాతఁ డిట్టులనె విశ్వవిభుఁ శివు సంస్మృతిఁ "నిమ
గ్నోస్మి" యనంగఁజేసితిని కోరికలూరగ, నింద్రియాభిరా
మస్మరణాంచితుండు యజమానికి నైజమొకో కవిత్వ వా
క్కస్మ దనిత్యభావనల నంటినఁ గూడునె చిద్ఘనస్థితుల్ ? 8

అన విని యామెయు నాకుఁ
ఘనతరము, మనోలయంబు గఱఫ్ఁడు, యోగా
గ్రి నిచిత చిత్తగ మీతో
ననుపమ దాంపత్య సిద్ధి నడరఁగవలదే ? 9

అని వినతిసేయు నర్ధాం
గిని గని వల్లెయని చెప్పె గీతార్థము ; ను
న్మని నాత్మఁ గను తెరువుఁ;
మననము గతి ; మౌని ప్రణయమానిత మతియై. 10

అంతట గొంతసేపునకె, యామిని శక్తిగ, విశ్వమాత్మగా
స్వాంతము దిద్దె మౌని ; వికసన్నవశోకము గన్నెరీతి నా
చెంతనె తీసె మేల్మనుగు ; చీఁకటి విచ్చె శశాంకురాక ; ని
శ్చింతమెయిఁ నిశాలలన చేరెను వెన్నెలతల్లి పేరొడిఁ. 11

అనుదినమును నిట్లిరువురు
వినుత సదాచార రక్తి వెలసిరి, కాలం
బును దేశము నీశాకృతు
లనీ కొల్చుచు నాత్మచింతనారాధమతుల్. 12

ప్రతి నాతని మాధవుఁడని
వితతముగ౯ బిల్చిరింట విద్వజ్జనులు౯
స్తుతమతి, విద్యారణ్యుం
డతుల ప్రతిభాఢ్యుఁ డనుచు నగ్గించి రౌరల్. 13

ఎట్టి ముహూర్త మాబిరుదు నెంచి వచించిరొకో ? తదాహ్వయం
బట్టులె మాధవుండు యతియైన యనంతరము౯ సురూఢమై
పట్టుగ నిల్చె నాతఁడును భావనుఁడా గృహమేధియై జనం
బొట్టుగ సన్నుతింప మహిమోత్తర జీవితుఁడై సుధర్మియై. 14

సుకృతి యయి, విరూపాక్షుని
నికటమున౯ వేదధర్మ నియతాత్ముండై
సకుటుంబి, భారతీయత
నకలంకము వృద్ధి జేయ యత్నించె గడు౯. 15

సుక్షేత్రము పంపయు, త
ద్రక్షణ మవసరమటంచు దక్షిణమే, సం
రక్షక సేనల బెంచెను
కుక్షింభరుల౯ సమీక్ష కోవిద తతిగా. 16

ఓరుగల్లును నాశ మొనరించి "తుఘ్లఖు"
గట్టె హైందవులకు జుట్టుపన్ను,
మధ్యభారతము సామంతుల బ్రజలను
బాలింప "బాహుదీ౯" బ్రభుని జేసె,
హక్కబుక్కాహ్వయు లలజడి నోరుగల్
విడిచి, దక్షిణసీమ బుడికి బుడికి

(నయనిధులని రామనాథ ప్రతాపరా
యలు బిడ్డల నొసంగి యాదరింప)
నానెగొందిని నిల్చిరాభూపుఁడును రణా
వని వీరమృతినొంద, నతనికొడుకు,

జంబుకేశ్వర రాయల సన్నిధాన
మందు, సేనానులుగ నుండి రంతలోన
బాహుదీన్, తుఘులకు తోడ, బగయు బెంచి
యుద్ధమున నోడి, భీతిచే నూరుబాసి. 17

జంబుకేశ్వరు కడకేగి శరణు వేడ
నతని మాధవుఁ డడ్డంబు లాఁడ, నాశ్రి
తావన ప్రీతి, నృపనీతి నవల బెట్టి
బాహుదీనున కభయంబు ప్రాపు నిచ్చె
నది యుపద్రవ హేతువై యడలు నడరె. 18

ఇట్టి రాజకీయ స్థితి యుట్టిపడఁగ
మాధవుండును, పెనుజింత మదిఁ గలంప
నిదుర రామి, సగము రేయినే ప్రశాంత
యోజనన్ బూని భావి కన్యాస గతికి. 19

చిత్ర మొకనీడ తనచెంత జేరినట్లు
స్ఫూర్తియైన నచ్చెరువున సోలి చుట్టు
జూచునెడ నీలిసుషమల నాఁచికొన్న
యొక్క యవ్యక్త వ్యక్తియు, ప్రక్క కెనగె. 20

బ్రహ్మరాక్షసుఁడేమొ ! నన్ బట్టువాఁడె ?
యకట యని యుదాత్తమతి నూరకనె యుండ

"మాధవార్యా ! పరివ్రాజ పదవి నిలనుఁ
బావనముజేయ కిట్లు వాపోవనేల ? 21

అంబ భువనేశ్వరీ పదాబ్జంబుఁ బడసి
రాజ సిద్ధుండవై యతిరాట్పదంబు
జెందెదీ వెప్పుడని వేచి వందురుచును
నుందు నేను నీపనులకు నూఁతనౌదు". 22

అనిన విని ముని నీ వెవరనుచు నడుగ
"నేను సింగరభట్టార్యుఁ డీ కుజన్మ
యడఁగ నీసేవఁజేయుచు నడరి పిదప
సద్గతిఁ జెంది ముందుకు సాగువాఁడ",
ననుచు నతఁడు, భవిష్యత్తు నంతదెల్పె. 23

సింగరభట్టు మాటలకు శేముషి మోదది పల్లవింపగఁ
బొంగియు, దక్షిణాపథము బూర్తిగ జుట్టెను, తాను దేవి పా
దాంగుళి నంటబోలునని యాడి, చనెఁ; వఱువాత నుత్సుఁడై
స్వాంగనతో సుదంతము నిజాశయముఁ నచియించె నాఁతఁడుఁ.

ఆలుమగలాది దర్భశయాను గొల్చి
సేతు రత్నాకరంబుల జేరి యచట
నఘ నిబర్హణ సుస్నాన మాచరించి
యల్ల రామేశ్వరు భజించి యంత దిరిగి
కన్నెకొమరి సేవించి రుత్కంఠతోడ. 25

తోరపు భక్తిమార్గమున దోఁచు సురాలయముల్ స్పృశించి, కా
వేరి పవిత్రనీరముల వేగ నిమజ్జన మాచరించి, యా

చారముతో హరిఁ గొలిచి, యాప్తమతిఁ నిగమాంత దేశికుఁ
జేరి, తదీయ సత్కృతి విశిష్టవచస్తతి కెచ్చు మెచ్చుచుఁ. 26

అరుణగిరినాథు బరికించి, యవల గంచి
కరిగి, వేదవిద్వాంసుల కరుణబడసి,
అమ్మ కామాక్షి కెరగియు, నంత నేగి
శ్రీనివాసుని సన్నిధి సేవఁజేసి. 27

దంపతు లిర్వురుఁ బహ్లాదముదంబున నిల్లునుజేరి తమ్ములఁ
బెంపుదలిర్పగా గనుచు, బేర్మిని సంస్కృతి పాశమీడ్చుచుఁ
అంపిరి షడ్రిపు ప్రభుత ; చాలిరి దివ్యతపః ప్రభాత్ములై
యంపఁగ దిక్కుదిక్కులకు నార్తిజనావన కీర్తికాంతులఁ. 28

పతి భువనేశ్వరీ సుపద పల్లవముల్ భజియించుచుఁ, మహో
గ్రతపము నూని నైష్ఠికత, రాజిలుచుండఁగ ; వీతిహోత్రయుఁ
వ్రత నియమానుసార మనురక్తి సుధోక్త్యుపచారముల్, సదా
గతి గతివోలె, జేయుచును గ్రాలె మనోవిభు జీవనాడియై. 29

యాత్రలు యత్నము ల్పాదివి, హాయన మొక్కటి యంతుముట్టి, స
ర్వత్ర శుభప్రమేయ నికర స్ఫురణార్చనలఁ బొనర్చుచో,
గాత్రము కార్శ్యముఁ బొరయగా వెలుగెక్కిన వత్సరత్రయం
బాత్రిపువాఁగులుఁ బలె, నుదగ్రిరయంబున బొల్లిపోయినఁ. 30

దేవియు దర్శనంబిడ దదేమని దంపతు లొక్కటౌ మనో
భావన నాలయంబున నభంగుర యోగసుసంగులైరి ; సం
భావితయాచు నంబయును, బద్మ వరాభయ శూలహస్తయై
కావఁగ సిద్ధయై, యెదుట గన్నుల బండువుగాఁగ నిల్చినఁ. 31

ఇరువురు భక్తి నమ్రులయి యీశ్వరినిన్ నుతియింప, నామెయున్
"స్థిరతర యోగభోగములు జేకురు మీకిఁక గాని, ధర్మ సం
గర విజయాత్త రాజ్యహిత గౌరవ మింకొకజన్మ" కంచు, స
త్వరముగ జెప్పి ప్రాకృతిక తత్త్వమునందు నదృశ్యయై చనన్. 32

ఒకరి మొగంబు నొక్కరు సుఖోద్గతి జూచుచు, చర్చబేర్చి, వే
అొక జని యెన్నడబ్బు మఱియెప్పుడె ధర్మజయంబు, భూమిపై
ముకరములోని బంగరఫుమూటయెకా ! నరభోగభాగ్యముల్ ?
ప్రకటముగాని వాక్కునకుఁ బొల్పడజేసెను మమ్ము దేవియున్. 33

అనుకొనుచున్న దంపతుల యాత్మ హఠాత్తుగ బోధితంబనం
గను, సవిషాదమా కనులఁ గ్రిమ్మెను బాష్పము లంత, మాధవుం
డనునయ భావసక్తుఁడు, మహామతి, ప్రేయసిగాంచి "నెచ్చెలీ !
మనకు విచారవృత్తులను మానము లేవియు వద్దు లెమ్మికన్. 34

నున్ను కడానిమేనున, గనుంగవ పద్మములట్లు మొల్చి, నన్
దన్ను నఖండమీ ప్రణవతత్త్వ సుధాస్మృతి ! నిండుమోదముల్
గాన్పులు ! నీదు కంకణ వికస్వర సుస్వర మాధురీ ఝురుల్
విన్నడ నర్మమాడునెడ వెల్తియె పుట్టదు జన్మ వాహినిన్
మున్నును నేడు, నీకడను, పుణ్యగుణారణి ! రాణి ! హృన్మణీ. 35

నీవును లేని జీవితము నీరముబుగ్గయె, ధర్మరాజ్య సం
ప్లావనమంచు నీకును ప్రవాసము, నాకు యతిత్వమేల ! శో
కావిలమార్గ మెట్లును సుఖాన్వహమై చన దింతె చాలు, నీ
వేవనటన్ భరింపకుము, వెళ్ళుద మింటికి" నంచు బల్కెనన్. 36

ఎంతటిభ్రాంతి నీకు సఖ ! యిప్పటిభోగము లెండమావులే !
కాంతువె వార్ధకంబున సుఖంబుల వీనిని ? నాకుగానె లో

కాంతము దాక బర్వెడు మహాసుకృతంబు ద్యజించువాఁడవే ?
స్వాంతము నింక జొన్పుము జగద్భవుకోద్యమ సత్ప్రణాళికన్. 37

చిలుకల సౌరు శారికల చెన్ను పరస్పరభోగభాగ్యముల్
దొలుకఁగ నిర్వ్యరున్ సుఖకృతుగ్గస యున్కియు లెస్సగాని, లో
కులు దమ ధర్మభోగములఁ గోల్కొని వర్ధిలఁ జూచుటెంతయున్
గలిమియుకాదె ! ప్రాకృతిక కంఠము దాటుటెయొప్పు ! నిప్పు డు
జ్వాలు, బరమాత్మ నీలగళు పాదము, చిన్మయ మేరు వెళ్ళుతన్.

నలనృపసచ్చరిత్ర మవినాశి రఘూత్తము జీవితంబు, స
త్కులపతులౌ మహర్షుల యకుంఠిత విశ్వ శుభప్రమేయముల్
దలపుము ! మాతయున్ గరిసతన్ వచియింపదు ! సింగరార్యుఁడున్
బలుకఁగలేదె భావి ? నిఁక భద్రపథంబునె సంస్మరించుచున్
జెలి జెలువుండు నిద్దరము జేరెమె, వేత్తము దేవియాజ్ఞకున్. . 39

ఆరని సద్వివేకమున నామెయు నీగతి జెప్పిలేచె, మం
జీర ఝుళం ఝుళారవము జిందగ ; సయ్యెడ మాధవుండు ; సా
మీరియుతుండు రామపతి. మించెడు ధామముజొచ్చి మొక్కులన్
జేరిచి, పీఠిహోత్ర తసచేగొని వెన్కొన, వచ్చె నింటికిన్. 40

ముప్పదివర్షము ల్వయసు ! బుద్ధుఁడు మాధవుఁడయ్యె, సద్విధుల్
దప్పని పీఠిహోత్రికల దల్లియు నాజ్ఞనొసంగె ; సత్కృతిన్
జొప్పడి, యోగవహ్ని మనసున్ దనువున్ వెసఁగాల్చి "మీరునున్
మెప్పుగనుండు, ధార్మిక సమిద్వర యజ్ఞము బూర్తిగాఁగ" నం
చప్పతి పాదమూఁదుచు, నహా ! భువనేశ్వరియందుఁ జొచ్చెనన్. 41

రాల్చుచు నశ్రుధారల నురంబున దస్విని బూని, శీర్షమున్
వ్రాల్చి, సతీశరీర భర భవ్యుని సాంబుని బోలి యాతఁడున్

వ్రేల్చెద నొళ్ళు నేనసుచు వేగము లేవగబోవ, నయ్యెడన్
బొల్చెను సింగరాఖ్య వపువున్ సవిధంబున నీలినీడయై. 42

లెమ్ము మహర్షి! సంస్కృతి మలీమస రేఖలు మాసె, జీవితం
బిమ్మగ నిర్ధవున్ వెలుగు లెక్కిన ఋక్షపథంబుఁబోలె! నీ
యమ్మయు నంబయందు మహిమాయతి నిల్వ, భవత్కృతంబు స
ర్వమ్మును బూర్తియయ్యెడు! నవశ్యము భావికి నజ్జవేయ, గా
ర్యమ్ములు పెక్కులుండె నిఁక నాగకుఁడంచు వచింపఁ దేరుచున్. 43

వెలఁదిన్ గంధచితుల్ చెలంగ, మునియున్ వేల్చెన్ మహాభక్తి స
ల్లలితాశ్మాంక వితర్ది చక్కి, మధురాలాపంబులన్ బూన్చుచున్
కలవింకంబులు దోడనాడ, గొరవంకల్ కోకిలల్ కూడి త
త్కులకాంతా గుణకీర్తి బాడునిపుడున్, నిత్యోత్సవ స్ఫూర్తులన్.44

సారములున్ బవిత్రములు, సాధ్వుల సచ్చరితంబులెల్ల! సం
సారములెందు దీర్ణములు, సద్వనితోల్లసితంబులైన! నా
చార విహార ధర్మరుచిరంబులు, సత్కృతికోటి, వారివా
ధీరగుణంబులన్ మహిని దీప్తసులయ్యె! సతీమతల్లులే
ఘోర, కుసాంఘికోపహతి, గోల్కొని, పూఁచు సుధాసువల్లరుల్.45

ఆలే, సుఖములప్రోవై
పాలించును భర్తృ భాగ్యపదవిని, గుణవి
త్శాలినియే, భవబంధము
గూలన్ బతిగూర్చి మోక్షకూలము జేర్చున్. 46

వనటన్ గ్రుంగక నిల్చె మాధవుఁడు! తద్వార్తాలి శృంగేరిలో
నన, సర్వజ్ఞత విజ్ఞుడై పరగు విద్యాతీర్థుఁడున్, వచ్చి యి

చ్చెను సన్న్యాసము, సోదరుల్గొలువ, నచ్ఛిన్నప్రభావ ప్రభుం
డనవద్యుండయి, వెల్గె నాతఁడును, విద్యారణ్య దివ్యాఖ్యచే. 47

శాలివాహనశకగతి గ్రిలు, పదియు
రెండునూ ర్లేబదియుమూడు నిండు, వత్స
రంబున, నధర్మహాతిని, భారతము గూల్చు
నతి విపత్కాలమది ! తుపానునట్లు కలఁచె ! 48

శుద్ధసప్తమి ఘటికల నిద్ధచరిత
మదియు వెన్నెలవెల్లియై యలరుననఁగ
ఘనుఁడు నధ్రుడు ప్రజోత్పత్తి కార్తికము
నందున, నలంకరించె, యత్యాశ్రమంబు. 49

గొప్పదనంబు వహించెడు
నప్పురుషులజాడ యిట్టిదన నాతనికిన్
ముప్పదియేడుల యావన
మొప్పెను సౌశీల్య సౌరభోల్లసితంబై. 50

విద్యారణ్య తపఃప్రభావ మఱవై, విజ్ఞాన సువ్యాప్తికిన్
ఖద్యోత ప్రచుర ప్రభానికరమై, కల్యాణవేదాధ్వ భృ
త్సద్యోజ్యోతి కళావిలాసభరమై సర్వంసహాశాంతి సం
పాద్యాధారము, భాగ్యయోగపరమై ప్రాపొంది పెంపారగన్. 51

ఓరుగ ల్దేవగిరి రాజు లోడిపోవ
దక్షిణాపథ రాజ్యముల్ తఱిఁగి విరిగి
తుఘ్లఖుని దాడి వాఁడి తుత్తునియలగుట
లప్పటికె యారువర్షంబులయ్యె నంత. 52

తన "మేనల్లుఁ గృతఘ్నునిఁ వెనుకకుఁ దండించి పోనీక, చే
తనగుఁ నాకని కుంతలేశుఁడాకఁడే, దర్పాతిరేకుఁ, ననుఁ
గినియఁ జేయునె? జంబుకేశ గజముఁ గీవెట్టగా జేయుఁ డీ
రని సైన్యంబుల బంపె తుఘ్లఖుఁడు దుర్ధర్షాగ్రహోదగ్రుఁడై. 53

ఎద్దడి యెడారిలో లేచి యేచి వీచు
నిసుక తెరల తుపాన్లై యెల్లదిశల
దర్చెచ్చెడు, పఠానుసేన పతాక లీవి
పల్లె పల్లెల రాపాడి, పర్వి పర్వి. 54

నేల యీనినదో యనజాలి, కాళ
ధూమయుతము, కాదంబిని, బ్రామినట్టు
లానెగొందిని వరదయై, యలముకొనియె!
జంబుకేశు సదృష్టంబు సన్నగిల్లె! 55

అంతకుమున్న, కంప్లిపయి, నార్భటి దూకిన ముస్లిమర్చులుఁ
గొంతకు గొంత యార్పి రణకోవిదుఁడై విహరించి, కుమ్మర
పాంతమునఁ దివిఁ జనె నపారబలుండగు తండ్రి, యట్టు ల
త్యంత ధృతిఁ గుమారుఁడును స్వాశ్రితవత్సలుఁ డేగె పోరికిఁ. 56

బాహుదీనుని బల్లాలు పాలి కన్పి,
యార్ష నయవిధి, సూక్ష్మార్థ మరసికొనక,
పగరకొలికె రణాన, శలభముగ బడిన
పృథ్వి రాజునుబోలి, జంబుకుఁడు, గుంత
లాధిపుండు, మహోత్కంఠ నాజి కుఱికె. 57

తన పెనుసేన, వీరవరతండము, వెంబడి నండగాగ, దాఁ
కెను బడబాగ్ని చందమయి, కీలలగ్రక్కు దృగుత్కరంబుతో

జెనకుచు, గుంతలేశుఁడు నసిన్ ద్వారఁ దూయుచు, శత్రుసేన, య
క్కున నిరుపాయులై తెగియు ఘూర్ణిలు నర్ణవమై యెదుర్కొనన్.

కాల ఘనాఘనావళుల గర్భము జీల్చుచు బైకిఁదోఁచు స
ద్వేల తటిత్ప్రతానమన దేలుచు ద్రుళ్ళుచు నానెగొంది రా
జేలికగాఁగలట్టి భటు లేచి పతాను పటాలముల్, మహా
భీలత నింక బైకొని రభీక్ష్ణ పరాక్రమ దుర్నిరీక్ష్యులై. 59

తరఁగల పోయులై, చెదరదన్ని యదాటుస దూఁటిపోవు ని
ర్ఝరిణిఁ బోలుచున్, యవన రాడ్భట వార్ధిఁ దిరోహితంబుగా
విరిసిన సేనతో, విపుల వీరవిహారము సల్పి, రాజు, భా
స్కరు దరిజేరె ; యావనసిశాచరవాహిని ముంచె గంపిలిన్. 60

కంప్లీ కుంతల సుయశ
స్సంప్లావిత చరమ భూపచంద్రుఁడు సఘుతాఁ
పాంప్లవ మతఁడున్ మునుఁగఁగ
గంప్లీ భాగ్యరమ మఱపు కాటిని జేరెన్. 61

ఆనెగొందియు గంప్లియు ననుఁగు విడుదు
లగుచు వెలసిన కుంతల గగన హంస,
రాజును జయించి, యార్యుర బ్రిముఖుల గొని
యవనసేనాని తుఘ్లఖు నరయఁ బంపె. 62

అటుపయి, ముందుసాగి, విభు నల్లుని జేర్చివ హొయ్సలాఖ్యు నా
కుటిలుని గూల్చివ త్తమన, గొబ్బున ద్వారసముద్రమున్ జయిం
చుటకును, దారిబట్టి రరిశూరులు ; బల్లలుఁ డంతలోనె గ్రుం
తక్కుట భయమంది కాన్కలిడి గ్రక్కున, దోలెను బాహుదీనునిన్
కటువగు తొంటిదాడికె వికారత గ్రమ్మిన పట్ణమెన్నుచున్. 63

కూళ బాహాదుర్ దొఱంగి బల్లాలరాయం
డులికి శరణొంద, సేనాని యుద్ధముడిగి
ద్వారసంద్రము ముట్టడి బాసి, వాసి
గనుచు నూడిదలెత్తించి వెనుక కేగె. 64

కంప్లి సర్దారు లార్వుర గట్టి బాహా
దీరును, బేడీలతో జుట్టి దేవగిరికి
ఘనుడు సేనాని సుల్తానుకడకు బంపె
తుఘ్లఖుడు సుంత, శాంతించి దురము నిల్పె. 65

మల్లికునాయబు బిల్చియు
నుల్లాసముతోడ దక్షిణోర్వికి జని నీ
వెల్లెడ జందద్రిధ్వజమును
జెల్లింపుము ప్రతినిధిగను స్థిరతన్ బ్రభుతన్. 66

తనకును నచ్చినట్లు, సులతా నిటు లానతి నిచ్చి యార్వురన్
గాని చెరసాల నుంపుడని కుత్సితు నల్లుని జంపబంపి, తె
చ్చిన మణి హేమ మౌక్తిక విశిష్టధనంబులు గోశశాలలో
బెనగొన జేర్పబంచి, తను, విఖ్యజనంబులు వెన్నడింపంగన్. 67

ఢిల్లీచేరియు, చైనా
కల్లోలములోన నున్న గతి విని, జయసం
వేల్లితుడు, తుఘ్లఖుండు, స
ముల్లాసముతోడ, దాడి నొగ్గదలంచెన్. 68

కాని యదియు ససాధ్యమౌ కర్జమగుట
మంచుగుబ్బలి బలి, ముసల్మానులైరి ;
సోమదేవుడు సరిహద్దు సోకకుండ

డిల్లినుండి దేవగిరికి తేర కఖిల
జనుల దఱుమంగ నెందరో చచ్చిపడిరి. 69

గజనీ ముహమ్మదు కరణి గుళ్ళను దోఁచు
జతనంబు లేవేని సలుపబోడు,
బాల్బనుసుల్తాను పగిది, స్వాత్మోత్కృష్ట
చండశాసనవృత్తి కండగాఁడు,
అల్లాయుదీనుని యడుగుజాడల బర
రాజకాంతలపొందు, గోజుగనఁడు
నాజరుద్దీను విజ్ఞానమ్ము మతసహి
ష్ణుత, వివేకము వీడు చొప్పుగూడఁ

డయిన, తుఘ్లఖుఁ డన్ని కార్యములు దానె
సాధనముసేయుపొంటె నే సామరస్య
మును దలంపఁడు, నున్మాదమును వెలార్చి
తోలు నాణెమ్ములన్ బంచి దోఁచె ధనము
క్రౌర్యమునకు బాల్పఱచె నూరకయ బ్రజల. 70

మల్లికునాయబున్ గదలి మానిత కుంతల ముఖ్యసీమలన్
బెల్లునవాబు శాసనము బేర్చుచు నూర్చుచు నొక్కయేడు, ద
రోల్లసితంబు పాలనము రూఢ మొనర్చెనుగాని దేశమం
దెల్లెడలన్ స్వతంత్రగతి యేర్పఱుపన్ బ్రజ తిర్గుబాటులన్
గొల్లగ, శత్రువారముల గూల్చిరి, వేల్చిరి, జీవితమ్ములన్. 71

దీనిని సుల్తానునకున్
ఖూనిక జేయదగు కార్యమున్ మల్లికుఁ డ

న్యూనత దెల్పియు నాతని
యానతికై వేచియుండె, యవనేశ్వరుఁడున్. 72

చెరబెట్టిన యార్వురను, వి
వరముల నడువంగ నడిగి వారికి దనకున్
వరపులుగ, కటద గొల్పియు
కటకు నిబంధనల జుట్టె కరదములొసఁగన్. 73

ఆమెయి నాగ కార్వురమహామతులన్ దనబంట్లుగాగ ని
స్లాము మతంబు జేకొనియె సాగుడు దక్షిణ మంచు, "నల్ల", మి
మ్మోమునటంచు నాజ్ఞనిడి, ముందు మసీదున "సున్ని" సంస్కృతిన్
బ్రామఁగజేసి, క్రొత్తదవు రాజ్యము కోశము నింపుబెంపఁగన్. 74

తగు వెరవుల నుడివియు, దను
ఘగ బంధనము లుడిగించి, ప్రాక్కీర్తిలో "నో
రుగలు" పురిని మీా రున్నతు
లుగ నుంటిరికాన నిప్పు డూర్జితమతులై. 75

కంపిలిలో బ్రతినిధులై
నింపుఁడు కోశంబు, శిస్తు నేర్పుగ గొనుచున్
బంపుఁడు కప్పములను, నా
పంపుల బాటింపుఁడనుచు బంపె నిరువురన్. 76

వారలె హరిహర బుక్కా
ఖ్యారాధ్యులు, విజయనగరి కల్గుంద్రు, గుణో
దారులు, పృథ్వీదారులు,
సారతర పరాక్రమాఢ్య సౌజన్యనిధుల్. 77

ఢిల్లీఁ బీడి, ప్రయాగ డాసి, యచటన్ దేదీప్య గంగానదిన్
తల్లిన్ గొల్చియు, దీర్ఘమాడి యగజాధారున్ శివున్ మ్రొక్కులన్
జెల్లన్ జూడఁగఁగోరి, కాశి జను టాశింపంగ న్యాయంబుగా
దిల్లున్ జేరుద మీా మతాంతరవిధం బేరీతి మాయంగనౌ. 78

మాధవ విద్యారణ్యుల
బోధారవమున్ జెవులబడు పుణ్యంబబ్బున్
బాధలు పడనేల యిటన్
సాధింతము దీక్ష, పంపసవిధమునందే. 79

అని యెద నెన్ని దేవగిరి యధ్వమునన్, బయనంబు జేసి, ముం
దున కరుగంగ నోరుగలు దూరమునన్ గనుపింప, బూర్వపున్
మనుకువ జన్మభూమికయి మానని తీయను బాయలేక, గ్రి
న్నన ననుజుండు, నన్నయు, మనఃపరితాప మహాగ్నిఁ గ్రాగుచున్.

చచ్చిన మాతపై రెదను, సంస్మృతిఁ బొక్కెడి, పిల్లలేమ్ప న
ట్లచ్చపు జింత బేర్చి ; పథినాగ్రమునన్ బడి శీర్ణయౌచు, స
త్స్వచ్ఛ దశాంక లేశమును నూఁదని దాగత భర్తృకన్ బురిన్
బొచ్చెముగూడి చొచ్చి, తనువున్ బిగబట్టుని కూలి రొక్కెడన్. 81

పటుతర శోకకుల్యలను బైవయి బొర్లెడివాని ఱెప్పలన్
గుటగుట నాపియాపి, మఱి, కొంతశమించిన, లేచి, భావసత్
కటువుగ దాఁచి, స్వీయగృహకంతములన్ బగరున్కడూచి, యు
త్కటముగ బెగ్గడిల్లుచు, విధాతృకృతంబుల కంగలార్చుచున్. 82

ఆ స్వయంభూ శివుం డభిషేకముల బ్రీతి
మానెనే ? జంగాల మాటలేదే ?

నిత్యార్చనాయత్త మత్యంత రమ్య కుం
కుమరాశి, పద్మాక్షి కొసరలేదె ?
కేశవ దివ్యాంఘ్రి కీర్తన జొక్కు వై
ష్ణవ గోష్ఠి దవులు సజ్జనత లేదె ?
ప్రథితోర్ణ నాభమ్ము వల బల్లిపొరలన
నేయు మగ్గాలు సంధింపలేదె ?

ఆ మహామాత్యుఁడు ! శివదేవయ్య నడచు
రాజవీధి, మన్నును, గుల్కరాళ్ళు నెనసె !
విశ్వ శ్రుతుల విద్యానాథ కవీశుఁడాడు
నెడములో, తేళ్ళు, సాలీడు లిరవుకొనియె ! 83

నాస్తియే వైదిక నినాద ? మాస్తికులకు
తలలు దాఁచుకోగల ధరాతలమె లేదె ?
యలఘుమతులగు సోమన్న అన్నమయ్య
తిక్కయజ్వయు మెట్టిన, తీర్థమహిని ? 84

అనుచు వాపోయి, యటనట నాగి మరల
ముందునకు నేగువార లాక్రందనముల
బొలము వెల్వడు కాందిశీకులను గలసి
పురమునంతట బరికింప నరిగి యరిగి. 85

రాలును మన్ను ప్రోవయి యురఃక్షత మబ్బినయట్లు దిబ్బగా
వ్రాలెను పూజ్యమైనదిదె రాజనివాసము ! రాచగద్దెయుఁ
నేలను డిందియుండె ! కడునిష్ఠుర మక్కట యంచు నార్చుచుఁ
దాలిమిబాసి మెట్టయెద ధట్టని తట్టిరి చేతులూఁపుచుఁ. 86

హరిహరుఁ డార్తభక్తిని, నృపాంగణభూమిని వ్రాలి, మన్న చే
దోరకిసయంత, బంచె తుదిదూర్చుచు, గంటువేయు స
ద్దరి నొకతళ్కు కంటకొసదారున, గన్పడ, నైదు వ్రేళులన్
దరమిడి, మృత్యునేత్ర, సటదాగిన పచ్చయొకండు చిక్కగన్. 87

పరికించి యదియు, రాజే
శ్వరు సింహాసనము ఛత్రి పార్శ్వమునన్, బొం
పిరి వోవు, కాంతు లెసగియు,
నరుదారిన పదక్షమనుచు నారసి యంతన్. 88

రాజద్రాజ శిరోమణి ప్రభలతో భాసించు నీరాజ సం
భోజన్ ద్వచ్చరణద్వయిన్ విభుత సంయోజింప దీపించి, ని
ర్వ్యాజప్రేమ సుధాశయుల్, వరకవీంద్రాగ్రేసరుల్ పాడ, వి
భ్రాజద్ధీర విహారివై వెలసి రుద్రాధ్యత్యమున్ జూపి, ఘో
రాజిన్ బొల్చిన నీకు నీడెవరు! రుద్రా! శీలభద్రా! ప్రభూ! 89

అంచు ప్రతాపరుద్రు గుణరాజిని దర్పము గౌరవంబు న
గ్గించెడు నన్నిశైఖరి, నోకించుక నాపియు, బచ్చడాచి, 'నీ
కంచిత' చక్రవర్తిపద మబ్బెడు నిక్కవ మాలసింపకన్
కంచె, నరాతి కుంచితము, గ్రక్కున దాటుట లెస్స లెమ్మికన్. 90

అనియు బల్చియు బుక్కరాయండు వేగ
సచట మూఁగెడు జను లేమి యరయకుండ
తురక సర్దారులే యను తెరగు దార్చి
చరణముల నీడ్చుకొనుచు సత్వరమ వెడలి. 91

మఱపునకురాని జనన సీమన్, ప్రియంబు
లైన వాడలు, వాఁగులు, కాననములు

దాటిరట గాచి యార్చిన నీటిఁబోలి
మానసములు, దాఁటిబడి, సమ్మెళములయ్యె. 92

తామయి స్వేచ్ఛఁ బడసిన
పామరులను గూడి, దుడుకుపడక, నిజ
స్థేమాంకములగు ధామము
లామనిలో, నానెగొంది నందుకొని రొగిఁ. 93

కడిది క్లేశంబుచే నొడల్, కాంతి నేద,
పొడుగు గడ్డంబు, వెండ్రుకల్, పొదుపుగూడ
మినుకు గుంతల బోలుచు గనులు దోలుక
సల్లుచేరిన బడుగుల, దగ్గి జూచె. 94

మఱపు దేరని మమతల మదియు దొడువ
రేఁదో, యవ్యక్త వాత్సల్య మీఁప్పుచుండ
కూరుచుండంగ బెట్టియు, నూరకరయు
నమ్మ నమ్మాయనంగ దానంత దెలిసె. 95

పొట్టతీఫున డగ్గరి, పొదివి, కుఱ్ఱ
లార ! బ్రతికివచ్చితిరకొ ! ఆలి తాలి
బొట్టుపుణ్య మగణ్యంబు ! ప్రోచె, గురుఁడు
మాధవుఁడు ; చచ్చిన ట్టిరు మనితి రనుచు
నేడువగ, నాండ్రు జవరాండ్రు గూడిరపుడు. 96

జిహ్వఁన కుత్తుకల్వెఁడలి చిందెడు తల్లులయొల్లు విన్పడఁ
బువ్వలు మెక్కమాని పసిమూఁక కిశోరులు జుట్టు జుట్ట, నా
యవ్వయు, భార్యలుఁ గదిసి యచ్చట బ్రోవగుచో, ముదశ్రువుల్
నెవ్వగ తీరుటల్ తెలుప, నేరుగజారెను కన్నుగొల్కులఁ. 97

రాజేంద్రుఁ డాతండ్రి రామనాథాఖ్య ప్ర
  తాపరాయల మృతి దల్లడిల్లి
జంబుకేశ్వరుఁడన్న స్వర్గంబుఁజొచ్చిన
  దద్దఱి, యరిబాధ దప్పదాఁగి
పతిపీరు లెడబాసి భృతకులై చెరబడ
  బ్రదుకు, నీరముమీఁది వ్రాఁత కుడికి
రాచతీవులు మానరాక గుల్లగు నిల్లు
  వీడక లోలోన గోడు గుడిచి

యార్త చాతక వితతికి నమృతరశ్మి
మాన్య మాధవాచార్యుఁ డుమ్మలిక బాపి
"యన్న దమ్ములు వచ్చి ధర్మైకరాజ్య
మునకు బట్టభద్రులగుదు" రనిన, వీరు
నార్తిజావ రైరని, తల్లి యడలువడియె. 98

దూరదేశాగతులు, పతుల్, వేళవేళ
నందర ననునయించుచు, గుందుదీర,
పైకి నెగబ్రాకు పిల్లల బట్టియెత్తి
బుగ్గలంటుచు, నిల్చిరి, తొల్తులకడ. 99

చుట్టుప ట్లమ్మలక్కలు, జుట్టునంత
కొక్కెమొగి, దుపానును నిల్వ, జిక్కెబెడలి
కోలమది యొద్దుజేర, నుద్వేల మాన
భావ శాంతిని, నిశ్శబ్ద వార్థి, వరలు
చందమును, వార లొరసిరి, డెందములను. 100

తడయకర్ వేగ జేతికి బడఁతు లిచ్చు
నంబు కలశంబు లంబరా లంది యొడలు
గడిగి, బోనంబు, జననియు గుడువుఁ డనిన
మొనరి, రాజ్యాపు టల్లుండ్రు దనిసిరప్పుడు. 101

భోజన మాచరించి తగవుర్ నగవుర్ విలసిల్ల, వీడ్యముల్
తోఁజుగ బిడ్డలిందమన దోయిలి యొగ్గుచు బేరమాడుచుర్
వాజవ నెఱ్ఱకాంతుల నివాళు లెసంగెడిదాక, ద్రచ్చుచుర్
రాజులు .నన్నదమ్ములు విరాజిలి రాదినమంత యిమ్ముగన్. 102

మరునటిరోజు నిత్యవిధి మానక వే వఱువాత లేచి య
క్కఱగలవార లెల్లరకు గ్రక్కున వార్తలదెల్పి యానతుల్
దఱకునటుల్ వెసర్ జనవితానములర్ దఱిగొల్పి, వీధులర్
పఱగడలందు దప్పెటల, బారికె గుంపుల జాట బంపినర్. 103

వారనితమి, లోకులు, నో
రార, సభావ్హా వివరంబు లన్నియు విని యా
మేరర్, దెలియు కుతూహల
మూర, మహోత్కంఠ వేచి యూరూరులలో. 104

పల్లెల బట్టణంబులను బారులు బారులు దీరి పాలనం
బల్ల నృపాలు నల్లురకు నవ్యథమై కదిసెర్ ముసల్మనుల్
డిల్లికి బోదు రిప్పటి కడింది యుపద్రవమాగె కాలప్పుర్
వెల్లియు, జాడజొచ్చెనని, వేడుకగూడిరి, కంప్పి బీడునర్. 105

హరిహరుఁడును, ముస్నె, నవా
బిరవుగ దను బిల్చి చేతికిచ్చి  లేఖర్

బరువడి 'మల్లికు' నాయబు
కరముల నిడి, సన్నదుర్గ జోకాటము, సూపగ. 106

ఉచితములగు గౌరవముల
రచియించియు, సాగనంప, రంజిలి 'మల్లిక్'
ప్రచురములగు, ధనరాసుల
కచితముగ బ్రభుని జేర్ప గైకొని యేగ. 107

కంపిలిని, మహాసభలో
నింపుగ గ్రామాధికృతులు, నిష్ఠులు వృద్ధుల్
పెంపుగను, బాళెగాండ్రు, ని
లింపులవలె గుమిగనైరి, లియ్యాయ తెసగగ. 108

ఓం తత్ సత్

శ్రీరస్తు

# పంపా భారతము — సభాపర్వము

## తృతీయ ఖండము

### హరిహరాదుల అభ్యుదయము
### విద్యారణ్యుల చే విద్యానగర నిర్మాణము

---

నాంది:-

రేపును మాపును, నే దే
వీపాదంబులను గొల్చి విశ్వామిత్రుం
డేపున రాముని కీర్తికి
బ్రాపయ్యె; బలాఖ్యశక్తి పాలించు మమున్.
విని సుల్తానుని, శ్రీముఖ
మును, జనులొక్కటిగ జర్చ మొనసిరి, పిదపన్
ఘనుఁడగు బళ్ళారి విభుం
డును, సభపక్షంబు నూని, తూర్ణ మిటులనెన్. 1

ఆ ముసల్మానుల యాజ్ఞలోబడి రాజ్య
పాలన సల్పఁగజాలు టొకటి
స్వాతంత్ర్యదీప్తి భృశంబు బెంప స్వారాజ్య
గతి, ప్రీతి మోపున గాంచు టొకటి
స్వమతీయ వైదికాచార సంపన్నత
నెరవడి సువ్యాప్తి బలుపు టొకటి
వీరోచిత పథాన విక్రమ మైకమ
త్యముల సామ్రాజ్యంబు దార్చు టొకటి

వీనిలో నేది ప్రజలకు విహితమగునో
నిర్ధరించుట కర్జంబు ! దుర్ధరోగ్ర
రిపు మత్తాట్టహాసంబు, భూమిపుల గలఁచె
నూఁచముట్టుగ వారలు నూఁకలైరి. 2

రాజులు నేల ? దాస్యమున గ్రాగుచు నెప్పుడు ఢిల్లిరొంపియే
తోఁజని లాభసాటి తఱిఁ దూఁచు తరాజులు ! తుఘ్లఖాజ్ఞలన్
గోజుగ మోయు వాజులు ! నకుంఠితశౌర్యము, వంశగౌరవం
బోజ దలంపలేని కడుమొప్పెల కూళరివాజు లియ్యెడన్. 3

మనకున్ దైవసముండు ! యోగిగణ సమ్మాన్యుండు ! దండంబు జే
కొని, పంపాపతి యాజ్ఞలో నడువుఁ డేకొంచంబో, భోగంబు చా
లనిశంబున్, బరతంత్రభావనల, మీ రధ్యాస్న మైపోకుఁ డా
త్మ నియోజింపుఁడు, ధీరమార్గమని, విద్యారణ్యుఁడున్ బల్కఁడే? 4

ఆచంద్రార్కము గాగ నిచ్చెను, శుభవ్యాసంగు బంపాపతిన్
ప్రాచీనంబగు కాలమందు, ఋజుచర్యన్, శ్రీ హరిశ్చంద్ర రా
జే, చిత్తంబున హత్తు భక్తిమెయి, నర్చింపంగ దా వచ్చి, యీ
భూచక్రంబున, దక్షిణాపథము ; దత్పూజోపయోగార్థమై !
మీ చేవల్ దగుచేతలన్ దొరయ నిర్మింపుండు స్వాతంత్ర్యమున్. 5

మాసిత విద్యారణ్యుల
యానతియు సమంజసంబు, నారయుఁ డీరల్
కానుక లిడ నతఁ డర్థ మ
నూనము వెచ్చించి, పెంచె నూతనసేనల్. 6

అద్యతనంబున, మన కన
వద్యంబు, మహర్షియాజ్ఞ ! వర్తిలవలదే ?

విద్యారణ్యు చరణముల్
సద్యఃపాపౌఘహరణ చణములు గావే? 7

అనుచుఁ గర్జిలు నాయకోక్తుల మనం బానందముం బొంది, "వె
న్కొని రండీరలు నెల్లరుం గలసి యన్యోన్యంబు నైక్యంబు సా
ధనకుం వచ్చు తెఱంగు యోగివరు చెంతం జేరిక న్గొందు" మం
చునె, యెల్లెత్తియు హక్కరాయలనఁగం జోద్యంబునం సభ్యులుం.

"ఔ" నని రదివిని! పర్జల
న్యానంబుగ నేకభావ మూహించిరి; భూ
జానులు, భ్రాతలు, యతిమణి
యానతికిం, శీర్షము మొగ్గి రాయత్తమతిం. 9

మాధవుఁడే యేడుగడయు
మాధవసఖుడైన శివుఁడే మనదైవం బా
మాధవ విద్యారణ్యుఁడె
సాధించుం రాజ్యపదము, స్వారాజ్యంబుం. 10

ఆఱవ ఘస్ర మక్షతదియాఖ్యఁనునాడు సభాముఖంబునం
దీరుపునొందు నందియ ముదీర్ణ విచార పురస్సరంబుగం
నేరుగవోయి సద్గురు మనీష శరణ్యము జొచ్చివత్తమిం
కూరక నేల చర్చలని యుండిరి రాజులు పారిషద్యులుం. 11

కాలము, దేశము, ప్రస్తుత,
మాలం బిసుమంతలేక యరయుచు, హితకా
ర్యాలంబనంబు, గొనుటయె
యాలుడియని, హక్కదుం గృహాభిముఖుండై. 12

ఆరని వేరమిఁ బురకలంగర దొందరపెట్టి ; స్వీయ మా
చారము నంటఁబాపి, యవిచారత, నన్యమతంబు లాఁజడిఁ
దూఱుల బాలుజేసి యని తోరపు బుణ్యము గాగ నెంతు రె
వ్వారలు, దేవుఁడొక్కఁ డను భావము నేరరు వేఱుపేరులన్. 13

జలమును, బానియు దణ్ణియు
దెలుపును నీరముల నల్లె దేవవిలాసా
కలితములు, బవిత్రాహ్వయ
ములు, వానిఫలమ్ము లోలి మొనయు నొకటిగాన్. 14

నామస్మరతియె, ధ్యానము
నామంబె లోకమున, జనవ్యవహారో
ద్దాను విభూతికి దావల
మేమని వేఱుగ గణింతు రిరులన్ బడుచున్. 15

దసరా మహోత్సవ దశరాత్రిపూజలు
బీర్గపండుగలోని వీరనాట్య
మల్లాయనుచు నిల్గినలయుటయును, హారి
వాసరంబుల నుపవాస మునికి
రంజానునెల ధనుర్మాసమ్ము నుభయుల
ప్రత్యూష పూర్వముల్ పారణములు
శుక్రవారముల శ్రీసూక్త విధానముల్
ప్రత్యేకము సమాజు పద్ధతులును
రెండుమతముల సమధర్మరీతి వెలసె,
పోరులును వేరములు లేక పౌరులందు

నన్నదమ్ములవలె నేల నణగిమణగి
యొండొరుల కుపకారులై యుండరాదొ ? 16

అల హలాల్ చేసి పలలంబు నారగించు
టదియు, వేలిమిఁ బశువునే యాహరించు
చొప్పు నొకటె కాదె ? కలి నశుద్ధమనుచు
నార్యు లాపిరి బుద్ధాజ్ఞ యజ్ఞములను ! 17

అల సూఫీలును భక్తితత్పరత, మాంసాహారము ల్మాని, ని
శ్చలతఁ సర్వజగద్ధితప్రవరు, విశ్వాకారునిఁ జేతనా
ఖిలవర్తిష్ణు విహారసారుని, బరుఁ గీలించి చేతస్సులఁ
దలపోయఁ నిజజీవితంబుల గడుఁ ధన్యాత్ములై క్రాలరే ? 18

దారులోహాశ్మ చిహ్నంబు లేరికైన
గలవుకావె ? శిలామసీదులను వాంఛ
శిష్టపూజానుఘుష్ట మూర్త్యేష్ట మరయ
సమమ ! చిత్తహస్తిని బట్ట, సాధనమగు
వదియె ! జెండాలు, బ్రతిమలవలెనె కాదె ? 19

కాబా, వేంకట గిరులం
దే బాలిశులైనగాని, యొగ్గు పనులలో
దూబలునై వర్తింతురె
ప్రాఁబల్కు, ఖొరాను, దైవవాక్కులె కావే ? 20

బయలే యాలయ మర్కుఁడుఁ శశియు దీపంబుల్, మహౌదార్యఘుఁ
దయయే యర్చన, సత్యమే తపము, నుద్యద్భక్తియే యూర్జితం
బయి, సత్స్ఫురణానుయోగ మమృతంబై యొప్ప నొప్పారు, ని
ర్భయులౌ జ్ఞానులుగాని, తక్కొరులు, దైవస్ఫూర్తులఁ గాంతురే?

అని తనలో దర్కించుచు,
ననఘుండును, దనకుగూర్చు నాశ్రవుఁడగు, సా
యనను, గృహస్థు, బురోహితు
ననుకూలత బలము జేఫు, నాలంబముగా. 22

డెందమున విచారించియు,
ముందర దన తల్లిగొద్ద, మూదలనేయక్
బొందిః యానని స్వగృహా
ళిందంబును జొచ్చి కృతి ఫలించెడు సరవిక్. 23

అమ్మకు గలరూఫును, దా
నిమ్మగ యోజించు చాలు, నీలువు, దెలుపక్
సమ్మత మర్షుల కెదియో
ముమ్మర మదికాదు, వీధ్ర మున్నగు ననియెక్. 24

నీవ్రిము నీడనుండి, కడు నేర్పున దల్లికి నన్న చెప్పచో
నావ్రజ కానుజుక్, సునఖవర్గము నోర్మికబోళ్ళచు సాయనుక్,
దీవ్రిత దెత్తు నేనని పదింబదిగా నను, బుక్కరాయఁ డా
పై, వ్రజనంబుజేసి, కొనివచ్చెను వెన్కనె విప్రముఖ్యునిక్. 25

వర పంపనుండి, వచ్చిన
హరుఁడీవని, వాకిట నెదురరిగి, యనుజులుక్
హరిహరుఁడు, నతని కెరగిరి
నురపలు, శిరములును, నేల నురళింపంగక్. 26

"శుభమస్తు"ని, సాయనుఁడుక్
రభసమునక్, వారినరసి, ప్రిమనుండగుచుక్

విభుఁడిదు, మణికుట్టిమ, స
న్నిభ మూర్ణాస్తరముపైన, నిహితుండయ్యెన్. 27

అనువదిలేక, బందిగొన, నాపదలోఁబడి, ఢిల్లీఁజేరి, రా
జును, దము బిల్చునంతకు, నిజాయతిఁ బేర్చుచు, దప్పు లేమియున్
బెనఁకువ జూపుచున్, రిపులు బెల్లుగ దన్ను గారవింపగా
దనరియు, నెప్పుడున్ విమత తత్త్వము, సత్త్వము, గోపనీయమై
యొనర, నటించి, యాయికపు యోక్త్రములున్ విడునట్లుగొల్చుటల్

స్వాంతమునొవ్వ హక్క డనుజన్ము నిగూఢి వచించి, వెండియున్ .
కుంతల దేశ మంతట నకుంఠిత శౌర్యవిదగ్ధులై, ప్రజల్
సుంతయు భీతిలేక తమచూడ్కులు మాధవు నంఘ్రిలందె, యా
శాంతములున్ దదాజ్ఞలను సాంగము సేయుటయందె నిల్పి, య
త్యంతము దిగ్గు బాట్ల సులతాను దపింపఁగ, బన్ను మానుటల్. 29

మల్లికునాయబు, లేఖల
ఢిల్లీఁ గలవరపడి, తన్ని దేష్ట, తుషులఖుం
డుల్లము, చెడియుండుటయును,
మొల్లము, దమపుణ్యాలతయు, మొగదొడ్డుటయున్. 30

అడుసున దిగబడి యెడదీయరాకుండి,
యెటులో పైకెత్తిన యేతమనఁగ
చెలువెండి, తూముమన్నరలి, పూడియు, వాన
కాలువ, తెఱచిన గండియనఁగ
పెనుమబ్బు లొకతట్టు వేలిలగా, ధ్రువతార
చాటునెల్లున, గాలి చాటయనఁగ

ప్రియమేటిసుళ్ళలో బడకుండ బూర్వాబ్ధి
నొడ్డుకు దాఁటిన యుషుపమనఁగ

సుంత యవనేశుకృప, తమ్ము వింతగొల్ప,
కొనకు సుల్తాను తలఁపులు, గూటువగొని
వరవుడుచు మాన్పి, పరమతం బారయఁజేసి
ప్రతినిధులుగ, దమున్, వెన్క, బంపుటయును. 31

సాంతముగ దెల్ప, సాయనుం డంత వినియు
నదరు, బెదరును, దొందర, నదరు లేక
"యింతకథను విద్యారణ్యుఁ డెఱిగియుండె
నరసి వేచియెయుండె త్వదాగమనము". 32

అనుచున్ నుడివియు, వారల
"ననితర భావముల వచ్చి, యన్యమత మలం
బును దొలఁగంగ, భవిష్య
త్తున కనుకూలించు దీక్ష దొరయుం"డనియెన్. 33

విని, వారలు, "సిరి మొగకొ
ట్టెను, గురుదేవుని కృపయు ఘటిల్లు" నటంచున్
సనయంబుగ, వినయంబున
మునుకొను ననుజులను వేదమోదియు దనిపెన్. 34

"కన్న కడుపాంద్రు నలరగ
మున్నుగ నేర్పాటుజేతు మొగకొని మీరల్
చెన్నుగ దదియున్ రండా
సన్నము జనసభయు గూడు సప్తమి యందున్". 35

అని వేగ నచ్చ జెప్పియు
మునితమ్ముఁడు, మంచితలపు మూస, యనఁగ, వీ
డ్కొని, రాజులు, బయటికి, దక
వెనుకొన, నిల్వుఁడని పల్కి, వెడలె మునీతుఁడై. 36

అక్షతదియనా డిర్వురు
నీక్షించిరి గురువు, నాత్మహితు, నాతనిచే
నక్షీణ దీక్షగొనిరట
నక్షయ సంపాతటాన, నమరింప సిరుల్. 37

వచ్చిన భాగ్రితల దేశికుఁ
డొచ్చెము లేకుండ నరసె, సత్తమతీర్థం
బచ్చపు బాగ్రిమిసుకుల నుడు
లుచ్చంబుగ, దోసఁగుగడిగి, యుతకముదీర్పన్. 38

మానిత మఘమర్షణ సు
స్నానము, వృజినాపహంబు, నవభారత వి
జ్ఞానము సంధింపఁగ, వా
గూనిరి, వైదికపథంబు నురవుగ మరలన్. 39

ఋజువర్తనమె, విప్రహితమని ఋషులు, వం
శములేని బాలుని, విమలుజేసి
రార్యులు కాని, యన్యాన్వయులను, భక్త
లుగనె, రామానుజుం డిగురజేసె
నఘమర్షణ స్నానమని, మాధవుఁడు, మతాం
తరుల బవిత్రత నొరయజేసె,

రామదాస సమర్థుఁ డోమి, రామజపంబుఁ
దార్చి, యున్నతికి సాధనముజేసె,
అనలవిధి, నితరమతీయు లందినంత
హైందవత నొంది రల, దయానందువలన ;
భవమెదియొ ? హరంబేల ? వలయునెడల
విహిత మొకదీక్ష మతమిచ్చి, వృద్ధినెఱపు ! 40

ఎనుబదివేలయేండ్లు చనియెఁ, హిమపాతయుగంబునుండె, స
న్మునులును వేదవాగ్రచనముఁ గొని, రప్పటి దేశవర్ణనల్
మొనరగ వైదికార్యయుగముఁ, దగురీతి నిరూపణంబు, నం
దెను, నిగమోక్తి, ఋక్కుఋషణశితిఁ దనరెఁ, బ్రణవాదిమంత్రముల్
వినుతికి దెచ్చె బ్రాజదువు, వేఱుమతంబులులేని యయ్యెడఁ. 41

గుట్టలు, చెట్లు చేమలు, నిగూఢ నిసర్గ మహద్విభూతులఁ
దొట్టినవెల్ల దృశ్యములు, దుర్లభ దైవికశక్తు, లనూహ్యఘట్టముల్
పుట్టువు జావులుఁ దడవబోలని దుర్గమ, విశ్వమూలముఁ
నెట్టన, నాత్మరూపగణనీయములే యని, బ్రోయు, వేదముల్. 42

నిఖిలాక్షరములు మనువులె
యఖిలురు చేతనులు, దేవు నవతారములే !
ప్రఖరము నిగమాంతము, త
చ్ఛిఖరిఁ మీరిన మతాద్రి, చెలఁగునె, ధరణిఁ ? 43

అల నహింసయె, యుత్తమంబైన విధిగ,
సత్తరమగు నాత్మజ్యోతి సాక్షిగాగ,
నొప్పు నుపనిషద్ధితమె, సర్వోత్తమంబు
సకలమతముల కాది విశ్రాంతివేది. 44

హరిహర బుక్కరాయ లిం భ్రాతృసనీతత, నంది, మీఁది కే
తెరగని యోగిసత్తము పవిత్రగుణోత్తము, బృచ్ఛఁజేసి, స
త్వరముగ నుత్తరంబిడగ, భక్తి గృతాంజలి నెత్తి వేడ, వి
స్తరముగ నాతఁడుఁ బ్రజల దస్పువిధానము, నిట్లు వాకొనెఁ. 45

పంపాపతియె, సార్వభౌముండు, దక్షిణా
పథముర్వరకు నెల్ల, వార్ధివరకు
హితమతుప్రభాతి లేవురు, రాజ్యంబు
లను గెల్చి, తత్ప్రభుతను వహించి
హరిహరు నగ్రజు ననలాక్షు ప్రీతిసధి
గా, విధేయత గొల్చి, కావవలయు
వివిధప్రజల నాత్మవిజ్ఞత, బాధ్యతల్,
సుఖజీవికలు గూడు సొబగుతోడ

నహితుల, మునల్మనుబలాల, నడచి తోలి,
కుంతలంబాది భారతంబంత నేలి,
యేమతంబున, ద్వేషంబు బ్రామకుండ
శాంతి నెలకొల్పుటమె, లక్ష్యమింతె! కనుఁడు. 46

పౌర ప్రతినిధి సభయుఁ
జేరి యిదే నిశ్చయించు, జెన్నుగ మీరుఁ
వారక వర్షము లోపల
బూరింపుఁడు నెల్లలెల్ల బూర్ణస్థిరతఁ. 47

ధాతయు వచ్చినంతనె విధాత్మనుజ్ఞయు జెల్లినట్లు మీ
రాతత రాజ్యకర్తలయి, యన్వహముఁ బనిగొండు, భాగ్యసం

ధాత, యుమాసమన్వితుఁడు, తప్పకఁ దోడగు మీకు, ధర్మసం
ప్రీతి యొసంగుదాఁక నని, పేర్మి, గురూత్తముఁ డానతిచ్చినన్. 48

విని చిత్తమ్మని యనుజులు
మనుకువులకు దరలిరంత, మహిమోత్తరుఁ డా
ముని, విద్యారణ్యుండును,
తన పొలమును బండుతఱియు డగ్గఱియె ననెన్. 49

సాయనుఁ డది విని, మూలా
ర్థాయుతు నగ్రజునిఁగొల్చి నాపయి, నుచ్చ
స్థాయిని ధర్మము మేకొను
న్యాయంబుల ననుజగణము నతఁ డుసికొల్పెన్. 50

శాలివాహన సుశక వర్షములు బదియు
రెండునూర్లేబదియు నేడు నిండు యువను
భువనదేశికుఁడైన మాధవమునీంద్రు
పనుపున స్వతంత్రి దక్షిణాపథము నిగిడె. 51

హరిహరుఁడు జుట్టుపట్టుల
స్థిరతరబల ఘుష్టినెసఁగ, బేర్చియు, జౌరో
త్కరములె సేనలుగా జయ
సరములు గట్టించె దనకు స్వామ్యము దక్కన్. 52

హరిహరుఁడు, కంపభూపతి,
నర సమవిక్రముఁడు, బుక్కనాయక మణియున్
పరశీలాంకితుఁడగు, మా
రరసున్, ముద్దపయనంగ నలరి రనుజులున్. 53

ధీవరుఁడగు సంగమునకు
నేవురు వీరాత్మజాతు లిభశతబలురై
పావన రాజ్యస్వారసి
కావాప్తికి, రచనజేసి రవగతి యుతులై. 54

అన్నపిల్పులకెల్ల హాజరౌచునె బుక్క-
వరుఁడు దిర్పతిదాఁక నిరవుగొనియె,
సాయను తోడంది సాగి కంపనరేంద్రుఁ
డుదయగిర్యంతంబు నూఁతగొనియె
మైసూరు నారగ మలెరాష్ట్రమంతయు
మారరసు జయింప, మట్టుకొనియె
మొలవాయిసీమ తెక్కలినాడు, ముద్దప
ధవుఁడు గెల్వఁగ గీర్తి తారుకొనియె

గోవ నిర్జించె మాధవగురుఁడు ; రాష్ట్ర
సైన్యము, గదంబ వనవాసి చంద్రగుత్తు
లవఘళింప హొయ్సలుల రాజ్యంబు చేరె
నంత నెక్కించి రట వరాహధ్వజంబు
నైదుఖండా లమరె, హరిహరునిక్రింద. 55

తానూరముల ద్రవ్వి తరగలలేపు పొం
గులు, ముత్తెముల నెత్తుకొనగ బిల్వ
నరబీహయంబుల నర్పింతుమోడల
నని పేరెలుంగుల నలలుదూఁక
నమృత హాలహాలాల హావణింతు మీచక్క-
నని భోరుల నిలంబు లాలపింప

పగడాల దీవుల పసిడిగడ్డలిటంచు
తాపి జూపుచు సముద్ర డాపలింప
శీకరాసారకిరుడు రత్నాకరుండు
పశ్చిమమున గోకర్ణేశు ఫాలనేత్రు
దర్శనార్థమై యొడ్డుల దాటి మార
రసునకున్ రత్నముల గానుకలొసంగి ప్రీతి
హరిహరుడు భక్తి నవ్వాని యతికి నిచ్చె. 56

అరరే ! హక్కుడు, పూర్వపశ్చిమ సముద్రాధీశుడై, యుగ్రసం
గర యజ్ఞాంతమునన్, సుభోజ్యమయి సౌభాగ్యంబైన సామ్రాజ్యమున్
సిరి, దివ్యంబు హవిస్సు నింద్రుడై పాలించెన్ ; మహేష్వాసు నా
హరునిన్ జక్కకిదెచ్చు సిద్ధిభుజ, విద్యారణ్యయోగీంద్రుడం
చురవా గీతము లాలపించిరి కవుల్, శ్రోతల్ముదంబందగన్. 57

సురుచిరశీలురాచు స్పృహనొదరు నిట్లు రహించుచుండ, నా
హరిహరు డొక్కనాడు తన యుద్ధుల వాలు దాల్చి, యుయ్యపా
వరుడు నభస్థలంబున నవాంశు కదంబము జొన్పుమున్నె, దు
ర్ధర మృగయావినోదరతి గార్కొని యొంటిగనేగె, కొండలో
చరియదెసన్, మతంగగిరిచాయను జిట్టడవిన్ జరింపగన్. 58

అప్పటికే జనుల్ నిలువరయ్యెడ, గీములు నేమి లేవు, స
ల్లుప్పలు, జిన్నతిప్పలును, దోరము లచ్చటలేచి, తేళ్ళుల్లన్
గుప్పున గంతులేయుచు దగుల్గొనుచున్ వలలన్ బడన్, గొసన్
గుప్పిట బట్ట వేటరులు గూర్చొని నాతుల కన్గొనుచున్. 59

తన వేటకుక్కయును, దా
నును నొక గుట్టకడనిల్చి, నుసతొలగన్, బెం

టిని రాయు నొక వృకంబును
గని విల్లంది శరమేయగా గదురు నెదన్. 60

వృకములజాడ బొంచి కడువేగమ పట్టెను నుచ్చుమల్లి యా
నికటవిహారి, యొక్కటి ; కనీనికలున్ సుదురున్ బ్రయోగమం
దొక ఫణితిన్ గుఱిన్ దడవ నొయ్యన నేసె శరం బిలేశుఁడున్
వికలతలేక నష్టా పులి వెంపరలాడుచు దూఁకె రాజుపై. 61

ఆసమయంబునం దచటి కాగతుఁ డాతనితమ్ముఁ డుగ్రుఁడై
దూసి కటారి యాచిఱుత దొమ్మకునెక్కిడి వ్రచ్చె, నార్భటిన్
బాసెను జీవ మయ్యదియు, ఒజ్జనె యిర్వురు నాగి చూచుచో
మోసమువచ్చెనంచు వృకముల్ నెలవు ల్విడద్రొక్కి పాఱగన్. 62

కనిన చెన్నంగినక్కలు, కలఁగియేగె
బొచ్చుతోకల నఱదులు, బెచ్చు తొలఁగె
నుడుములును ముంగిసలును, దిశ లొరసిపోయె
శశకతండంబు బిర్వుల సారె పాఱె. 63

కుమ్మరములు, గుండెళ్ళన్
గర్కశముగ జూచుచున్, ముఖమ్ముల నుచ్చి
శ్వర్కుమచిన్ వెలుగ, నిలన్
మూర్కొనుచున్ వెంటనుఱికె భౌవ్భౌవ్వనుచున్. 64

ఆతురమున దూఁకు జెవుల
పోతులు నొక్క పొదరెంటి మూలకొఱుగఁగన్
బ్రాతిగ మొఱుగుచు, శ్వానము
లాతల ముట్టంగలేక, నాశంకించెన్. 65

కుందే ళ్ళింశోకమూలకు
సందియమ్మున్ గుందులేక చల్లగ జారెన్
మందమతుల బోలుచు, నే
చందమొ, కుక్కలునుజూపె సాధ్వసఫక్కిన్. 66

అన్నయు దమ్ముఁ డిట్టి భవకావలి చేతకు ఱిచ్చవోవుచున్
గన్న విశేషమున్ దడయకన్ గురుఁడున్ వినదెల్పినన్ మహా
భ్యున్నతి కద్గితానమగు, బూని శశంబులువోలె, పౌరులున్
దిన్నగ నిర్భయాత్ములయి, తీరిక గొల్వఁగ నూఁతతోచు, సం
పన్నత నుండువారలట, పట్టణమున్ సిసలెక్కి తూఁగెడున్. 67

అది సుశకున దృశ్యం బిఁక
ముదమారగ గట్టుఁడీరు ముంగల సగముల్
పొదువగ దుర్భేద్యంబయి
గోదలు వలయుచోట్ల కోటబురుజులు పెరుగన్. 68

అను విద్యారణ్య మునీం
ద్రు నుడువులున్ దలకు నెక్క, రూఢంబగు, వి
న్ననువున్ వాస్తుజ్ఞానుల
యనుకూల స్థలవిచారణాదిక మమరన్. 69

మహానాడుగా నొప్పి, మహనీయవాసమై
మహితమా పురము, నిర్మాణమొనర
నహిత సూదనులైన యారాజపుత్రులు
యతినాథు నాజ్ఞ ఘంటారవంబు
గుర్తుగానైన ముహూర్తంబునన్ శంకు
విడు మోజనన్ శ్రద్ధ నడరియుండ

మూషికముగని, నిర్మూలింప మార్జార
మాలయంబున గంట గూలదన్న
నా మాఱు నోఁతయే యదననుచు బునాది
వై చినతర్వాత లేచె యమియు
"దేవియానతి కాద నిర్దిష్టమిదియు
కర్మకతన, బిల్లియు నొక కారణముగ
నీ ముహూర్తము బూర్ణాయు వెనయ"దనుచు
ముని, యనిర్వేదమున, విధి ముదల యట్టి
దనుచు, నక్కజంపడియు దా గినియకుండె. 70

విద్యానగరమనగ, నన
వద్య ప్రాకార దుర్గ వప్రాంచితమై
హృద్యంబగురీతిని, సం
పద్యానము, పట్టణంబు, వర్ధిల దొడఁగెన్. 71

అరిభీకరమై, ధనికా
కరమై, బహుకాందిశీక కరుణాశ్రయ వి
స్తరమై, యనేక రథ్యో
దరమై, విద్యాపురంబు త్వరగన్ బెరిగెన్. 72

నగములు మూటిని జుట్టన్
దగవై, కోటయును దీర్ఘతరమై, జాగై
ముగియదు, పురదుర్గాకృతి
సగమై ద్రాఘిష్ఠకాలసరణి సరించెన్. 73

నునలగలేదు నిర్మితియు, నూతన, మొక్కవిధంబకాదు, తా
రసిలుచు నచ్చటచ్చట విరాజిలు రక్షకకూట పంక్తు లిం

పెనఁగగ సేహాసర్పణము బేర్చెను నొక్కెడ, ఎండ్లకట్టగన్
దుసికులు పేనతెల్లరకు దూర్ణము ద్రవ్యసహాయ మేర్పడెన్. 74

మితిమీరు నెండ తెమ్మెరల చెమ్మట లూడ్చి
గ్రామికుల్ ధనిక వేశ్మముల గట్టి,
రాసైన వర్షాల నాఁగా కుల్యలు
సరిమళ్ళబడి కృషీవలుల దన్పె,
కూలీలు, నాయకాంగ్రోలి, భృతుల్గూర్చి
నిర్విరించ్లను, శరన్నిశలయందు,
సీతుగాడ్పులుమాయ, శిశిరంబు పరిచేర
గొఱలి నిశాంతముల్ తెఱుచు బెంచి

రిట్టు లాఱుకోసులదవ్వ నెట్టుకొన్న
నగరముఁ బదినెలల లోనన్, గ్రీమంబు
గాగ, నెదిగె ముక్కాలుభాగంబు ; నెడము
తెన్ని తావులలా శేషించె ; నింతలోన. 75

ధర్షములేనిత్రోవ, వివధంబుల డించు వితర్దు లేర్పడన్
వర్షము జుట్టుజుట్టె, బుధవర్గము హర్షముదొట్టె, సాధువా
గ్ఘర్షములన్ వివేచనప్రగంగయు బుట్టె, జనాంగ సంఘముల్
తర్షముదీరి, దుర్ణయము దారొకెను టెల్లెడనెట్టె, వైర్థికుల్
శీర్షములెగ్గుచున్, బరుసనేయఁగ జేరిరి, శంభుసన్నిధిన్. 76

ధాత యుగాదికి, బట్టెను
చేతోముదమున్, బ్రజాపరిసిద్ధ సుఖశ్రీ
ద్యోతి, యదృష్టము, శుభసం
స్ఫీతము ; పట్టాభిషేక విధియున్ గదిసెన్. 77

పంపాపతి పాదములు, న
పంపతి. సామంతపతులు, పంపిన కాన్కల్
పెంపెసగి, రాశిపడియె, ని
లింపులు గీర్తించి రభవు, లింగోద్భవునిన్. 78

ఆచార్యుండును బూజ్యుఁడై తనరు విద్యారణ్యు నాజ్ఞన్ కళా
వాచస్సాంద్రుఁడు, భోగినాథ కవియున్ బౌరోగవుండయ్యె, వృ
ద్ధాచారాంచితులైన బ్రాహ్మణులు సాహాయ్యంబు సేయన్ శుభ
పాత్రిచర్యుండు, పురోహితత్వపద మొప్పన్, సాయనుండయ్యెడన్.

తొలుతన్ బురలక్ష్మికి బూ
జల జేసియు, మెరవణిన్ బ్రజాతతులు, సుమాం
జలులన్ గురియగ, రాజును
బలములు గొల్వంగబెట్టె, వజ్రపుగద్దెన్. 80

వైశాఖ శుద్ధసప్తమి
ప్రాశస్త్యము నించు లగ్న భావమునన్ బ్రా
గీశనిభుని, హరిహరుని, శు
భాశీ రభిషేకవిధులు యాగము లొప్పెన్. 81

"ఆ ధర్మరాజు దమ్ములు
సాధించిరి సమరజయము, సాధుహితంబున్
మాధవుదయ, నటె, పొదలిరి
మాధవుదయ, హుక్కముఖ కుమారులు నెలమిన్". 82

అనుచున్ వందిగణంబులు
ననిశముగీర్తింప విభుఁడు నవిరతభక్తిన్

దనతమ్ములు గొల్వ, ననా
తన ధర్మస్థితుల నోమ దత్పరుఁడయ్యెన్. 83

ఒక్కొకదెస నొక తమ్ముఁడు
నిక్కియు భుజబలము జూపి నేర్పుగ నచటన్
జక్కని పాలన ప్రిజలను
జొక్కించిరి, పుడమి, నాల్గుచెఱగులు దాఁమై. 84

అప్పుడు, కన్నదమ్ముల, ముద్రశుకణంబుల, నన్నదమ్ములున్
గప్పుచు, నోరుగల్ దొఱగు కాలమునుండియు, మమ్ము బెండిళుల్
చొప్పడ, రాజు నల్లురుగ జొన్పి దయార్ద్రిత గాచి పట్టమం
దొప్పుగనుంచి ప్రోచితి రహో! తమ కేమియొసంగువార మీ
చొప్పున మ్రొక్కుటొక్కటని, చుట్టుచు, దేశికు బ్రస్తుతించిరన్. 85

మాధవ విద్యారణ్యుఁడు
సాధితము స్వారాజ్య మిపుడు! సాధ్యము నిగమాం
భోధరముల నర్థసుధా
శ్రీధారల్ గురియజేయ, జెల్వగు ననియెన్. 86

హరిహరుఁడు శిరంబొగ్గియు
విరిసరముగ వేద విశ్వవిద్యాలయమున్
బరపితి రిక, విద్వాంసుల
ద్వారగన్ రప్పింపుడనుచు బ్రార్థించె గురున్. 87

'చూచా' తప్పని గురువును
"వాచంయమి, శృంగగిరినివాసి, యుపనిషత్
వాచోనిధి, విద్యా తీ
ర్థాచార్యాంఘ్రిలకు బూజ లర్పించుటయున్. 88

నీ పట్టమునకు మునుపే
ప్రాపని నిర్మింప శంకు బట్టించిన వి
ద్యాపుర నిర్మాణము, త
ద్వ్యాప్యపృతియుఁ దోలుత, పూర్ణతఁ గనవలయుఁ. 89

వానిని బూర్తిచేసి పెరవారల సందడి కుందులేని య
ట్లానికలాచు బాసటగ నాంధ్రపదంబును గన్నడంబు నిం
పూనగ మండలేశ్వరుల బూనిచి సైన్యములఁ జయోదయా
ఖ్యానము లల్లనేర్పి, వెరవారగ సుస్థిర పాలనంబునఁ
జేనెడు పాట్లకై జనులు చింతిలకుండగ, బ్రోవఁగావలెఁ. 90

సుస్థిరములు, శుభశాంతులు
స్వస్థత చేకూరినపుడె, పరమార్థమునఁ
సుస్థితి లోకుల కగు, దుర
వస్థలు దెగ నెల్లసిరులు వర్ధిల్లు నిలఁ. 91

సమ్యగ్దృష్టియు, సుమనో
రమ్యతయు, సహృదయులందు, రాజిల్లునెడఁ
గమ్యంబగు, సద్బోధము
కామ్యార్థము లోకటిరై, వికాసము గొల్పుఁ. 92

ఇది లోకంబున నైజము
పదుగురుమాత్రము శతాన భగవద్రతులై
మెదుగుదు రవ్వారలలో
నొదవు సదుత్కంఠ యొకని కొండొకచోటఁ. 93

హేయము బింబం బీశున
కీయద్భుత సృష్టి యెల్ల! నీశుని లోకం

బాయా తరుణములన్ గని
ప్రాయిక మొకటిగ బుధుండె పరికించు మదిన్ 94

తదితరజనతయు, భాగ్యము
లాదిగిన, తుష్టిన్ వహించి, యూర్ధ్వముఖతకై
గదియుట యొక్కొక్కచో నగు,
నదనున నిడినట్టి పైరె యాదరువు ధరన్. 95

అని యుగ్గడించు దేశికు
గని హరిహరుఁడును నర్థకాంక్ష వచింపన్
గొను మదె పంపాపతి ధన
మును, వడ్డియు మొదలు నిచ్చు మనుకువతోడన్. 96

అనవిని, రాజేంద్రుఁడు, జ
య్యన, తమ్ముని గూడిపోయి, యలసత లేకన్
బనులెల్లను దీర్చు తెరువు
ననువులు దానెఱిగి, మిగులు కర్జముఁ బూనెన్. 97

పట్టంబై నది మొదలుగ
నెట్టన గప్పంబు లిచ్చు నియతిని దప్పన్
బట్టెద నని, తుఘ్లఖుఁడును
నిట్టలమగు, నీర్ష్య, దాడి నెఱపగ, నెంచెన్. 98

విని యది తెల్పబంచె నొక వేగును, వేగ బ్రతాపరుద్రసం
దనుఁడగు కృష్ణరాజు, వినుత ప్రీతిభాన్వితుఁడైన మాధవుం
డును, బెనుసేనలన్ బెనుప దుర్గమ యానతినిచ్చె, సైన్యముల్
పనుపడగా హరుండు నరిపాలము పూర్తిగ నెన్నిసాగుచున్. 99

ఓరుగల్లు, ససైన్యుఁడై గొఱరసి, పాదు
షా బలంబుల నెల్లను జావమోది
తెరిచూడగ రాకుండ దిరుగఁగొట్టి
యంత, పంపకు వచ్చుచు, హరిహరుండు. 100

కదనములను, వీరావేశ మొదవ, నేచి
పగతురను, నూఁచముట్టుగా దెగగ, బోరి
చోరవతో, స్వర్గధామముల్, చూఱఁగొన్న
కడిమి, మగలకు నై "వీరగల్లు" నిల్పి. 101

ఓరుగల్లాదిసీమల నోనరు విభుల
నుదయ రవితేజులగు రెడ్ల నుచితగతుల,
గారవమున, నటునట, భూదారులగుచు
నెలకొనఁగఁబూన్చి, వారల బలము గొలున. 102

విజయియైవచ్చె, నట్టి దోర్వీర్యవార్ధి
హరిహరాఖ్యుని నగరి సహర్నిశంబు,
బ్రోచినట్టి, బుక్కాధిపు, భూరిసౌఖ్య
మించ కగ్గించి, యాశీర్వదించె గురువు. 103

బుక్కరాయాదులు బ్రోదియొనర్పంగ
రాజధాని వృద్ధి నోజగనియె
విపణివీధులు బెక్కు వెలయంగ రత్నముల్
రాసులై పడియెను రథ్యలందు. 104

నుంతకాలంబు గడచె విశ్రాంతివేళ
యయ్యె, చతుర్మాస సువ్రత మపుర నలరు,

యతివిభుని, విద్యారణ్యు నంఘ్రియుగము
లంటఁ బనిగొని హరిహరుం డటకు నేగి. 105

మాపును రేపు కష్టపడి, మాన్యములౌ భవదీయ సూచనల్
రేఁప, సవశ్య మెల్ల సవరించితి, మీరొకనాడు వచ్చి, మా
యోపిన శక్తికొద్ది నుభయుల్ సమకూర్చిన వెల్లకార్యముల్
దాపున గాంతు రేని, మహితంబగు, దుష్టియు నబ్బు మాకనన్.106

వల్లెయటంచు బల్లకియు వెంబడి రాగ, సూక్తముల్
గొల్లున భోగినాథుఁడును గూడి వచింపగ, మేను, మానసం
బెల్ల, విభూతిజాత కృదహీన రుచి స్తమితంబు, సత్తపో
వేల్లిత సౌహృద స్తిమిత విస్ఫురణస్థగితంబు లొప్పఁగన్. 107

యతియు, నిరాడంబరగతి
జోతలో జను దేర, బురము జుట్టును జూపెన్
మతిమంతుఁడు, హరిహరుఁ డా
తతవిక్రముఁడైన బుక్కధరణిపు తోడన్. 108

ఓం తత్ సత్

శ్రీ, రస్తు

# పంపా భారతము — సభాపర్వము

## చతుర్థ ఖండము

### శ్రీ మాధవ విద్యారణ్యుని యుత్తర జీవితము,

---

నాంది:-

ణిప్రత్యయధారిణి, గో
విప్రావననిపుణ, పూర్వ వీరక్షాత్మ ప
క్షిప్రప్రసాదకారిణి
శ్రీ ప్రణవజ్యోతి యొసగు శ్రేయోర్థంబుల్.

తుంగభద్రా సుతరంగ శైత్యము లూను
ననిల బాలురకు విహారభూమి !
పొంగుఃపంపాప్రేమ లంగరు బిగదీయ
శివు నావ నిల్చిన చెలువు రేవు !
మాన్య మతంగాద్రి మాల్యవత్ క్షితిధర
హేమకూటాగ సంక్రామితంబు !
కర్ణాటదేశ మహార్ణవోదిత రమా
నిచిత ధమ్మిల్ల మాణిక్యభాతి !
దేశదేశాగత జన నివేశమయము !
ధనిక గుణరత్నములకు వైధనికయగుచు
వివిధ సువ్యక్తిభూతులు వెలయునెలవు !
హంపిచేరువ బొల్చె విద్యాపురంబు.

శ్రీ విద్యారణ్యుఁడు నృప
సేవితుఁడై ఋజుగతిన్ విశిష్టము నగరిన్
బావనముజేసె నడకన్
జీవనగ దయార్ద్రదృష్టి శీకరనిరతిన్. 2

అంతట సంతసించి యతిఁ డాదృతి బుక్కనిజూచి యింక నీ
వంతు పరాక్రమంబును, నవార్య సుధీబలమున్ జెలంగ, నా
క్రాంత మహీతలంబును, సుఖస్థితి, సుస్థితి, నుంపఁబెంప, నా
ప్రాంతములందు భద్రతయు బ్రాప్తను జేర్పగ, ముప్పదీర్పగన్. 3

ఆ ప్రతాపరుద్రుని కాలమందు నీవు
నుదయగిరిరాజ్య మేలితి వదియుఁ గంప
పతియు బాలించు ; యువరాజపదవి నొదిగి
పెంపుమింక సామ్రాజ్యంబు నింపుదనము. 4

ఈ యెన్మిదేండ్లలో మీయన్న హరిహరుం
డాజి, నరాతుల నేర్చియడరె,
నతనికి హొన్నూరుపతి, యంకితుండయి
పడమటి కడలి కాపై, తనర్చె
బాదముకోటయు నాదవానియు, దుర్గ
వితతి ససైన్య ముద్ధతినిఁ దొడరె
నుత్తరదిశయందు నోరుగల్లిభుఁ డాది
రెడ్డిరాజులు యుక్తరీతి వెలసి
రైన, భామినీసుల్తానుఁ డకట ! ప్రక్క
బల్లెమైయుండె ! నా పెనుముల్లు బలిసె !

మనము నన్యంబులగు పనుల్ జేసుచుచుండి
యాడదీయనిచో, ముప్పుగూడు దీన. 5

శృంగగిరి, బూజ్యపాదుఁ డుత్తుంగ మంగ
ళాస్పదుండు, విద్యాతీర్థ యతివరుండు
మనకు దీవనలిచ్చె నయ్యనఘునకును
బాదుకొల్పితి రుఱవు మర్యాద లీరు,
నితర యతులకు దగు సద్వ్రతుల నొసఁగి. 6

బహుసుభిక్షంబు ధనికులు పరమదాత
లన్నమునకు, కఱవునులేదయ్యొ ! కాట
కమ్ములెల్ల దీరె నుపద్రవమ్ము లుడిగె !
కుందుడిగి, జనుల్ ముదము గడించి గనిరి. 7

అమ్మహాదేవి భువనేశి, యసమకరుణ
జనపదంబున బొన్న వర్షంబు గురిసె
నొసగుఁ డీరు బంపాపతి హుండిధనము
లెదుగునట్లుగ వడ్డియు మొదలుఁ జేర్చి. 8

నవ్య నైగమకల్ప భవ్యార్థ వివృతి, నా
 రాయణాఖ్యుడు వాజపేయయాజి
వర యజుర్వేద సువ్యాఖ్యాన ఫణితుల
 సారమ్ముఁ, దమ్ముఁడు సాయనుండు
మహిత ఋగ్వేద సామ స్వరాగమ, భాష్య
 భూమికల్, నరహరి సోమయాజి
యుపనిషదుద్ఘుష్ట మురుశిష్ట యోగంబుఁ
 దెన్నుల, బండరి దీక్షితుండు

శుద్ధ సదుపాసనేద్ధులు సిద్ధులగుచు
నలరు పండిత తండంబుఁ గొలువుదీరి
తోడుపడ, వేదభాగంబు లూడదీసి
బోధసరణుల దేల్పంగ బూన్చినాడ. 9

మధుర, కోవ్రూరు, మంథెనల్ మాని, వచ్చి
భారతీతీర్థ శిష్యులై, వరలినట్టి
నల్వురు గురుత్తములు గూడినిల్వఁ, బార్థి
వాబ్దమున, నవగాత్రిమంబు లర్థినోసఁగ
హరిహరుఁడు; వారు షడ్దర్శనార్థవిదులు. 10

అంతయుగూరి యొక్కయెడ, నచ్చినయంతకు, నాకుజూప, న
త్యంతము సంప్రదాయనిగమార్థములన్, గననౌ, సదస్య లే
కాంతములన్, దదీయము, ముఖాముఖి జర్చల బేర్చుచుండ, రా
ద్ధాంతములౌచు భాష్యము విధంబు బయల్పడుచుండు నిత్యమున్.

ఈ వైదిక పారిషదులు
బ్రోవై విద్వాంసు లిచట భూరిశ్రద్ధల్
దావులొలుకగ, నిరుక్తము
త్రోవన్ గల గొందులెల్ల దొలగించుటకై. 12

వలసె, ద్వాదశహాయనంబులును నేను
నుత్తరం బొకయించుక శాంతి హత్తు నిపుడ
వేగబోయెద, వ్యాసర్షి, వేదవేత్త
దర్శనార్థంబు; కాశికై తరలనిందు. 13

అనుచు బల్కిన సంయమి నరసి, యాత్రి
సమత, గొనసాగ, గట్టుదిట్టముల జేసి

నిగమ పరిషద్విచారణ, నెఱయ సల్పి
యన్నదమ్ములు, వీడ్కొని యరిగిరంత. 14

కుడిచేత గుడికాల నుడుకుజ్యోతి వహించు
దీపపు కంబంబు, నూపురమును,
కట్టెదపైన చొక్కపు రాగి పదకాన
వరభుజోన్నతి బేర్చు వాయుసూతి
యొప్పించుతో జరీ లెకసక్కమాడంగ
పసుపుత్తరీయంబు వల్లెవాటు
నీలిరంగులహాళాయ లీక్షించు మఖ్మలు
లగియించినట్టి కుళ్ళాయి చెలగ
"ఆదిమధ్యాంతరహిత ! హొయప్రమేయ !"
యనుచు, జాగంటి మ్రోయించి, యడుగు నెత్తి
పెట్టి, గోవిందు గోవిందవెట్టి, యపుడు
వేంకటేశ్వరు దాసప్ప వెడలె, ముందు. 15

రాజు సైనికు లెల్ల బైరాగులగుచు
వెంబడింప, గషాయ శుభ్రాంబరుండు
దండియై యతివరాళి యాత్రకును వెడలె
సింగరార్యాఖ్య భూతంబు, సేవకుండుగ. 16

పల్లకి లేదు, రాజవిభవంబును లేదు తపోబలంబు సం
ఫుల్ల మెలర్ప, భూతమును బోవు తెఱంగును ముందు కేగుచుం
దెల్లము సేయ దుంపలును దివ్యఫలంబులు బాలు నారగిం
పుల్లము జల్లగా, యతివిభుండు గమించెను పాదచారియై. 17

పిచ్చి తుఘ్లఖు క్రౌర్యంబు హెచ్చుకొలది
వంగ ఘూర్జ రాయోధ్య మాళ్వముల పతులు
దిరుగబడి కల్లకల్లోలమై, దేశమెల్ల
జనుల హాహాకృతుల గోడు సంద్రమయ్యె. 18

అపుడు గుమిలేని గమనిక, నరిగియరిగి
పుండరీకాక్షు వలగొని, నిండుమదిని
బాణలింగవిభూషు, గోపాలవేషు
పాండురంగని భజనలో పాలుగొనియు
సుప్రదక్షిణ ఫణితి నాసువ్రతియును. 19

ద్వారకనుజొచ్చి, కృష్ణు గృపాసముద్రు
నష్టభార్యావిశిష్టు నవ్యయుని, గురుని
సంస్తుతించి యచ్చోట ప్రశస్తిగన్న
ద్వారకాపీఠు నాహ్వాన ఫణితి, మసలి
మాతృగయ కేగి, యాపైన మాతృదేవి
నంబ పాదంబు లంటి, యనంతరంబు
నభయదాత్రి, జ్వాలాముఖి, నరసి వెడలి
మధురకడ గనె యమునా నిమజ్జనంబు. 21

వర కురుక్షేత్రమున సరస్వతిని మునిగి
కలుషహారణ త్రివేణి సంగమము నొరయ
నరిగి యట మునిపల్లెలు నలపుదీర్ప
గంగయొడ్డున దరలె నసంకుఁడగుచు. 22

ఆపై వింధ్యనివాసి దేవిఁగని యాహ్లాదంబునుం బొంది, సం
తాపౌఘంబులు పీడఁజేయునని, విద్యారణ్య మానీశుఁడుఁ

ప్రాపించెఁ భవనాశి గాశి, యచటఁ, భట్టుఁ నిరాఘాటమై,
పాపంబెల్లను బాయునంచు యతికిఁ, వ్యాసస్మృతిఁ గూర్చుచుఁ.

తుషము ద్రొక్కుండు, వ్యాసుండు ; కృషినిజేసి
యతని కారుణ్యబలమున నసురవృత్తి
నాకు దొలగింపుఁడనుచు, విజ్ఞానభరితు
ధన్యచరితు, విద్యారణ్యుఁ దారసిలియె. 24

అటులె యగుగాక యనుచు, దయాంతరంగుఁ
డైన ముని యట శుకుతండ్రి నలఘు వినతిఁ
దనిపె, భాగీరథీ దివ్యతటమునందు ;
శీఘ్రకాలంబుననె, తపస్సిద్ధు నతని
జేరరమ్మను వ్యాసాజ్ఞ, చెవులఁబడియె. 25

వారణాసీ సంగ మోరు తీర్థములలో
నఘమర్షణ స్నాన మాచరించి
అనఘ దశాశ్వమేధాంబు తీరము సొచ్చి
తత్పరత్వంబున దనువు ముంచి
పంచాపగాకూట సంచిత జలములఁ
మణికర్ణికఁ గూడి మాఱుమున్గి
శ్రీ హరిశ్చంద్ర సంశ్రితము రేవున, నిల్చి
ఘనుని చింతామణి గణపుజూచి

యమియు నుత్తర దక్షిణ యాత్ర లరసె
బిందుమాధవపాదనఖేందు లసిత
కాశికాపురి నవిముక్త ఘట్ట మొరసె,

పిదప, వ్యాసపూర్ణిమనాఁడు, పెందలకడ,
పొట్టు, కల, ఘుట్ట మొకతట్టు, నిట్టనిలిచె. 26

సుబ్రహ్మణ్య ముహూర్తమునం
దబ్రంబుగ యతియు వేచి, యాశ్రితుకొఱకై
యేబ్రమ దొరయఁడు ; విశువం
డాబ్రహ్మాంజలిని వ్యాసు నర్చించుతఱిన్. 27

అక్కడి కయ్యెడ నొక్కఁడు
మిక్కుటములు జడలు వ్రేల మిన్కునొడలితో
జక్కఁగ నేగక, తుషముల్
బ్రక్కన బడిపోవ, దాఁటి, వారిన్ జొచ్చెన్. 28

వారి నాతఁడు మెట్ట, నివాళియిడుచు
గంగ, పుష్పాంజలి నొసంగి, వంగి, పొగడి
యతని పాదంబులన్ బడి, యవల దాటి,
సాగిలబడియె, నాదృశ్య నూఁగమజ్జుఁ
డైన యోగి విద్యారణ్యుఁ డాత్మ దూఁచె. 29

ఆగతుని తేజు, బొడవును, నలవిగాని
వగచు, గంటి కస్పష్టమై, యరయరాము
వ్యాసుఁ డతఁడని యెఱిఁగి సాద్యంబునిచ్చి
దివ్యదృష్టి నిమ్మనుచు బ్రార్థించె, నంత. 30

కనె మానీశుని, బ్రావృ షంబుధరసంకాశున్, దిగీశాది దే
వనికాయావిరతార్చితాంఘ్రి కమలోద్భాసున్, జతుర్వేద పా
వనవిన్యాసు, నిజాశ్రితాఘచయ నిర్వాసున్, రణద్బ్రహ్మ సూ
త్రనిధానోక్తివిలాసు, భాగవతగీతాశ్వాసునిన్ వ్యాసునిన్. 31

ప్రాగల్భ్యము, భక్తి, సము
ద్వేగము, వాగులుగ జాఱ్చు వివిధప్రణుతుల్
జాగుగఁ బల్కుచు బ్రణతుం
డై గౌరవమున జూచు వ్యాసు, సర్థించె నిటుల్. 32

విమలయోగజ్ఞాన వినియోగ మహితుండు
నిండుభక్తుండు శుకుండ గాను
భాష్యత్రయంబున బ్రస్థానసరణుల
శ్రుతినించు శంకరసూరి గాను
సర్వార్థ సారస్యపూర్వక కవితల
జొక్కింప గాళిదాసుండ గాను
సునిగమామ్నాయ శాస్త్రోక్తి వివరణ మ
హాంభోధి, మధ్వమహర్షి గాను
వేదముల మూలమేతీరో వెరవెఱుంగ
సింగరార్యుని, యసురత, చినిగిపోవ
నాదుమది శుద్ధ సిద్ధి నున్నతిని దనర
నాశ్రయించితి సిద్ధేశు ననఘు నిన్ను
భక్త హృద్వాస! వ్యాస! అవ్యయవికాస! 33

అనుచు నిల్వ, ననుగ్రహంబడరఁ గాంచి
సింగరార్యుని వృజినాలి శిథిలపరచి
"నిగమ భాష్యంబు వ్రాయింపఁదగుదు వీవు
నబ్జభవునంశ బుట్టితి ; వగుదు నేను
బాసటగ" నని యభయంబు వ్యాసుఁ డొసఁగె. 34

తళుకుఁ జంపయుఁబోలె వ్యాసముని యంతర్ధానమైపోయె నే
యళుకుఁ లేకయ, సింగరార్యుఁడు, మహా హర్షంబునన్ యజ్ఞభు
క్కళ వ్యాపింపగ, దేజరిల్లుచు, మునిన్ గై దండపై నొక్కె; ని
శ్చలుఁడై, యోగి, యలాయిదాల్, దెలియఁడాశాంతప్రశాంతస్థితిన్

ఆపయిని సోలు నంగంబు, లలమికొనుచు
నంబుజాప్తుని యుదయంబు నరసికొనుచు
జానుదఘ్నంబు లంబువుల్, జార్చుకొనుచు
మునియు, గంగా నిమజ్జనంబునకు బూనె. 36

ఆగంగాతీర మనోజ్ఞ సైకతతలం బా, రమ్యశీతా నిలో
త్తుంగాంబుప్రసర ప్రమాంగముల బెట్దూగుల్, తరంగంబులున్,
జెంగావుల్ విరజిమ్ము భానువులచే, శీర్ణంబులౌ, చీకటుల్
భంగింపన్ బడి, యూడి పాఱువడు వా, వాసంతికోద్యోతముల్.

కనియునుఁ దలమునకలుగా
బోదివిన, గంగాతటాంక పృథుతరశాంతుల్
గుదురుగ, నున్మని, మునియున్
సదమలము సమాధినొనరె సహజమనీషన్. 38

ఒక ముహూర్తం బతం డున్మనివ్యగ్రతన్
వాఙ్మన స్తనువుల బలుకరాని
యనుపమానంబైన, యానందమున నుండి
యెఱుక మిగుల, బయలు నెఱిఁగి లేచె. 39

బయట సాక్షాత్కరించిన వ్యాసుఁ డఖిల
విశ్వమయత, లోపలకూడ, వెలుగుచుండ

యతియు బరికింప, నిగమాగమముల, సత్య
వివృతులుఁ, బట్టబయలైన విధము దోఁచె. 40

గంగాసంగమ పుణ్యభాజనత నంగం బెల్ల పొంగారఁగఁ
నింగిఁజూచుచు, నర్ఘ్యముల్విడిచి, నిర్నిద్రాదృతిఁ, వాలుకా
లింగం బర్చనజేసి, శాంతిసుమమాలింగ్యంబు, సుజ్ఞానముఁ
జెంగుల్గాని విభూతిరేఖలను, వాసింపంగ, నయ్యోగియుఁ. 41

పరమసంతుష్టి, సింగరభట్టు గూడి
వెనుదిరిగి, గయఁజేరియు, విష్ణుపాద
మంటి, యంత కాళీఘట్ట మరసి, యామె
కెరగి, యాజగన్నాథుని సరస జొచ్చి. 42

కూర్మేశు భజియించి కోటిలింగాలలో
గోదావరీజలం బీదులాడి,
రెడ్డిరాజులు నిడ్డ, నడ్డపాలకి నూఁగి
యాయువిచ్చిన లింగ మర్థిగొల్చి,
కృష్ణాతరంగిణి గిటికొన్న వేదాగ
శిఖరి నిల్చిన, నరసింహు నరసి
శ్రీశైలవిభుని, నక్షీణ మోక్షాధ్యక్షు
భ్రమరాసముల్లాసభవుని మ్రొక్కి
భాస్కరక్షేత్ర నివాసి, బ్రహ్మేశ్వరు,
మాతను, జోగుళాంబను, భజించి

తుంగభద్రా తటాకంబు, దోఁవ నడచి
వత్సరాంతంబులోపల, వచ్చి చేరె

పెంపెలర్చి, నిలింపుల కింపుగూర్చు
పంపయొద్దు ; విరూపాక్షు పాదతలము. 43

పదునాల్గేండ్లు భుజప్రతాపగరిమన్, భాసిల్లి, విప్రార్తులన్ ద్రిదులన్, దుర్మదవైరి దుష్కృతి తమోరింఛోళి భంజించి, ధర్మ దయా దీధితులన్ వహించి, యుదయార్కప్రాభవంబూని, రెండుదిశల్ సంద్రములాను సీమఁ గఱటుల్ దుల్లంగ, బాలించియున్.44

హరిహరుఁ డనుజుని బుక్కని
నరపతిగా నెన్ని, భూతనాథుని, పంపే
శ్వరు నెన్నుచు, గైలాసం
బిరవుగ గైకొనెను, కీర్తియే, యిల నిల్చెన్. 45

శ్రీ విద్యారణ్యుండు, శు
భావేశుని బుక్కరాయు, నారసి, సామ్రా
జ్యావన ధర్మస్థాపన
లీవు నొనర్పుమని, యాజ్ఞనిడె తక్షణమే. 46

పట్టముగట్టెను, ప్రజలున్
జుట్టములై, సమ్మదంబు జూఱగొనిరి, శా
రోద్యట్టంకితమగు, ధర్మంబును,
గట్టెక్కిన దనిరి, బుధుల కాతర్యమునన్. 47

రాచవారు, రేచెర్లవారలును, రెడ్డి
రాజులును, రాయబారుల రాణ ననుప
నమల మణిహారములు మౌక్తికముల దండ
లతులముగ బుక్కఁడును, బహూకృతుల బంచె. 48

నాల్గునేండ్లకు, మున్ను సంగ్రామములను
బహుగుసుల్తాను నెగిచి, కల్బరిగి గెల్చి
భామినీరాజ్యపతిగాగ, బరగు గంగొ
కండె రాడయ్యె, నీర్ష్యాదికమ్ము బొరయ,
నోరుగల్పతి కండయై, యుండెననుచు. 49

బుక్కరాజేంద్రుడుం బట్టమెక్కె నాతఁ
డేలు నారంభదశలోనె యోలగమ్ము
నొరసి యిర్వురు భామినీశ్వరుని భటులు
నా నవాబాజ్ఞ విన్పించి రాగడముగ. 50

సభనుగూడిన సామంతవిభులు నవ్వ,
మంత్రులెల్లరు మదుల సంభ్రమము మొనయ,
పౌరముఖ్యులు నక్కజం పడుచునుండ,
తురకపాటకు నొకని ముందునకు ద్రోసి. 51

"ఇతఁడు సంగీతవిదుఁడు సమిద్ధగతిని
మాప్రభుని మెప్పుగనె బహుమాన మీరు
చేయుఁడని మా నవాబంపె, జిత్తగింపుఁ"
డనుచు భటులును, వివరింప నవనిపతియు. 52

పుష్పమాలికలనుజుట్టి, బోరుకలఁగ
తప్పెటల గొట్టుచుం, జనుల్ రొప్పుచుండ,
ఖరముపై, వీరినెల్లర, పురమువీధు
లంతత్రిప్పుట, బహుమతియగును గాదె ?" 53

అనిన, నట్టులె వారికి నయ్యె శిక్ష
వారును నవాబునొద్దకు బొఁజి, యంత

కంటెను బదింత లవమానగాధ లల్లి
యప్పగించి రేద్చుచుఁ గనువిప్పఁగాఁగ. 54

పటపట పండ్లుగీటుచును, భగ్గునమండి, నవాబు, సేనలన్
దటుకునఁ జేరదీసి వెస దండపతుల్ నడువుండు, పంప యు
త్కటకటు మర్కటంబులకు దావు! నృపాలుఁడు, గాఫరాట, మి
క్కుటమగు కోతిచేష్ట లాడిగట్టెనొకో! తలమీఁది కన్నులై. 55

అని భామినీనవా బంత కాకారియై
తడవు సేయకుండ దాడివెడలె
బుక్కరాయఁ డతని పొగరడంచెడు నొక్క
యుక్తిబన్నె, రిపుల నోడగొట్ట. 56

ఎదిరిన సేన నష్టమగు నెట్లనటంచునె, బుక్కరాయఁడున్,
రొద యిసుమంతలేక, పురి నేదొ రహస్యవిధాన వీడి, తన్
గదుముచు శత్రువర్గములు, గాల్నడకన్, జనుదేర, దాపునన్
గొదుకక, కొండలోయలనుఁ గొందుల దాగెను, మాఱుపీఁగుచున్. 57

పొందూరు, కొండనిండుగ,
మెండుకొను రహస్యచరుల, మిడుతలువోలెన్
దండిబలంబులు, గొలువఁగ
నొండొకచో వేచియుండు నుర్విపుఁ బట్టన్. 58

తురకబలము, సర్దారులు
సురకయ ముట్టడులఁ బేర్చి, యుద్దామముగన్
తెరువులగట్టియు, నేఱుల
దరులన్ గావలి నిడిరి వృథాశ్రమ బడుచున్. 59

అలసుచే, చేవయుడిగిన యరులబలము
వెన్నడింపఁగ, దుర్గంబు విభుఁడు జొచ్చె;
నగరికోట గొట్టగలేక, బెగడువడిన
యవనసేనలు పోవ బుక్కావనిపుడు. 60

"వెలమదొరలును రెడ్డిరాజులును బలిసి
యోరుగల్లురాజ్యపుఁ దునకలొందినారు
ప్రభుతలును భోగభాగ్యము ల్వడసినారు
రాచవారికి బూజ్యంబె రాజ్య" మనుచు. 61

తెల్పి, చివరి వినాయక దేవు, కాక
తీయవంశ్యు, నోదార్చి, నాత్మీయువలెనె,
భూరిధనముల నిచ్చి, సద్బుద్ధి గఱపి,
యనిచె నొకచోట మనికిగా దనువు నోమ. 62

ఒక్క గవ్వ యీక నవాబు నోడగొట్టి
కాకతీయ గౌరవమును గాచి, యేచి,
రెడ్డి రేచర్లవారిదే సొడ్డులేక,
మహితుఁడైన విద్యారణ్యమౌని గొల్చి
బుక్కరాయఁడు సామ్రాజ్యముఁ భజించె. 63

సిద్ధులొందిన క్రియాశక్తిరాయలశిష్యుఁ
డగు, మాధవామాత్యుఁ డాత్మమెచ్చ
పెనుగొండకుఁ గోట పేట నిర్మించి, య
నంతసాగర మంత్రి, సంతసింప
వేల్వేలచెరువులు, గాల్వలు, ద్రవ్వించి
బచ్చరాట్ ప్రెగ్గడ, ప్రస్తుతింప

ముద్దప బసవన ప్రముఖులు, సేనాను,
లుత్తమ ప్రభుభక్తి, నోలసి వెలయ

పంటనేలల బంగారు పండజొచ్చె ;
వివిధ వాణిజ్యసంస్థలు విరివియయ్యె ;
పల్లెపల్లెల గ్రాలె సత్త్రశాల
లిద్ధమతి బుక్కరాజేంద్రుఁ డేలునపుడు. 64

ఎవనికవిత్వముల్ బువుల యెత్తులనఁ, రసభావ వాసనల్
నవనవ శోభనొప్పె, కవినాథుఁడు నాచనసోమనాథుఁడుఁ
చవిగొనె బుక్కభూభుజుని సంపద ! పెంచుకదిన్నె యగ్రహా
రవసతి, బుక్కరాజు, కవిరాజుల బ్రోచినసౌరు, దెల్పెడుఁ. 65

మాధవమంత్రి, రచించెను
మాధవ సునిదానమణిని, మంత్రులె, కృతులఁ
భూధవు నేల్బడి వ్రాయఁగ
సాధితము, సుభిక్ష మెంత చక్షుష్యమొకో ! 66

సాయన విద్యారణ్యుని
సాయమునఁ వేదవృత్తి సాంతము, రత్న
ప్రాయముగను, భాష్యోక్తుల
వ్రాయఁ వీలయ్యె, బుక్కవాల్లభ్యమునఁ. 67

పరసొత్తులు, పరదారలు
పరికింపఁడు బుక్కపతియు, పతసంబుల నా
తరుణముననె సేయవు, మఱి
పరగించుఁ జేట జీత్రపగిది ననుమతిఁ. 68

స్వార్థ సుగతి విడువకయ, ప
రార్థంబుల జెడుపకుండ, నధిపుడు విద్యా
తీర్థుల సాశ్రియు జేసియు,
సార్థకతఁ జరించె విబుధ సాధుహితముగన్. 69

మానవత యె, తనలక్ష్యము
మానుగ దేవాంశవెలయ, మనిపె సుజనులన్
జ్ఞానాశ్రయుఁడయి, తనకున్
న్యూనత గానట్టిభాతి నూల్కొనె నతఁడున్. 70

కాలవశులు సర్వులు ! నిల
కాలమె పక్వంబుసేయు కాగలపనులన్ !
కాలము డగ్గఱె, బుక్కని
కాలంబము ధర్మపరుల కరుదనిపింపన్. 71

కాలమహాబ్ధియున్ దొలఁకి గడ్డనుగూల్చు ఫలామ్రభూజమున్
వ్రాలెను ! బుక్కరాయఁడును స్వర్గముజేరెను ! వార్ధకంబు ను
ద్వేలము ముంచియెత్త, దనువేమియు నిల్వదటంచు, శృంగగి
ర్యాలయవాస మెన్నెను, మహామతి, మాధవయోగిచంద్రుడున్. 72

రెండవ హరిహరుఁడును, ను
ద్దండ పరాక్రముఁడు, బాహుదర్ప సముద్య
ద్గాండీవియునై, నీతికి
నండగ, సింహాసనంబు నారోహించెన్. 73

నానార్థనిఘంటువు, కృతి
బూనెను జైనమతియతఁడె,వో "యిరుగప" నే

నాని, యమాత్యుఁడు, కడు
జానుగ దోడ్పడెను, రాజు సమరార్థములన్. 74

సాల్వకులుఁడు, గుండప్పయు,
నిల్వన నీతోచు రిపులు నిల్వక బోవన్
గొల్వనకున్, గీర్తి రుచియు
బల్వగ లాభముల్గూర్చె, జతికి హితుండై. 75

బచ్చపరాజును, ముద్దప
లోచ్చెము లేకుండ రాజ్య మున్నతిజెందన్
విచ్చిన కరవాలములన్
దెచ్చిరి, విపులవిజయప్రదీప్తుల నెపుడున్. 76

విద్యారణ్యా హితోక్తియు,
హృద్యంబయి ధర్మభూతి కేడుగడగ, సం
పద్యోగముల బడసి రన
వద్యముగ, నృపుండు మంత్రివర్యులు బ్రజలున్. 77

సాయనుఁ డెన్ను ధర్మకృతి సంపద బొంపిరివోయె, నెల్లెడన్
వ్రాయఁగడంగెఁ గాలము సువార్తలఁ గీర్తిపటంబుపైన, సు
ధ్యేయములయ్యె వేదములు; పొంగెనుఁ దీర్ఘగతు ల్పుదీర్ఘసౌఖ్యసం
ధాయక వీచులన్ దోలఁకి; ధన్యతఁగాంచెను రాజ్యలక్ష్మియున్.78

మాయనసూతి మాధవుఁడు మాన్యుల సాయన భోగనాథులన్
వ్రాయమువచ్చునప్పటి కపారము వైదుషి నందఁజేసి, బో
ధాయను నుద్ధిమై తనరి, తానును, ముప్పదియేటనే, యతి
త్వాయత వృత్తి చేకొని, సితాంత తపస్సువిభూతియుక్తుఁడై. 79

నలువదిరెమై దబ్దంబులు
నలువుగ సామ్రాజ్యసృష్టి నాథుండై, ప్రా
బలుకుల భాష్యము, ని
శ్చల సత్పరిపాలన ప్రచారము, నడరన్. 80

ఘను నిగమాంత దేశికుని కట్టకడన్ దనసత్కృతుల్గొనన్
వినతిని వ్రాసరమ్మనుచు విప్రునిబంచిన, నాతఁడున్ "సనా
తన శుభదంబు శ్రీప్రభుపదంబును దక్కఁగ నొందు నొల్లనే"
ననుచును, మాఱువ్రాయగని, యయ్యదె సూచనగాగ లేచి, యొ
య్యన నిహమెల్లయున్ విడిచి, యాత్మపథ ప్రవణాంతరంగుఁడై .81

సుస్థితమై పంపాతట
సుస్థిర ధర్మప్రసిద్ధి శోభిలెనని యా
సుస్థేయుఁడు, మునియును, గా
ర్హస్థ్యము మఱచి, పరమహంసగ దనరన్. 82

శృంగేరి, సుశాంతిఖచిత
భృంగారము, భారతీ వివేకజ్వాలా
శృంగాంగారము, విద్యా
శృంగారాగారమున్, వసింపగ గోరెన్. 83

డెబ్బదియారునేండ్లును, బడెన్, వయసింక, వరాకవృత్తులన్
మబ్బులఁబేర్చు నీతనువు మాయకమున్నె, సురాపగాజటున్,
గుబ్బలికన్నె నెయ్యరిని, గొల్చి ముకుందునిచేత మోక్షమున్
గొబ్బున గొందునంచు, నతికోవిదుఁ డాయతి, యాయతమ్మనన్.84

అష్టమతంబుల, నిగమా
వష్టంభములై యెసంగ, బాదుకొలిపె, రా

జిష్ణుఁడు, బుక్కఁడు, ధన సం
పుష్టంబుల జేసె, భూరి భూదానములర్.	85

పవలే దివ్వెల నెత్తుటాది, ఘనతల్ ప్రాపించె, సర్వజ్ఞ వి
ష్ణువు, విద్యాప్యాయతీర్థపాదుడయి, యాసుజ్ఞాని, పూర్వంబు, కం
చివసించెర్, శ్రితశిష్యవంద్యుఁడయి ; యాచినోర్మది తర్వాత, స్వ
స్థ విచారాంబుధి భారతీశ్వరుఁడు సంస్థానంబు పాలించె, ద
ద్వ్యవహారార్థము, దత్తమయ్యె దశసంపద్ధామ, సద్గ్రామముల్.

ఆసర్వజ్ఞుని, యంతే
వాసులు, నిగమాంతగురువు, భారతియను ధీ
భాసియు, మాధవుఁ డపర
వ్యాసుడు, శంకరసమాఖ్య యతివర్యుండుర్.	87

వాదులయందు బెద్దయయి, వైష్ణవముఖ్యగురుండు, కావ్యమే
ధాదయితుండు, భాగవత తత్పరుఁడై నిగమాంత దేశికుం
డాదృతి భక్తిమార్గమున కగ్రతగూర్చె, మనోజ్ఞ వాగ్గురుల్
ప్రోదియొనర్ప ; నమ్మహితుబోల్పగ నాతని కాతఁడే తగుర్.	88

అల శంకరానందుఁ డఖిలాగమజ్ఞుఁడై
కామకోటినిగల గద్దె నెక్కె
భారతీతీర్థుం డుదారు దేశికునాజ్ఞ
శృంగేరిపీఠాన జెల్వుగాంచె
శ్రీకంఠశిష్యుఁడై శిష్టుఁడై కవిత, న
త్యుచ్ఛ్రితి భోగనాథుండు వడసె
సంగమక్ష్మాతలేశ్వరునకు మంత్రియై
సాయనుం డఖిలభాష్యముల వ్రాసె

అనఘులగు, సహాధ్యాయు లనుజు లిటుల
సార్థక సుజీవితముల, ప్రశస్తినెనయ
మోదమందియు, తనజని మొనసె జయ, వి
తరణలని, మాని, శృంగేరిపురిని, జేరె. 89

భారతీతీర్థ గురువర్యు పజ్జ నిలిచి
యచటగాంచె విద్యారణ్యుఁ డచలదీక్షు
చారుతర మాన మురుతపశ్చర్య బూని
సారముఱవగు నాత్మ ప్రశాంత శాంతి. 90

ప్రకృతిరూపిణియై, స్థాణు ప్రిభ్విణియును
నోరువిడక, క్షణక్షణ, నూత్నశోభ
దాల్చుచుఁ, దివ్యతను తటిత్తాండవమున
చిద్విలీనుని, శివుని, రంజించె నచట. 91

శంకరాచార్యు వెన్నంటి సంస్కృతి తెగి
చేరె మండన మిశ్రుండు (సిద్ధకవిత
మలయు భవభూతి, కృతి తతి మఱచి) యోగి
వర్యుఁడగుచు సురేశ్వరాచార్యుఁ డచట ! 92

పతిపదంబులజాడనే, సతియునేగి
భారతీదేవి సకల విద్వద్విభావ్య
కొండయడుగున గుహలోన, గోరి, చేరి
విమలతనువుఁ దపోగ్నిని వేల్చె నచట ! 93

హృత్కమలమందె, శ్రీచక్ర ముదితమన్న,
షణ్మతస్థాపకుం డాదిశంకరుండు,

వేఁడి, కాశ్మీరముననుండి, తోడుదెచ్చి
విబుధవంద్య, శారదను, స్థాపించె నచట! 94

ఆదిశంకరుఁ డెటనిల్చె నరయలేము!
కాలడి యతీంద్రుఁ డెటనిల్చె కానలేము!
ఆసురేశ్వరుఁ డాదిగా, యతులు నిల్చి
రవ్యయానంద భూమిక లరసి యచట! 95

అదెశృంగేరి! విభాండకాత్మజుఁడు, ఋష్యశృంగి, యద్వైత త
త్వద మగ్నుండయి, నిల్చెనయ్యెడ, సుపర్వశ్రేష్ఠులున్ బొల్తు రా
ధ్యదయాంభోనిధి, చంద్రమౌళియు, సదాధ్యానైక్యదీప్తిన్, శు భా
స్పదుఁడై యుండ, గణేశుడున్ గొలుచు బ్రాజ్యశ్రీలు బెంపారగన్.96

అదె శృంగేరి! సుధాస్రవంతియయి, వైహాల్యంబు బోనాడి, వి
ద్యా దఖండస్ఫుట ధాటితో డిగుచు, సద్యోజ్ఞానధారల్, ప్రమో
దదరీతిన్, దనుదాల్చువారలకు, నుత్పాదించు, వారాహ స
ద్రిదనోద్భూత తరంగ, తుంగ, యట నిస్త్రైగుణ్యయై, గణ్యయై.97

అదె శృంగేరి! మహాద్భుతాటవుల, సహ్యాహార్య మౌదార్య మిం
పు దలిర్పన్, హితులౌ వలాహకతతిన్, మొగ్గించి పెంచున్, దప
స్పదనుల్ నిల్వగ నాటపట్టదియె! నైసర్గ ప్రశాంతస్థితుల్
కుదురౌ, ఖర్వటముల్, ఝరుల్, పరశివాకూతంబులన్ బూతముల్

ఆ విద్యానిధి, మౌని యాత్మసరసీహంసంబు, విష్ణున్, స్తుతిన్;
ద్యావాపృథ్వులలో బయల్ పొలయలుదానై క్రాలు ఫాలాక్షు, దుం
గావారిన్ విపులాభిషేక విధి; జొక్కన్ జేసి, బాహ్యాంతరం
బేవేళన్, పరునందె లగ్నమగు, స్వాభీష్టంబు, బూరించుచున్. 99

ఘనగుహాహ్రాద నీరఘట్టాపగా కూల
　　ముల, వసించి పరుండె జలములనును
ఔదుంబరవటంబు లశ్వత్థముల నీడ,
　　నాసీనుఁడై పరుం డవియె యనును
తులసీ శమీ బిల్వముల, ధాత్రి చెంతను
　　గూరుచుండి, పరుండు జేరెననును
శాద్వల వాలుకాస్థలముల, రాలపై
　　నిల్చుచు, బరు నవి, తాల్చెనను
ప్రాతరర్కునిలో జ్ఞాన మూఁతగొనుచు
సాంధ్య హేమభానువుల బ్రశాంతిగనును
అలఘు మధ్యందినాతపు నాత్మమూర్తి
సర్వసర్వంసహావర్తి, సత్యమనును. 100

అతఁడే యోగి జనౌఘభర్త సతతాధ్యాత్మానుభూతివ్రత
స్థితి సంరక్షణకర్త! సార్థక నిజాశీస్సాఖ్యయదాదిష్టరా
ట్ర్తతి వర్థిష్ణు సుకర్మవర్తి! విపులోద్యత్కీర్తి! స్వామ్నాయ సం
భృత ధర్మావన చక్రవర్తి! శ్రుతిసంప్రీతి స్థిరౌదార్య భా
రత విస్ఫూర్తి! యటంచు నాగతులనన్ రాజిల్లెనమ్మౌనియున్.101

ఎనుబదియైదు హాయనము లిద్ధమహోద్య మసత్క్రియాపరుం
డును, ఘనరాజ్యనిర్మితికి ద్రోవనుగట్టిన బుద్ధిశాలి, పా్రి
క్తన గురువాచు, బెగ్గడయు, దత్త్వవిదుండును, యోగిమండలం
బున కపి భూషణుండునయి, పొల్చె! జగంబును వల్చె నాతనిన్.

"వ్యాకరణ ధాతువృత్తి"యు, జ్యోతిషమున
"కాలనిర్ణయము"ను, "న్యాయమాల" కృతియు.

నల "పరాశర మాధవీయము"ను, "భాష్య"
ములును, నతని సర్వజ్ఞతఁ బలుకుచుండె. 103

అంతయు దానెయై, ప్రకృతియంతట బొల్చు విభూతులెల్ల, యు
త్క్రాంతియు దానెయై, యరయు గంటికిముంగల, గన్నులోన, న
శ్రాంతము దానెయై, హృదభిరామ సుధాముని, జూచుచుఁ మనో
ధ్వాంతములెల్ల బాసియు, సుధామల కేవల తన్మయుండునై 104

భారతీ తీర్థుఁడును, జన్మబాసి చనఁగ
శృంగగిరి జగద్గురుఁడయి, చెలగి, క్షయను,
చైత్రశుద్ధ త్రయోదశి, శాశ్వతగతి
తత్పదవి, నతం డంతర్హితత్వ మొనరె. 105

ఏకనాయకంబది సూరిహితము, గాఁగ
పతి యనుంగుబంధువు లుపపతులు గాఁగ
ధర్మసామ్రాజ్య సుస్థితి దనరుటొకటె
లక్ష్యముగ, మాధవుఁడు రాజ్యలక్ష్మి నిల్పె. 106

ఎంతకాలంబు రాజులు నేకలక్ష్య
మొనర, తద్విధానంబును, మొనసి, నడపి
రంతదాఁక సామ్రాజ్యంబు, నవనిబొల్చె
తద్విధిచెడ, పంపా భారతంబు, నమసె. 107

ఏ భవ్యమహిమ నహీన పంపాతట
సామ్రాజ్యసృష్టియు జక్కబడియె
నేదివ్య వైదుషి నిద్ధమై, వైదికా
గమ భాష్య విస్తృతి విమలమయ్యె

నేగణ్యసమతచే, నైగమాంతాచార్య
జయతీర్థముఖులు, బూజ్యతలగాంచి,
రేసౌమ్యుని మనీష యిరవుగా, భారత
సంస్కృతి, నేడును, జాలువాఱు
నమలుఁ డాధ్యాత్మిక విభూతి నపరధాత
వ్యాసు నావేశమూర్తి, విద్వత్ప్రవర్తి
స్వ పరవాద భేదమనని, సాధుమూర్తి
సిద్ధమణి మాధవుఁడు, గీర్తిశేషుఁడయ్యె. 108

ఓం తత్ సత్

---

శ్రీరస్తు

# పంపా భారతము — సభాపర్వము

## పంచమ ఖండము

నాంది:-

యంత్రిమె దేహము! తానే
యంత్రారూఢయు బ్రచోదయిత్రను నుడికిన్
మంత్రిణియును నయి, రంజిలు
తంత్రధ్యేయను, భజించెదను గాయత్రిన్.

విద్యారణ్యమునీంద్రమందిర మదే వీక్షింపుడం చర్చకుల్
గద్యాణంబుల బూజకై యొసగ శృంగాద్రిన్ నిరూపింతురా
విద్యామూర్తి సమాధి యెచ్చటను గన్పిందాచు గన్పింపదే
విద్యోతంబతఁ డొందెనో పరశివావిష్కార సంసర్గమున్. 1

చారూత్సేధ శిలాత్త భిత్తికలు నుత్సాహంబు కల్పింప, వి
ద్యారణ్యాలయ మియ్యదేయనగ, భక్త్యారూఢుఁడై చొచ్చి, వి
ద్యారణ్యు సమాధి యేదనెడు, పాంథప్రశ్నకున్ మాఱుగా
నేరున్ జెప్ప రదేమి మౌనమొకొ, మిన్నేయూడిపడ్డట్లుగన్. 2

అల బిజాపురబృందగోకులమె, నెలవు
మునిసమాధికి! దర్శించు ధన్యులెవరో?
వేదభాష్యాదులున్ బంప వెలయుదాఁక
తద్జ్ఞ హృదయంబుల, సమాధి దనరు, యోగ
చంద్రమౌళి! యా మాధవాచార్య హేళి! 3

అనునెడ బ్రహ్మేంద్రునిగని,
వినయంబున వటువు లార్య! విపుల ముదము మా
కును జేకూరెను, మీరిఁక
వినిపింపుఁడు వారిభావ వివృతిని గొంతన్. 4

అని వేఁడియు సంధ్యావం
దనమును వేదంబెకాన, దద్విధియు, విశే
ష నియమము ల్వీన వేడుక
లనియన్ వచియింప యతియు ననె నీరీతిన్. 5

జీవన్ముక్త శ్రేణిని
భావింపఁగ ప్రథమపంక్తివాఁడౌ కానన్
"జీవన్ముక్తి వివేకము"
పావనమగు సతనిబుద్ధ, బయలన్ బెట్టెన్. 6

తత్త్వజ్ఞాన, మనఃక్షయ,
విత్తోన్నత సత్క్రియా ప్రవీణతలన్, దు
స్తాత్త్విక వాసన లుడుగగ,
సత్త్వంబున నిల్చు నాత్మ సహజంబనుచున్. 7

నిత్య ధ్యానపరాయణు
నాత్యంతిక భక్తి భావనారూఢత, స
త్ప్రత్యయరతి, హృదయాంత
స్సత్యంబును, వెలుఁగజేయు సతతం బనుచున్. 8

నల రామ యుధిష్ఠిరు
లల వాసన లణఁగద్రొక్కరైరి, కనుకనే

యలయికను నటించిరి; మన
సులు, వాసనలు జావ, శుద్ధములనుచున్. 9

గీతయు నుడివిన భక్తుఁడు,
చేత స్వాత్మైక్య మడరు సిద్ధుఁడు, నియమో
పేతుఁడు, హఠయోగీంద్రుఁడు,
బ్రాఁతిగ నిష్కామకర్మి, పరికింపంగన్. 10

ఒకటియనియు, నమనస్కత,
తకగ రుడగు నుత్తమ స్థితప్రజ్ఞ యొకఁడై యా,
నకలంకంబుగ, ననుచున్
బ్రకటించెను, హంపియోగిరాజేశ్వరుఁడున్. 11

నిగమాగమ శాస్త్రజ్ఞుఁడు,
సుగతాదిక వివిధసమయ సూక్ష్మవిదుండున్
ప్రగతి మతాదర్శచణుఁడు
నగు నాతని వాక్కు లర్థమగుఁ దజ్ఞులకే. 12

వర పరమహంస తానై
పరమము విద్వద్యతిత్వ పటిమకుఁ దెరువున్,
గురుతుల, విద్యారణ్యుం
డరుదగు ననుభూతివెలయు, నాడేన్, కృతులన్. 13

అని బ్రహ్మేంద్రుఁడు ఘనుఁడీ
చిన మాటల, జిన్నవారి చిత్తము లలరన్,
మనికిత ముడుగఁగ గురియిం
చెను, సంధ్యావందనార్థ శీధువు లిటులన్. 14

## సంధ్యావందనానువాదము.

ఓం హరిః యని, మొదలిడి యుర్వీఁ జనుఁడు
మాన కెట్టి దుస్థితిలోననైన, మఱియు
నపరిశుద్ధుఁడైనను, శుద్ధుఁడైనగాని
విమలుఁడగును బాహ్యాంతరముల, బరము
పుండరీకాక్షు సంస్మృతి బూనెనేని. 15

హరిని స్మరియించి, యాపైన, నంబువులను
కేశవాఖ్యు నారాయణు నీశు మాధ
వుని దలంచుచు, ముమ్మారు, వినతిచేసి
యాచమించి, యిర్వాదినాళ్లు, నాహ్వాయముల
నర్థయుక్తముగా, భక్తి ననగవలయు. 16

నిరవధిక సుఖాత్మనిరత త్రిమూర్తియౌ
కేశవునకుఁ దొల్త, గేలుమోడ్చి
జ్ఞాన సర్వస్వ ప్రసారాధి నేతయౌ
నారాయణునకు, వందనమొనర్చి
సర్వజీవాధార సారశక్తివహించు
మాధవునకును, నమస్కరించి
గీర్వాణవేద్య ముక్తిప్రభుండును మహీ
ధరుఁడు గోవిందు నుత్తముని గొల్చి
సకల చరాచర జగతి నిండియు, లోన
వెల్పట వెల్గెడు విష్ణు నెఱిగి
జ్ఞానపరియుక్త నిష్కామకర్మికి వలచు
మధుసూదనునకు, నమస్కరించి

ముల్లోకములు నిండి మురియనివేల్పు త్రి
విక్రమమూర్తికి, వ్రేళ్ళు జేర్చి
అణువుల నణురూపి యఖిల శివప్రదుఁ
డగు వామనునకు, నంజలి యని
సర్వ భవైశ్వర్య సంస్థాయపదుఁడైన
శ్రీధరునకు భక్తి, జేతులెత్తి
ఇంద్రియంబులకెల్ల నేలికమై హృదిఁ
దనరు హృషీకేశు, దయను గోరి
సకలసృష్టివిశేష శక్తిమూలుండగు
పద్మనాభుని దేవు, బ్రస్తుతించి
తన కుక్షిలో జగత్త్రయము డాచియు నేచు
దామోదరునకు, వందనము సల్పి
అఖిల జీవాకర్షణానంతశయునకు,
సంకర్షణునకు, నంజలి ఘటించి
భూతౌఘములనెల్ల నాతతవాసియౌ
వాసుదేవుని హృన్నివాసు, గొల్చి
అనుపహతవిభూతి యనుపమతేజస్సు
వెలయు ప్రద్యుమ్నుని, వెలుగు నెన్ని
పరమస్వతంత్రుఁడై బద్ధుఁడు కానట్టి
యనిరుద్ధు నంఘ్రులయందు, వ్రాలి
అక్షరాక్షర తత్త్వముల కతీతుండైన
పురుషోత్తమునిమీఁద, బుద్ధి నిల్పి
ప్రత్యఙ్ముఖేంద్రియ ప్రసృతి కందనివాని
కి, నధోక్షజునకును, గేలు మోడ్చి

శిష్టరక్షణ దుష్టశిక్షణ క్షముఁడైన
నరసింహునకు, వందనములఁ జెప్పి
నాశనరహితుఁడై, నలువకు దండ్రియు
నైన యచ్యుతుని, సుజ్ఞాన మొరసి
భవహరణుం డఘవనదావ దహనుండు
నగు జనార్దనుని, సహాయ మెనసి
వర గరుత్మద్దివ్యవాహనుఁడు, నమూహ్య
విభవుఁ డుపేంద్రుని, వినుతి సల్పి
దనుజ కిల్బిషతండ దండనక్షముఁ డస
త్య ధ్వంసి, హరికి, వందనము జేసి,
జీవుల కానంద శీకరాబ్ధియగు, ను
త్కృష్టుని, గృష్ణు, జక్రిఁ భజించి

యల జతుర్వింశతి శుభాహ్వయముల, విభుని
మరఁగి, మేరుపృష్ఠమ్ము, కూర్మస్థమైన
ధరణికి, నముచితాసన ధరణి, కెరగి
భూతములు బిశాచము లేగ, జేతు లూపి
పీతవై రుండు సంధ్యలో వెలుఁగుజూచు. 17

ఆ పరబ్రహ్మ నిగదితం బమరము, బర
మాత్మ, దైవతంబయి, సతం బమరునట్టి,
ప్రణవమంత్రార్థ చింతనారాధనలకు
కడఁగు సుమతి, ప్రాణాయామ కలితుఁడగుచు. 18

స్వర్భూర్భువర్మహాజన తపస్సత్య లో
కంబు లెవ్వాని యాకారమంత్రము

జన మనః ప్రేరకాక్రాంత సృష్టి స్థితుల్
ఘనశక్తు లెవని యాకారమంద్రు
మధురామ్లసోమ సమ్మాన్య రసాదులు
నీరంబు లెవని యాకారమండ్రు
విమలపానీయంబు లమృతంబునర్ దివ్య
కాంతులు నెవని యాకారమంద్రు

ఆది నోంకృతి యెవ్వనియందు వొడమె
నట్టి, నిరుపమానుఁడు, పరమాత్మ దలచి
యతని, నిస్తుల తేజంబు నాకళించి,
ధ్యాన మొనరింపవలయు, స్వీయాత్మయందు. 19

అల మహావిష్ణు నాజ్ఞచే, గలిగినట్టి
యబ్జభవు దివస ద్వితీయార్థమందు
సిత వరాహకల్ప సంశ్రితమునైన
యట్టి మనువు, వైవస్వతు నంతరమున. 20

మేరుగిరికి దక్షిణమున, సార భార
తావని, గలియుగాది, నిత్యప్రయుక్త
కాల దేశస్థితుల నిట్టు లోలి నుడివి
దేవ సంప్రీతికొఱకు, ప్రార్థింపవలయు. 21

ఆపయిన నుదయంబె, శుద్ధాంతరంగుఁ
డగుచు దెచ్చిన యుదకంబు లర్థిబట్టి
యవియు విష్ణు నివాసంబులగుట, దెలిసి,
వినుతితోడ, నోడల జల్లుకొనగవలయు,
తజ్జలాభిమంత్రిణ మిట్లు దనదుచుండ. 22

## జ లా భి మం త్ర ణ ము.

"పొసగు సమస్త సౌఖ్యములు, బుణ్యజలంబులయందు, మీరు మా
కొసగుఁడు శాశ్వతాన్నము, ముదోదయ దివ్య వివేక సంపదల్
రసవిసరంబు లీరును, గరంబు శివప్రదరూపులౌచు, మా
కెసక మెసంగ, యోగ్యవిధి నేచు రసంబు లిహాన, బంచుడీ. 23

తల్లి యెటు ల్స్వశాబ కవితానము వృద్ధిగోరి, య
ల్లల్లన జేరి స్తన్యమిడి, యంచితరీతిని బ్రేమజూపు న
ట్లుల్లము జల్లగాదనర, నోపిక నిండు రసంబు, దుష్టియుక్
జల్లని మిమ్ము మాపయిన జల్లిన, పాపములుక్ క్షయించెడుక్. 24

కలుషోత్పాటన భవ్యము
లలఘుత సంప్రోక్షితంబులై నదిమొద లో
సలిలంబులార! మాకిం
డలయని సంతానసత్త, నతివేగముగక్. 25

నిత్యయజ్ఞంబుకొఱకు, పానీయములకు,
రుజలు శమియించుటకు, గార్య విజయములకు,
మీరు తోడ్పడి, సుఖముల మివులనిండు
లలిని సుస్రవంతులయి, జలంబులార! 26

ఉదకముల బండు పంటల కుర్విబతులు
మనుజు లావాసములకును, మనుగడకును
బహుళ మాధార మీర లాపస్సులార!
ప్రీతి నర్థింతు మివ్వఁడు భేషజముల. 27

అంబువుల యంతరమున, విశ్వంబు బ్రోచు
నౌషధంబులు, నగ్నియు, నలరుచుండు

చాలకాలంబు, రవి జూడజాలు బలము,
స్వతనువుల, రుజల్బాపు భేషజము లిందు
(శిష్టుఁడగు సోమఋషి వచించె దీని). 28

దురిత మేదేని నాయందు నొరసియున్న
ద్రోహ మేదేని నాచేత దొరలియున్న
శాప మనృతంబు దొఱఁగ నాచరితము లవి
మీ ప్రవాహంబులో, బోవు, మిళితములుగ. 29

ఈదినంబున మీలోన నీఁదినంత
మేను నాయది, మీతోడ మేళగించి
నాడ! మీయందు నెప్పుడు గూడు వహ్ని
చయ్యనర్క జేయు, నన్ను వర్చస్విగాగ. 30

యాజ్ఞవల్క్యుండు వాక్రానినటుల, నన్ను
వహ్ని, క్రోదాభిమాన దేవతయు, గ్రోధ
నిగళ కిల్బిషానేహస్సు నెరఫునట్టి
సేగి జిక్కగనీక, రక్షింత్రుగాత!" 31

అని జలంబుల మంత్రించి యంబువులను
దేహమున శిరసాది సంధించి, చల్లి
యవల, వసఘుత బొల్చి, నీలాంబరమున
నెఱయు సూర్యుని, మనసులో నిండజేసి. 32

"అరసి యరయకగల్గె, గతాహ్నానిశల
నస్మదీయ మనోవాక్క రాంఘ్రి కుక్షి
శిశ్న రచితాఘములవి, నశింపజేసి,
శ్రితజనావనుఁడు, రవి, రక్షించుగాత! 33

ఇతర దురితముల్, మత్కృత మెవ్వియేని
నున్నవాని, దత్కర్తయౌ నన్ను, నచ్యు
తము, జగత్కారణము, నపేత త్రికాల
భేదమౌ, స్వయంప్రభయందు, వేల్చువాఁడ. 34

అనుచుఁ దలచి యనంతరం బఘము లుడుప
ఋషివరుం డఘమర్షణుం డేవి నుడివె
భావవృతుఁడు దేవతగాఁగ, బాప పురుష
జలవిసర్జనార్థం బవి, పల్కవలయు
ఋక్కు లఘమర్షణ చణంబు లిద్ధములను. 35

"ఎల్ల నెలవుల నెలకొని యెపుడు వెలుఁగు
తత్పరబ్రహ్మలో బుట్టె తపము; దాన
సత్యసంకల్ప మొదవె, దత్సమయ సత్య
వాక్కు నుదయించె, నం దర్ణవంబుఁ బొడమె. 36

ఉదధిగూడియు సమలను బొదివి యెదుగ
నపు డహోరాత్రములు పుట్టె, నపుడ, నిమిష
మాదికాలస్వరూప ముత్పాద్యమయ్యె,
పరముఁడే ప్రాణతతికెల్ల ప్రభువనయ్యె. 37

కలిగించెన్ రవిచంద్రుల
గలిగించెను నంతరిక్ష కమనీయములై
వెలసెడు, స్వర్భూముఖముల,
గలిగించెన్ మానవాభిగమ్యము లెల్లన్" 38

అనుచున్ దోసిలి నీళ్ళను
మును పొనరించిన యఘాలి మొదలంట జెడన్

మన సెక్కుడి, నై ఋతి ది
క్కునకున్, విడువంగ, మలినకోటియు విడుచున్. 39

నిత్యము బశ్చాత్తాపము
సత్యముగా గలిగి యెవఁడు సల్పును సలిల
ప్రత్యయ మీవిధినిన్, గృత
కృత్యుండగు నతఁడు, శీలకోవిదుఁడై నన్. 40

అ ర్ఘ్య ము.

ప్రణవమునకు, పరబ్రహ్మ, పరగు ఋషిగ
దైవ మాపరమాత్మయై తనరు, ఛంద
మమరు గాయత్రి ; సవితయు నాకృతిగను,
అర్ఘ్యమిడి, జపమున నరుం డలరవలయు
నీ నియమము, విశ్వామిత్రుఁ డానర జెప్పె. 41

గా య త్రీ ప్రా ర్థ నా ను వా ద ము

విలసిల్లి వేదమాతగ
వెలయున్ గాయత్రి శాంతి విలసిత ; జగతిన్
గల యెల్ల మతంబుల
సలలిత తత్త్వార్థసార సత్యము తానై. 42

"ప్రేరణము సేయుగాత వరేణ్య సవిత
భూర్భువస్సువరాదుల బూర్ణమాచు
రసము నమృత మాపోజ్యోతి నెసఁగు, బ్రహ్మ
ముత్తమోద్దీప్తి, నాహృది నుదయమంది.43

ఓం కృతియె బ్రహ్మ మొక్క యక్షరమున
ధన్యుఁ డగ్ని వెలుఁగు దదధిపతిగ

ఋషి యజుండు, ఛందరీతి గాయత్రియా,
దైవము పరమాత్మ తనరు నెప్డు. 44

గాయత్రీ! వరదా! ర
మ్యామ్నాయమ్మ శ్రుతిప్రమాణ బుద్ధమ్మగు, స
త్యాయత సుజ్ఞానము నిడి,
మాయావృతబుద్ధి నఘము, మాపుము తల్లీ. 45

పగలు సేసిన వృజినంబు పగలె పోవు
రాత్రి నొదవిన పాపంబు రాత్రి తొలఁగు
సంస్మృతిఁ సర్వవర్ణాత్మ! సాంధ్యవిద్య
వీవెగా! సరస్వతి! మాకు నీవె శుభము! 46

ఓజస్సు దార్ఢ్యంబు నోర్పు తేజోబల
మహిమలు, దేవధామంబు నీవ!
విశ్వంబు తద్గత విశ్వాయువును, చరా
చర సమస్తంబు, నస్త్రాంత మీవ!
జగముల నునికికిఁ దగునాశ్రయం బతీ
తమును, గీడుల బాపు దార్ఢ్య మీవ!
ప్రణవార్థ నిష్పాద్య పరమాత్మ నాకృతి
వీవె గాయత్రివి! యెఱుక వీవె!

దివ్య సావిత్రియు, సరస్వతియును, ఋషులు,
ఛందమును నీవె! నీజ్యోతి, సరసఁజేర్చి
బలము, నాయుస్సు, తేజంబు, ప్రజ్ఞ నొసఁగ
స్వాగతంబిదె, శ్రీదేవి! యాగమింపు! 47

అగ్ని వక్త్రంబుగ, నజుఁడు శిరంబుగ,
హరి హృదయంబుగ, హరుఁడు శిఖగ,
అవని యోనిగను, ప్రాణాపానముల్ వ్యాన
ము, నుదానము, సమానములుగ, బొల్చు
నసువులె, లావణ్యమైయొప్ప, ధవళ తే
జాదుల, ఋగ్యజుస్సామ వేద
పాద త్రితయ వాచు, వరలి, షట్కుక్షులు,
వ్యాకృతి శిక్ష కల్పము నిరుక్తి

జ్యోతిషములె శీర్షములుగ నమరి, యీవ
వ్యాప్తవైయుంటి వీ విశ్వమందు, నెపుడు
తల్లి! గాయత్రి! నిన్ను నాత్మను, వహించి
ధ్యానమొనరింతు, నీదివ్యతత్త్వ మెనసి. 48

బ్రహ్మ రమేశ శివజ్ఞాన సత్యాది
రూప నామముల నారూఢవగుదు,
వాస్యాబ్జముల వెల్గు నద్భుత ముక్తాప్ర
వాళ హేమ వినీల భాను రుచులు,
శంఖ కపాలాంకుశ, గదాంబురుహ చక్ర
కశల, నభయదాన కరుణ లెసఁగు,
నీ రత్నమకుటాన నూరు నమృతము, సు
ధాకర బింబంబు దాల్తు వీవు!

నీదు రమ్యహస్తముల నామోద భరిత
వరద, దివ్యకుశేశయద్వంద్వ మమరు!

నట్టి ముక్కున్ను, దల్లి నిన్నాత్మ నిల్పి
కలిత తత్త్వార్థ వర్ణ, నిన్ గొలుతు నియతి. 49

సద్ధర్మ గోచరములగు
బుద్ధుల బ్రేరించుచుండు, మొదలిటి తేజం
బిద్ధం బే దేవి యెడన్
దద్ధన్యను, నిన్ను గొల్చెదను, గాయత్రీ ! 50

నిన్ గీర్తించెడు గాయకు
లన్ గాపాడుదువు ! నీ విలసిత ప్రఖ్యా
తిన్ గొనెదను, గాయత్రీ !
నన్ గావు మనంతదుఃఖనాశిని ! దేవీ ! " 51

వహ్ని ప్రార్థనము.

జ్ఞాన ప్రదాతయై జానొందు వహ్నియు
సోమవల్లిని బిండ సాగియుగాత
సర్వజ్ఞుఁడౌ నగ్ని, సఖుఁడయి, మా యరా
తుల, దహించి, శుభంబు నిలుపుగాత
వీతిహోత్రుండు, మా విపదల నుడిగించి
కష్టాబ్ధి దరణియై, కాచుగాత
దేవతాస్తుతులచే, భావి రుజాపనో
దనమయి, సౌఖ్యమ్ము దనరుగాత !
మా కొడుకులకు, నెల్ల క్షేమమ్ముగాత !
అందరి కరిష్టవారణ మగునుగాత !
అఖిల భృత్యుల కారోగ్య మలరుగాత !
మా పశుగణంబులకు, సుఖం బమరుగాత ! 52

సకల దేవతా ప్రార్థనము.

పూర్వాశ నధినాథ భూతి వహించు, ను
 త్తమ దేవతలకు, వందనము లివియె!
దక్షిణ కకుబంత మక్షయంబుగ నేలు
 నాకముఖ్యులకు, వందనము లివియె!
పశ్చిమదిశయందు ప్రబలురై, పరగు, గీ
 ర్వాణు లెల్లరకు, వందనము లివియె!
ఉత్తర దిక్సీమ నొఱపుసూపుచు దీప్తిఁ
 గను దేవతలకు, వందనము లివియె!
ఊర్ధ్వ దిగ్వాసులై, యుర్విని బ్రోచెడు
 తత్త్వేశ్వరులకు, వందనము లివ్వె!
అహిముఖాకారులై, యమరి, యధోదిశ
 మనుచు, సురులకు, వందనము లివ్వె!
రోదోంతరంబున రోచిష్ణులై, యొప్పు,
 ఘన దివిజులకు, వందనము లివ్వె!
యమునా త్రిదశ దీక్షికాంతస్సురమునుల్, చి
 రంజీవితం బీయ, నంజలు లివె!

కామ మన్యువులను గూర్చి, కరము మోద్దు
నేలయు, జలంబు, వహ్నియు, గాలి, మిన్ను
ననెడు పంచభూతములకు, నాద్యుఁడైన
వాసుదేవునకు, నొనర్తు, వందనంబు! 53

తొలిమిసుకుల గనినై, యా
యలఘు శుభప్రవర్తనాధారవునై

వెలుగుదు, ద్విజన్మవయి, నిఁ
గొలిచెద, నాయువు ధనంబు గోరితి, జననీ. 54

(వరదయును వేదమాతయు
బరికీర్తితయుఁ, ద్విజాత, పావనివై, స
న్నురుధన మాయువు వర్చ
స్సొరయఁగ, గాయత్రిదేవి, యోము సతతముఁ).

మేరూపరి శృంగాటక
శ్రీరాజిత సౌధసీమ, జేర నరుగుమా!
సార స్తవముల, విని, సు
స్మేర దయాస్ఫూర్తి! శీలమిత! గాయత్రీ! 55

కనబడు, భూతము లెల్లను
మను నెందా దేవి, జంగమస్థావర జీ
వనకారిణి, సంధ్యను, ప్రా
ద్దున, సాయంత్రమును, మొక్కుదుము, సద్భక్తిఁ. 56

బ్రహ్మణ్యుండౌ, విష్ణువు
బ్రహ్మణ్యుం డచ్యుతుండు; పక్షిధ్వజుఁడుఁ
బ్రహ్మణ్యు, దేవకీసుతు,
బ్రాహ్మణ గోరక్షణాఢ్యు, భవహరుని, హరిఁ. 57

దేవగణైక శరణ్యుని,
భూవలయ హితప్రపుణ్య పూర్ణు, వరేణ్యుఁ
గోవిందుని, శ్రీకృష్ణుని,
శ్రీవారిజపత్రనేత్రు, సేవింతు మదిఁ. 58

ఆకాశపతిత తోయము
లేకంబయి, వనధిఁజేరు, నెట్టు లటులె, నా
కౌకసు లేరికి మ్రొక్కిన,
ప్రాకట మానతులు జెందు పరుఁ గేశవునిన్. 59

పలురూపులును గల్గి, పలుకన్నులును వెల్గ
పలుపాదములతోడ, వరలువాఁడు
పలుపేరులను దాల్చి, కలకాలము నెసంగి
శాశ్వత పురుషుఁడౌ, సరణివాఁడు
పలుతలల్, తొడలును, బాహువుల్ భాసిల్ల
నాది మధ్యాపేతుఁ డైనవాఁడు,
అఖిలభూత జగత్తు లందు వసించుచు
వాసుదేవుం డన బరగువాఁడు

సర్వనాథుఁ డనంతుండు! సారతమము,
నిండి నిఖిలంబు, వర్ధిల్ల నిబిడమైన,
సచ్చిదానంద జలధిలో, స్నాతనగుచు,
కోటి యుగధారి, పాదము ల్గొలుచువాఁడ. 60

శివుఁడే విష్ణుని రూపము,
శివహృదయమె విష్ణు వరయ, శ్రీవల్లభుఁడున్
శివమయుఁ డౌ, హరిహరులకు
దవులదు భేదంబు, వారి దలఁతున్, భక్తిన్. 61

క్షీర స్నాపిత, దేవిని,
సారార్ద్ర సుగంధ లేప సంకలితను, బి

లోవ్వారు దళార్చిత, దుర్గా
సారసముఖి పాదయుగము, శరణము జొత్తుఁ. 62

తల్లిదండ్రులవోలె దనరు, ద్యావా భూమి
        తలములా! వినుఁడు సత్యశ్రుతులను!
జీవనౌషధ సుఖశ్రేయదం బన్నంబు,
        మాకు బ్రసాదించి మనుపుఁ డీరు!
రక్షణాసక్త శుభేక్షణులయి, దేవ
        హితులయి, యెఱుక మా కివ్వుఁ డీరు!
సకలవేద శుభాలి, సర్వతీర్థ ఫలాలి,
        నెపుడు జనార్దనుం డిడెడు గాత!

వేదములకు, వహ్నికిని, బృథ్వికి, ధిషణున
కోషధులకును, వాక్పురుషోత్తములకు,
మా యరిష్టములోవ్వాయి, సమ్మదము లొదవ,
స్థిరమతిని, నమస్కృతుల్ సేయువాఁడ! 63

ఇద్ధసూక్తుల వంద్యులౌ, ఋషివరులకు,
ఘనతపంబుల బొదలు, సన్మునీశ్వరులకు,
మాతృవులకు, బితరులకు, మాన్యయశులు
సర్వులకు, నమస్కృతులను, సలుపువాఁడ. 64

సూ ర్య ప్రా ర్థ న ము.

సత్యాత్మ సుక్షేత్రి సరణి వర్తించుచు
        నిఖిలంబు దనయందు నెగడువాఁడు
అర్యముండై వియదంతరంబున, శుభ్రి
        ధవళాసనంబున, దనరువాఁడు

అమరుల హోతవై యజ్ఞవేదికయందు
నగ్నిరూపంబున నలరువాఁడు
అతిథితుల్యుండు, గృహంబున వైశ్వాన
రుండయి, నరులలో నుండువాఁడు

ఓషధులనంగ, నగముల, నొనరువాఁడు
భోక్తవై, జన్నములయందు, బొడమువాఁడు
నిరత మెందు, సాక్షాత్కృతి నెఱయువాఁడు
పద్మమిత్రుఁడా, మిత్రుని, పదముఁ దలఁతు. 65

వఱువాయిసంజెల, వరుస, గల్పించుచు
వ్యవహారముల, మూలమగుదు వీవ!
ధ్యానాకృతివహించి, జ్ఞానులలో నిండి
యజ్ఞ ముత్పాదించు నర్కుఁ డీవ!
అనిశ మంతర్యామివై హృద్విహాయస
మును వెలిగించుచు, మొనయు దీవ!
మా కగోచరుఁడవై, మానుగ బయసుల
గోవుల వసియింతు వీవ దేవ!

ఋగ్యజుస్సామ వేదసంహితలు నీవ!
లోక సృష్టి స్థితి లయాలు, నీ కృతములు!
మూఁడు గొనముల నిండి, మమ్ములను మనుపు!
భూరి కరుణాలవాల! నమో నమోస్తు! 66

ఋతము బ్రహ్మం బంతరిక్షములో హంస
శుచిషత్తు వసువునై, రుచులఁ దాల్చి

హోతయు, వేదిష త్తుత్తమ స్థానంబు,
నతిథి, గృహస్థంబు, నంబుజములు
ఋతషత్తును, నృషత్తు, ఋతజంబు, నద్రిజం
బయి సవితగ జుట్టి, యంధకార,
లోకము వెలిగించి, నాకుల నరులను,
స్వస్థానముల నిల్పి, స్వర్ణరథము
నెక్కి భువనముల్ పరికించు చెల్ల మెఱుఁగు
సూర్యకిరణాలు, విశ్వంబు చూచుకొఱకె
యూర్ధ్వగములయ్యె! తారలు నుఱికె, రాత్రి
తోడ చోరులగతినె; దొంతులుగ, మెఱయు
నగ్నులై, రశ్ములు, జనాలి నరయు నెపుడు. 67

పావకుండవు, వెల్గువై నీ వహోరాత్రి
ముల, సృష్టిజేతువు ముఖ్య సురుల
జ్యోతి రూపులలోన, జాతుము నీవ్యాప్తి
తమసంబుపై బొల్చి, స్థావరములు
జంగమముల కాత్మసాగణి, వర్తింతువు
దురితనివారక వరుణుఁ డీవ!
హృద్రుజ బాపి యర్పింపుము, హరితకాం
తుల, హారిదళ, శుకములకు, మిత్ర!
విశ్వబలయుతుండవయి, విద్వేషిజనుల
జంపి, మిత్రావరుణుల, సుసన్నిధి గని
సకలకృతుల, నుపహరించు, స్వామి వీవు!
మమ్ము నిష్పాపులను జేయు మంబుజాప్త. 68

పడాడు బాబాల నేగుచుండెదు, శీఘ్రి
మై నేమి విభ్రమ మగ్గలింప
తరణివై, ప్రేక్షక దర్శనీయుండవై
రోదసి విహరింతు, రుచులు నింప
నల మరుద్దేవత లలర, మానవులపై
దయ శుభారోగ్యాతిశయము బెంప
రోగజమ్మగు, హరిత రుచివోయి, నీ కృప
జిల్క గోరింకల, చెల్వు పెంప,

నరుగు దంధకారముపైని, యధ్వమందు,
సురులతోగూడి, జిగిమీఱి, సొబగు మిగిలి,
జాలువారు వేవెలుఁగ ! తేజమ్మునిమ్మ !
నిర్యదుజ్జ్యోతి వై భవధుర్య ! సూర్య !

69

ఊర్ధ్వదిక్కున కెక్కు నుడుకురోచులు, బాహ్య
బాహ్యాంతర, రుజార్తభరము, సూర్య !
శుభ్రకరంబయి, శుగ్విమోచకమగు,
నీవెల్గు, గొనియాడ నేర్పు, హేళి !
భూమ్యాంతరిక్షమ్ము లోముచు, విహరించు
నీరశ్మి, శ్రేయముల్ నెఱపు హంస !
లలిత శోచిష్కేశములగు, సప్తాశ్వముల్
కడఁగి భూతార్తుల, నడచు, మిత్ర !

వైరుల సమస్తబలుఁడవై వధయొనర్తు
వింక నాకేల రిపులతో నెడరుగల్గు ?

ఉదయమందితి వడలును, నుడిగె నిపుడు
ద్వేషబుద్ధియు లేదయ్యె, దేవదేవ! 70
ఉదయముననుండి యేకష్ట మరయనీక,
సుఖదకర! సప్త హరిదశ్వ! శోభిలుదువు,
తద్ధిత మదితియు, బయోధి, ధరణి యంత
రిక్ష, వరుణ మిత్రు లనుసరింత్రుగాక! 71

పర్యవసానము.

ప్రకృతి సహజాతబుద్ధిచే, బరగినట్టి
కాయ వాఙ్మనసేంద్రియ, కర్మ లేను,
కృత్స్న జగదభిగమ్యుఁ డుత్కృష్టుఁడైన,
ప్రభువు, నారాయణునకు నర్పణము జేతు. 72

మాని బ్రహ్మేంద్రుం డిటు,
దానేర్చినయట్లు, మదికి దాకఁగ నుడువన్,
మానని తమకముతో, విని
యానతిని గొని, చిమణాజి, యన్నను జేరెన్. 73

చేరినది మొదలుకొని, స
ర్దారుల సైన్యపతు లందరన్ బురికొల్పన్
వారలలో, 'కాన్హోజీ'
కేరుచు, నియ్యకొనె, బుడుతకీచుల నలుపన్. 74

ఆతని కది సాధ్యము, కా
దాతత ధైర్యంబు లేమియని, బాజీ రా
ట్టే, తనసేన, "గులాబా"
భూతలమున విడిసి, పోరి, పొందె జయంబున్. 75

అటుపై, రిపులన్ గదుముచు
చటుల పరాక్రమము మెఱయ జయ్యానజని యా
కుటిలుర, "ఘోడా బందరు"
పటుదుర్గము నాక్రమించి, ప్రభుత దలిర్చెన్. 76

అంతట బోకయ, 'ఠాణా'
నంతయు, దన వశముగాగ, నరుల నణప, వా
రంతకు విడిదిన్ జేరిరి,
కొంతయొ, యుద్ధంబు మిగిలి కోల్హ్యానుతటిలో. 77

మాళవము పయి, "నిజాముల్"
దాలిమి సెడ, ఢిల్లియాజ్ఞ దాడి వెడలఁగా
నాలించిన, బాజీప్రభు
వాలంబును సేయ, నటకు నరిగెను వేగన్. 78

చిమణాజి కర్జ మెదియని
సమరము సాగించు తలపె, సరియని యనగా
క్రమముగ "సాష్టి మ
హిమస్పురి, తారాపురంబు" లేత్తెర, బట్టెన్. 79

ఒక నూరు నౌకలు, రిపు
ప్రకరములున్ నాశమొంద, పాశ్చాత్యభటుల్
మకు రేదిరి, పిదప, "బసా
యికి" జిమణాజియును ముట్టి, యూఁగక దివిరెన్. 80

గాటమరుల బరిమార్చియు,
పోటరులై, పోరు సలిపి, పారపోవగ, దా

నేటు వడును సేనయు, నని,
యోటొరయని యట్టితీరు, యోజించి వెసన్. 81

నడుము బిగించి, ఖడ్గము రయంబుగ, ముందుకుదూసి, డాయు న
క్కడి సరదారులన్, బిలిచి, గట్టిగ "నేనొకఁడే, యరివ్రజం
బడలగగొట్టి వత్తు నిక నన్నము నీళుల ముట్టకుందు, నన్
దడయకుఁ డీసారంగమును దాటియె, పోయెద గోటలోనికిన్". 82

అని, భీషణ వేషుండై,
యనికిన్, జను సచివు నరసి, యత్యుద్రేకం
బున, సేనానులును, దదే
కనియతి, భండనముజొచ్చి, కర్కశఘణితిన్. 83

రిపుల బొరి గొనిరి, తెమ్మెర
తెపతెప లొరయన్, మరాటతేనిది, జండా
నపుడే, యెక్కించిరి, పం
దెపు దుర్గము, లోబడంగ, డీకొని, వారల్. 84

వేరము తేకువల్దొలగి, వీపును జూపుచు, పోర్చుగీసు లే
దారియు గానలేక, విగతప్రమదుల్, చిమణాజి యంఘ్రులన్
జేరి, శరణ్యమన్న విని, చిత్తము జల్లగనూని మీర లీ
తీరున దుష్ప్రవర్తనకు, దిమ్మన బొల్పడి, యేబదారువేల్
ధీరులు చావగా నిపుడు దెప్పరిలన్ గనువిచ్చు టయ్యెనే? 85

అని వారల నదలించుచు,
ధన కనకాదులను గొనెదు తటి, ఖలమతులై,
యనుపమ రూపవతిని, యా
వనవతి, దుర్గేశు కూతు, వనజాతాస్యన్. 86

విమతులు నుపాయనంబని,
తమయంతఁ, దెచ్చి యెదుట దార్చిన, గనుచుఁ
చిమణాజియు, నవ్వి, "కటా!
భ్రమియింతునె? నేను బడుచువాఁడనె చెపుడా!" 87

అని యా ముగుదను, "గల నిజ
మును వివరింపంగవలయు, మున్నుగ నీ వి
య్యానువున" నని పృచ్ఛింపఁగ
కనుకని యక్కన్నె నొడివె కలరూ పంతఁ. 88

తనతండ్రియె, దుర్గేశుఁడు
చనిపోవఁ దురమునందు, సన్నిహితుండై,
తన యందకాడు జిక్కుట,
తనగురువుల బోధవలన దన్నంపుటయుఁ. 89

విని యా సుశ్రోణికి
మును సిగ్గును బాపినట్టి, పూవిలుకానిఁ
గని, కై దుడిగించియు
గానిరండని భటులబంచి, కోవిదుఁ డనియెఁ. 90

ఆబాల్యంబును బార్వతీప, పద పద్మారాధనఁ జొక్కి, నే
నేబై యేండ్ల కుమారుఁ డీయువతితో, నేబంధుబంధంబుతో
నేబాసంచు సుఖింపగల్గుదు నవిచ్ఛిన్నానురాగుండనై
దేబల్ మీర లిటేల దెచ్చితిరి బందీభూత నీసుందరిఁ. 91

అంచు రిపుల దండించియు, నాడె నిటుల
"ప్రాణ సంరక్షణము పొందె, రాచరికము
ధనము మణులను విడువఁగా దగునుగాక,

పగతురె బలాత్కరింపని ముగుద నిడుట
న్యాయమైన, బ్రిదిమికై యుపాయ మగునె? 92

పరమత స్త్రీల భంగించు దురుసు తులువ
పల్లవికుల మెచ్చగ మీకె యలవియగును!
మతము విస్మృతిజేయించు మమత కకట
గమ్యములె దుష్టవృత్తు లాస్కందనములు?
మతము సుమతుల, కదియు దుర్మతుల కేల?" 93

ఒకటియు రెండె! లెక్కిడుట కోపిక యెవ్వనికబ్బు? ఆసుర
ప్రకటిత ఘోరదుష్క్రియ లపారముగా బొనరించి తీరు, మి
మ్మొకరొకరుగా ముసల్మనులు నుద్ధతిజూపని హైందవు ల్సదా
కటు కుటిలాత్ము లందురు, నికారణ కారణులైతి రెందునన్. 94

"స్వోరుఖండము మాంస మురుదయ నసిగోసి
యొసగిన శిబిభూపుఁ డెసఁగె నిచట
శ్రితులకై దేహంబు జేతులారఁగ భిక్ష
మిడిన విద్యాధరుం డేలె నిచట
ఎఱిగియు నీవి వెన్నెముక బంచిన దధీ
చియును, జిరతపంబు జేసె నిచట
శత్రువుల్ బ్రదుకంగ జనువిచ్చు నెఱదాత
బలి తండ్రి యుసురుల బాసె నిచట

ఈశ్వరాజ్ఞతో, దరలిన "ఈశకృష్ణ"
ఋషియు, హిమగిరి దపమూని యిద్ధ సిద్ధి
వడసియు, శరాచలాన, ప్రపంచ హితము

పొంచె, యశము వీఁగి, మరలిన, పూజ్యుఁ డతని
మహితమతిరీతి, క్రైస్తవమతము గాదె? 95

మాన్యము, సుసామ్యయుత ముసల్మాను మతము!
అత్యుదారంబు సిక్కానుయాయి మతము!
సుకృతులగు భారతీయులే వికృతిగనరు
నీసడింపరు, గొనరరు, గాసిపడరు." 96

"ఈ లావణ్య మగణ్య మూర్తి, తగ దీ హాసాస్య నొయ్యారి గెం
గేలన్ గూర్చెడు పుణ్యవంతుఁడె, తదాకృష్టాత్మ యొమ్మచ్చుగా
నీ లీలాకృతి నీమణిన్, తరుణినిన్, హృద్యంబుగా దాల్చుఁ బో!
చాలున్ జాలు, వికారపున్ జెయివులున్, సయ్యాటలన్ బాపముల్

పడువకమ్మ! కన్గొలకు లియ్యెడ నశ్రువులన్ దొలఁకింపకమ్మ! ని
న్నాడఁడు పెండ్లి నీ కహితుఁడైన జనుం డెవఁడేని! బ్రాహ్మణుం
డాడఁ డబద్ధ మీవును సుతాయతరీతిని పోవు, మిష్టుఁడున్
దోడుగ! శత్రుమధ్యమని, దూపిలకమ్మ, భవాని తోడుగన్! 98

అని దుర్గేశ్వర నందిని
ననునయమున, బిల్చి యిచ్చె, నతఁడు, ననర్ఘం
బును, మణిహారము, గొనుమని,
వనితయు, నాశ్వాసితయయి, పజ్జకు నొదుగన్. 99

సంకెలల బాసి యటకున్
గొంకుచు, నయ్యెడనె వచ్చె, కోమలికిన్ బ్రే
మాంకితుఁడును; నిర్భర గొని
జంకకుఁడని వారిఁజేర్చె జంపతులనుగాన్. 100

'పరపురుషుల కాసపడ రెందు, భారత
తరుణులఁ జూసియు దాఱదిప్పుడు!
నన్యవిత్తములను నాశసేయుదు, భార
తీయులఁ జేరును మాయదిపుడు!
నగతిక వికలాంగు లాదృతు లీభార
తీభూమి నను తీరు దీర దిప్పుడు!
నతిధీరు, లౌదార్యమతులు, వీరులు, భార
తీయులు ననుకీర్తి, పాయదిప్పుడు!

ఇదియు తథ్యంబుగా, ధర్మ మెఱిగి, యికను
భారతీయ జన్మావని, భరతఖండ
మిదియు, భూరి పుణ్యక్షేత్ర మదుర కేగుఁ
డీరు, గోవాకు, ననిచెప్పి, వారి ననిచె. 101

తన పరిచారకుల్ గనుచు, తద్గతవృత్తికి ముక్కు లంగుళుల్
జెనకగ నబ్బురంపడిరి! శీఘ్రముగా చిమణాజి చేతయుఁ
విని, యట బాజిరాయఁడును వేడ్కవహించి, నిజాముగెల్చి సం
ధిని, బహు గౌరవోన్నత నుతిఁ, గనె! సాహసికుల్ రమాన్వితుల్!

విద్యారణ్యాఖ్యాన ఫలశ్రుతి.

భరతఖండంబు ఘటవాద్య భాతి నోసర
కుమతు లిడు బాధ తంగుతంగులనె, జనుల
భగ్నజీవికల్ స్వరరీతి బాలువోవ,
కమలె, భారతీయత, నష్టనులకిరింద. 103

దేవగిరి యడఁగంగ, పరిదేవనములు
బ్రబలె, మానవాస్థి పరంపర ల్పొడమియు

బూనె, నా శ్మశాన నిశాముఖాన నెప్పుడు
తలకొన దనిరి, శుభ విభాత ప్రసక్తి! 104

ఓరుగల్లును నడుములో నొరిగిపోవ
మిగిలె కష్టహేమంతయామినియు నకట!
లంబముల్, క్లేశ శైత్య విలంబనములు,
గ్రమ్మె! నా దీర్ఘ శార్వరికంఠసీమ! 105

కటు విమర్శకుల శుష్క ప్రలాపము వోలె,
నుగ్రాధికారుల యుక్తు లడర
శాంతి తుష్టియు లేని సత్త్వహీనుని కావ్య
సృష్టియై, జన దుఃఖశిశిర మెదుగ
ద్రోహైక దృక్కుల దుస్స్మితాస్యమురీతి,
నీరవాందోళనా సార మెసఁగ
సహృదయౌన్నత్య సంగతి నెఱుగని
పాండిత్య భణితి, దాపములు నిండ
కలఁగి, కుమిలియు. గాలు లోకమును జొచ్చి,
మరల నూత్న వసంత సమ్మాన శిష్ట
పాలన సృజించి, పోషించె, బరమపుణ్య
మహితుఁడైన విద్యారణ్య మాధవుండు! 106

అదెయదె యంచు వైరముల నారని శోకము దీర్చుచున్ బ్రజా
ముదదరసా వ్యయాశయము మూర్కొనజేసినవాఁడె కావ్య కృ
త్పదము వహింపనోపు! భరతావని సయ్యదె సంప్రదాయ మే
పదవిని గోర కిమ్మహి, సకుంఠిత శాంతినె నిల్పి వేదముల్
బాదలగ జేసె, నట్టి మునిముఖ్యుఁడు మాధవుఁడున్ మనుష్యుఁడే?

ఏకం దైవమటంచు, సర్వమతవాహి న్యత్కారం బొక్క "భ
ద్రం కర్ణేభి" రటన్న సూక్తమున, నారంభించు, సౌజన్య ని
త్యాకూటాశయ భారతీయులు; నితాంతానంద సిద్ధి స్ఫుర
ల్లోకైకార్థిత లక్ష్య మాత్మపద మాలోకింతు రెల్లప్పుడున్. 108

విద్యారణ్య చరిత సమాప్తి — మంగళము.



సర్వాంగ సుందరంబుగ
నుర్విని గీర్తిన్ సహింప, నోము రమేశుం
డర్వాచీన కృతి యిది, య
ఖర్వానందమ్ము పాఠకావలి కిడుతన్. 1

ఆచార్యత్రయ తత్త్వకూటముల, విద్యారణ్య వాగాఖ్య స
ద్ధీచీహస్త విశస్త దర్పణమునన్ దెల్లంబుగా గాంచిరా
ప్రాచీనుల్ నిగమాగమోక్తి గతికిన్ భావార్థ మూహించి యా
వాచోవల్లభుఁడైన మాధవునిచే బ్రాపించు సుశ్రేయముల్. 2

స్వార్థ పరార్థము లెడని సత్కృతి కాతఁడు బాటవైచె, ని
స్స్వార్థత మానవాభ్యుదయ పారమె! కాని, నిసర్గవృత్తి యం
దర్థములేని మాటయెకదా! యొరు లెందును, స్వార్థసిద్ధునే
ప్రార్థనజేతు, రన్యులకృపన్ గనుటెల్లయు, వ్యర్థమాటచే. 3

పోరి ముస్లిము దర్పంబు, బుట్టిముంచి
నేటి కేమఱరాకుండ నిల్పె నతఁడు
విబుధవర కామధేనువై, విశ్వవిహిత
తత్త్వ నిర్ణేత! వేదసంత్రాత! ధాత! 4

లక్ష్మణుని మూర్ఛ తెగ, మనోలాస్యగతిని
సీమ లెన్నియొ దాటి సంజీవకరణి
తేరకిడె నట్టి మారుతి తీరు, సగము
నర్థ మొసగిన "పెద్ద రామప్ప" నోము
గాత! సిరులొసంగుచు రమాకాంతుఁ డెపుడు. 5

బోధార్హేందు కృతం బిది
సాధింపఁ బడె నుపేంద్రు సద్విహితము, ను
త్సేధమునగు దయచే; ని
ర్బాధక గాయత్రి పాద భవ్యంబగుచుఁ. 6

ఓం తత్ సత్

---

సవరణలు

| పేజి | పద్యము | పంక్తి | సవరణ |
|---|---|---|---|
| 5 | 19 | 2 | నిరాకులమతి |
| 72 | 2 | 4 | జీవనద |
| 81 | 43 | 8 | సముల్లాసు |

## పంపాభారత సభాపర్వము — శుద్ధపత్రము ( ఛందస్సు )

| పుట | పద్యపాద సంఖ్యలు | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 2 | 2—7 | సద్యోపాప | సద్యః పాప |
| 5 | 19—4 | లలిత కాంతులకు | లలిత రక్త కాంతులకు |
| 14 | 60—1 | దాయలవలె | దాయలువీరన |
| 25 | 3—4 | లాకృతులఁ బవహియింప | లాకృతులెత్త |
| 25 | 4—2 | బున — నభోతలి | బన — నభస్థలి |
| 30 | 28—3 | అంపిరి | జంపిరి |
| 33 | 45—3 | ధర్మరుచిరంబులు | ధర్మగుణచర్చిత |
| 35 | 57—4 | పృథ్విరాజును బోలి | పూర్వ పృథ్విరాడ్గతిని |
| 40 | 79—2 | రవముఁ | రవము |
| 42 | 87—2 | దూర్చుచుఁ గంటు వేయు | దూర్చుచు వెంటనె గంటు వేయు |
| 49 | 7—4 | సద్యోపాపౌఘ. | సద్యః పాపౌఘ |
| 52 | 25—2 | సుసఖివర్గము | శ్రితజనావలి |
| 56 | 42—2 | లనూహ్యఘట్టముల్ | లైంద్రయ్యముల్ |
| 68 | 96—2 | హరిహరుఁడును | హరిహరుఁడంత |
| 76 | 18—2 | పతులు | నెమరు |
| 76 | 18—3 | దిరుగబడిరల్లకల్లోలపై | దిరిగిరల్లకల్లోలపై |
| 80 | 37—1 | తీరమనోజ్ఞ | తటదివ్య |
| 96 | 2—3 | విద్యారణ్య | విద్యావశ్యేశు |
| 96 | 3—2 | ధన్యులెవరో | బుణ్యులెవరో |

# శ్రీ మాధవ విద్యారణ్య చరితము
# వెన్నుడి

1. శ్రీ కల్యాణ కల్పతరువగు భారతఖండము, ప్రాచ్యమునను, గిరిశ (గ్రీసు) ఖండము పశ్చిమమునను, మానవ నాగరికతకు మాన్యములైనవి. హిమపాత యుగంబునుండి యొకటియు, క్రీస్తు పూర్వమునుండి రెండవదియు, ప్రశస్తి నొందినవి. ఒకటి యాత్మజ్ఞానమునకు, రెండవది లౌకిక సమాజ వికాసమునకు పేరు వడసినవిగదా యని యనుకొనుచున్న 1945 లో నొక నాటి కలలో హిట్లరు కనపడినాడు. ఆ సందర్భములో నప్రయత్నముగా నొక గేయముకూడా నా లేఖినినుండి వెలువడినది. అదేదనగా

"కాల కాలునీ
ఫాలనేత్రమున
కీలలు వ్రాలెనవే ॥ప॥

కాలరథోత్థిత, ధూళిధ్వజానీ, కోలాహలము లవే!
స్టాలిన్, హిట్లర్, ముస్సొలినివీరుల నీలచ్ఛాయ లవే!
కాలాంబుదముల వాలు దొంతరల, కూటవ్యూహము లవే!
పాలిక, సస్యసు, కూలములోరయని వ్యర్థకాంతు లవే!
శ్రీ లలితంబులు శాంతిశీలముల చెన్నే లేనివవే! ॥కాల॥

2. అనతికాలముననే 'శ్రీ శ్రీ' వారి మహాప్రస్థానము చదివినది మొదలది మత్స్యయంత్రమువలె నాలుకపైన కరగిపోయినది. కవితాది వీధులలో కడు దూరము పరువులెత్తిన జగన్నాథ రథ చక్రాలు మలుగుపడి తత్ప్రతిధ్వనులు, నాకు శ్రవోలంకారములైనవి. ఆతరువాత మంత్రాలయము దగ్గర కేగి చూచుచుండ, వెనుకటి, 'నిన్నలు' విరిగిపోయి 'అగ్నిజ్వాలలు' లేచుచుండినవి. 1957వరకు నాకున్న సర్కారు నౌకరి యలజడిలో, వీని నప్పుడప్పుడు జూచుచుంటినేకాని కలము పైకెత్త సలవియే కాలేదు. 1958లో, అజ్ఞాతవాసము

అశోకచరిత్రముతో నంతరింప, చెన్నను సంమకొంటిని. మరల భారతీయ గతోన్నతి జ్ఞాపకమునకు దక్కినది.

3. సర్వతోముఖమై, ఆత్మవికాస మానశ్వరానంద మందుకొనుటతో పరమావధి నందుకొనునని భారతీయులు నమ్మిరి. లౌకికములోనే ప్రాకృతిక సౌఖ్యముల, కళావిన్యాసముతో నుచ్ఛస్థాయి కెక్కించి, సమాజమును రాజకీయముగ, సకల భోగములతో సంస్కరించుటయు సర్వాభిగమ్యమని గ్రీసు వారు విశ్వసించిరి. అట్లే వారివారి సామ్రాజ్యములు విస్తరించెను. ఆధ్యాత్మికముగా, పదవీ విభేదాత్మకముగా వారివారి సంఘ వ్యవస్థలు నెదిగినవి. క్రిటుదీవుల, అసురుల, ఐగుప్తుల నాగరికత లప్పటికే కాలయవనికచే కప్పబడి యుండినందున పాశ్చాత్యుల అధీనియనుల ప్రాబల్యములు, పెంపు వడసినవి. యజ్ఞ తాంత్రిక క్రియలను, నాస్తికవేదుల కన్యోన్య సంఘర్షణ ముదయించి, యుపనిషత్తులు, విచారాకాశమున తారకలైనవి. ఆ వివాదాంధకార మధ్యమున, నుపనిషత్తారామండలమును వెలయించుచు శ్రీ గౌతమబుద్ధుడు నిర్వాణ జ్యోత్స్నను వెదజల్లినాడు. అశోకుడాతని మధ్యమార్గమును జేపట్టి, శాంతిసందేశమును విశ్వమునకే, శిలోచ్చధ్వనితో వినిపించినాడు. ఆ ఘోషలు గ్రీసువరకు ప్రాకగా, సోక్రటీస్, ప్లేటో మున్నగు మేధావులు వానిని వ్యాఖ్యానించినారు. ఇట్లుండ శంకరుడు బ్రహ్మసూత్ర సమన్వయము చేయ దివిరెను. పతంజలి, నారదుని భక్తిసూత్రములకు, యోగశక్తిని దాపించి యుద్ధరించినాడు, అరిస్టాటిలుతో తరలివచ్చి, యలెగ్జాండరు, ప్రత్యక్షముగనే భారతీయులతో సంప్రతించి, భారతజ్ఞానభాండాగారములందలి తత్త్వధనమును చూఱగొన్నాడు. మరల, గుప్తుల సామ్రాజ్యము తలయెత్తినది. అద్వైతము, శూన్య విజ్ఞానమై, భోగములు, ధర్మ మూలములుగాక పాపమూలములైనవి. మానవుని జీవాత్మయే భగవదాలయమనియు, హృదయమే భగవదారాధన మండపమనియు, సత్యవిశ్వాసము సన్నగిల్లినందున, తాంత్రిక విగ్రహాది సాధన

పద్ధతు లెప్పటివైనను, సత్యాంశములగుటచే, మతదూషణ, విద్వేషణ కలహ ములు పెరుగలేదు కాని, పూర్ణసత్యము వెనుకకు బడిపోయినది. పతంజలి ఘోషించిన పూర్ణసందేశమును, హిమగిరి గుహాలలో, నవగాహనమయిపోగా, ప్రభువు క్రీస్తువు దానిని, యోగబల సముద్భూతమగు పునరుత్థాన ప్రదర్శనముతో పాశ్చాత్యులకు బ్రసాదించినాడు. కాని లౌకికానంద ప్రఫుల్లతలో, నా యాధ్యాత్మిక పథము మృగ్యమైపోయినది. అంతలో శాతవాహనుల కాల మంత రించి, యవనులదాడిచే భారత మడికిపోయినది. మూఢాచార పరంపరాంధకా రావృతమగు సత్యాంశజ్యోతి, ఆ మహోపద్రవ ఝంఝూమారుతములో, కదలికదలి, యారిపోవునేమో యనిపించినది. అట్టివేళలో శ్రీ రామానుజ మధ్వాచార్యులు, పతంజలి వ్యాస భావజ్యోతులను కొడి నుడిగించి, కాంతి మంతములుగ పైకెత్తిరి. ఆజ్యోతుల కాధారములగు, వేదముల నుద్ధరించి శ్రీ విద్యారణ్యులు, తత్త్వార్థ తైలమును శాశ్వతముగ నిలువజేసిరి.

4. ఆ ధర్మగ్లానియగు కాలమున, కాకతీయుల బలము విచ్ఛిత్తినంద, సామంతుడుగనున్న సంగమునితో బాటు మాధవాచార్యులు పంపాతీరము నకు బయనించిరి. సంగముని కొడుకులగు, హక్క బుక్కరాయలుకూడ వెం టికే వచ్చి, రామనాథ ప్రతాపరాయలకు (ఆనెగొంది కుంతలేశ్వరునకు) నల్లుర లైరి. మాయణుని పుత్రులు, విద్వాంసులయ్యును, భోగదూరమగు దారి ద్ర్యముతో బాధపడిరి. అయినను కంచిలోని శంకరాజ్ఞ విష్ణువు మున్నగు పండి తులకడ విద్వాంసతను బడసిరి. శ్రీ మాధవ సాయణ భోగనాథులు ముగ్గురును విబుధాగ్రణులే. కాని మాధవుడు తపస్వి — సంసారి, కావున లక్ష్మీ సాక్షాత్కృతికి బ్రయత్నించెను. ఆ భువనేశ్వరియు నాతనిని, సన్యాసి కానిచో ననుగ్రహింప ననెను. అది యాతని కిష్టములేదు. కాని కర్మాను భవము తప్పనిదై, యాతనికి సకాలమున నాశ్రమసిద్ధి లభించి, భరతఖండము పునీతమయ్యెను. శ్రీ బుద్ధభగవానునకు వలెనే శ్రీ మాధవ విద్యారణ్యునకును

నిర్వాణమే పరమలక్ష్యము. ప్రపంచమును, లేనిదని, వారనలేదు. ఉన్నంత వరకును సత్యమేయని తేర్చిరి. మాయాశబ్దమును లక్ష్మి (ప్రకృతి) పరముగ నన్వయించి, మాధవుడు, సత్కర్మ ధర్మానుష్ఠానములకు, నావశ్యకతను విధించెను. కాని, దుర్మనస్సు, దుర్వాసన, వర్జ్యము లనెను. మనుష్యుడు, తోడి మానవునితో పాదస్పర్శ నొందుట హేయమని మానవస్వ ఘనతను నాతడు నిరూపించెను. అంతియకాక, నైష్ఠికతకు సౌహార్దమునకు, సర్వదర్శన సమాదరణకు, తన జీవితమునే దృష్టాంతముగ నొసర్చి, భారతీయౌన్నతికి, నాధ్యాత్మిక రక్షణమునకు, జాలిన, యొక విశాల సామ్రాజ్యమునకే, పునాదులు గట్టి, విద్యారణ్యుడు తన యవతారమును జాలించెను.

5. ఒకనాడు, శ్రీ కోన వేంకటరాయశర్మగారి వ్యాసరాజమును జూచుట తటస్థించెను. అప్పుడే చదువుకొనుచున్న బాజీరాయ చరిత్రలోని బ్రహ్మేంద్రయతి కథకుడుగానున్న బాగుండునని తోచినది. విజయనగర సామ్రాజ్యకథను, వేంకటపతిరాయలవరకు పంపాభారత మనుపేర వ్రాయ నుత్సహించి, విలంబి యాశ్వీజాంతమునకు సభాపర్వమును ముగించితిని. శ్రీ విద్యారణ్యుల యుపదేశము లాధునికుల కన్వయించునట్లు వైజయంతీమాలగా వచనమున నిమిడ్చితిని, ప్రసిద్ధములైనవి మూడు విప్లవము లనియును, పరాసు విప్లవములో స్వాతంత్ర్యము మాత్రము లభించినదనియును, రష్యా విప్లవములో వ్యక్తి స్వాతంత్ర్యములేని సమానతమాత్రమే పరిణతమయ్యెననియు, భారత విప్లవములో ఫలిత మింకను సరిగా నేర్పడకపోయినను, సౌభ్రాతృత్వమే లక్ష్యమనియు, నిష్కపట సౌభ్రాతృత్వ వ్యక్తివికాసము లలవరించు స్వాతంత్ర్యముతోడి స్వరాజ్యములో నభ్యుదయ సౌఖ్య సౌకర్యముల నందరికి నొకే పరిపాటిగా సమకూర్చుటలోనే, సమానత రూపుదాల్చుననియు నెన్ని, నా యాశయములను గేయములుగా సంతరించితిని.

6. ఇంతలో కడపనుండి, శ్రీ బి. రంగనాథము బి.ఏ.,బి.యల్., గారి

వలన సన్మానాహ్వాన మందినది. శబ్దార్థములు స్వాధీనము చేసికొంటినని యెలుగెత్తి చాటి, సరస్వతీ పుత్రులు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు నన్ను సన్మానసభలో గౌరవించిరి. సభానంతరము, పరస్పరగోష్ఠిలో, వారు విజయనగర సామ్రాజ్య చరిత్రమును కావ్యముగా వ్రాయుదునని వాకొనిరి. అంత వారు వ్రాయుదానిని నేనును వ్రాయుట, తగరుకొండను డీకొనుటయగు నేమోయని తలంచితిని. వెనుకటి యాంధ్ర వాఙ్మయచరిత్ర సంగ్రహ రచనోదంతము నా కపుడు సినీమారీల వలె స్మృతికి తట్టినది. 1953 సంవత్సరములో శ్రీ వేంకటేశ్వరులవారు నెల్లూరికి వచ్చియుండగా, ప్రథమ ముద్రణ ప్రతులు లైపోయిన వెంటనే యొక వేయిరూప్యములు బహూకరింతుమని 1934లో నోటితో జెప్పిన మాటను ప్రస్తావించి, శ్రీ చిలుకూరి నారాయణరావుగారి సాక్ష్యముతో దైవమెదుట దావా తెచ్చుట బాగేమోయని యంటిని. వారు నవ్విరి. బహూకృతి పంపెదను, సవరణలున్న చేయుండనిరి. కాని యచిర కాలములోనే మఱుగైరి. కష్టపడి పంపాభారతము పూర్తిగా రచించినను, నాచేతిలో ద్రవ్య మెచ్చటినుండి వచ్చునని కావ్యరచన మంతటితో నిల్పితిని. "వాఙ్మయచరిత్ర సంగ్రహమును విపులీకరింపుడు. వ్రాయుసగానికి, అచ్చునకు, మేమే అచ్చుకొందు"మని శ్రీ కల్లూరు సుబ్బారావుగారు మరలమరల నానతిచ్చిరి కాన నాపనియే సేత, మేలనుకొంటిని. కాని దేనికిని, దైవకృపయు గాలమును కలిసివచ్చినగదా, వాగ్దానములు, సంకల్పములు, ఋజువులగును?

7. ఒక్క సందేహము మాత్రము నన్ను బాధించుచుండెను. జనశ్రుతిలో, శ్రీ మాధవాచార్యుడు, సంసారిగనుండియే సన్యసించెనని వినవచ్చుచున్నది. కన్నడిగులు, కొంద ఱతనిని, అజన్మ సన్యాసియని వర్ణించిరి. సంసారియను నైతిహ్య మొక యాంధ్రోపవాచకములో కనుగొంటిని. ఆతని కళత్రము వీతిహోత్రయని యందుండెను. వీతిహోత్రాఖ్య నాపాఠమునుండియే గ్రహించితిని. కాని నిజమేమో యనుకొనుచు, కార్యాంతరార్థమై, బెంగు

కూరున కేగి శ్రీ పాణ్యం సుందరశాస్త్రులను సందర్శించితిని. వారు చారిత్రక పరిశోధకులు, కర్ణాటాంధ్రవిద్వాంసులు, శ్రీ జగద్గురు శృంగేరిపీఠమున కంకితులగు శ్రోత్రియ శిరోమణులు నగుటచే నా సంశయమును వారి కెఱుకపఱచితిని. వారు నవ్వి, ఆద్యులగు సురేశ్వరాచార్యులు సంసారిగ నుండియేకదా సన్యసించిరని నన్నడుగుచు, తాము చాల కాలముక్రిందట మద్రాసులోని ఓరియంటల్ లైబ్రరీ ఆఫీసులో నున్నపుడు సేకరించి, కాపీ వ్రాసియుంచిన, "శ్రీ విద్యారణ్యులవారి కైఫీయతు" అనుదాని నాలోకింపుడనిరి. శ్రీ మాధవాచార్యులు సంసారిగనుండి, యాపిదపనే యతులైరనియు నుడివిరి. అంతటితో నా సందేహము తీరినది.

౮. ఈకృతి వ్రాయుటకు తోడ్పడిన, శ్రీ కోన వేంకటరాయశర్మ గారి వ్యాసమునకు, రాచకొండ అన్నయ్యశాస్త్రి గారి బాజీరాయ చరిత్రమునకు శ్రీ భట్టాచార్యులవారి "Indian Cavalcade" గ్రంథమునకు కృతజ్ఞతాంజలు లెత్తువాడను.

౯. పోర్చుగీసు చర్యలకు 'బాజీరాయ చరిత్రము'ను, 'Indian-Cavalcade' ను ఆధారములు. శ్రీ భట్టాచార్యుల కృతిలో 'Pirates of-Arakan' అను శీర్షిక క్రిందనుండు పంక్తులు కొన్ని మాత్రమే పఠితల కిచ్చుట పొందుపఱచితిని:

"Often the joyous smile of a bride, turned to stark horror as she was snatched away.........They ( Feringhees ) carried off, Hindus and Muslims, male and female, few and many, pierced the palms of their hands, passed canes through the holes and threw them one above another under the deck of their ships.........Many high born persons, were compelled to undergo the disgrace of slavery or concubine these wicked men............Bernier writes; The pirates boast that they make more Christians in a twelve month. than all the missioneries of Indies do, in ten years.

A strange mode, this of propagating holy religion by the constant violation of its most sacred precepts."

10. "బుడుతకీచులను, మహారాష్ట్రులు ఫరంగీలని వ్యవహరించిరి. వారు, కథోలిక్కు మతప్రచారణ సమాజమును స్థాపించిరి. ఈ సమాజములోని వారందఱు ఫాదిరీలు. ఈ ఫాదిరీలు పోర్చుగీసాధికృత ప్రదేశవాసులను, తమ మత మవలంబింపవలసినదని, బలాత్కరింప జొచ్చిరి. స్వమతము త్యజింప నొల్లనివారిని బంధించి, కారాగారమున నునుచుటయు, అశ్నోదకములను బలాత్కారముగ వారినోట నిడుటయు, బ్రతికియుండగనే వారిని, ప్రజ్వలితాగ్నిజ్వాలల బడద్రోయుటయు, మొదలగు దుష్కృత్యముల పాలు గావించి, మిక్కుటముగ బాధింప మొదలిడిరి. ఆ కాలములో బుడుతకీచు రాక్షసులొనర్చిన క్రూరకృత్యములు, తదితర మతప్రచారకు లెరుగను, అంతకుముందు గాని, వెనుక గాని, సల్పియుండలేదు. ఈ మతప్రచారకులు హిందూ ముసల్మానను వివక్షత బరికింపక, యిరువురియెడ, సమత్వమువహించి యిరువురకును, సమానోపద్రవము బ్రతిఘటించుచుండిరి" అని బాజీరాయని చరిత్రమున, శ్రీ అన్నయ్యశాస్త్రిగారు నుడివిరి.

11. గోవాను స్వయముగా బట్టుకొనిరన్న వీరకీర్తికి బడగెత్తిన శ్రీ విద్యారణ్యులవారి ప్రేరణచే గాబోలు, బ్రహ్మేంద్రయతి, బాజీరాయని, గోవావారి దురంతముల నాపుటకు, ప్రోత్సహించెను. ఆకథ నానుషంగికముగా నిందు చేర్చుటలోని బాజీరాయుని బాంధవ్యమెందుకను వారిచే నేను క్షంతవ్యుడనే. ఈ నాకృతిని, ముందుగా, నాతో సహాధ్యాయులుగ నుండిన శ్రీ జి. వేంకటాచలము (కథక చక్రవర్తి)గారికని, 1924లో రాజమండ్రిలో సహాధ్యాయులుగనుండి "నీవు కవిసార్వభౌముండవు గదు"వని, వెక్కిరింపునకో, యథార్థముగనో, నా యహల్యా సహ్యసాత్తి యను నాటకమును జదివి నుడివిన శ్రీ వేంకటరత్నముగారికి నభిప్రాయార్థము పంప నుద్యమించితిని, గాని, వారి చిరునామాలు తెలియలేమి నూరకుంటిని. భారతీయ భౌద్ధలక్ష్యములు రెండును

నుపనిషజ్జన్యము లగుటచే, శ్రీ విద్యారణ్యులవారి జీవన్ముక్తి వివేకములోని సందేశము, అశోకుని సందేశము నొక్కటియె, యించుమించుగా నని, యను కొంటిని. కాని సంధ్యోపాసన యొకటి, భారత సాంప్రదాయమునకు విశిష్ట లక్షణమని దాని నిందు జతపఱచితిని. ఈ రెండును కావ్యాతిక్రమణము అను వారు నన్ను మన్నింతురుగాత!

12. నా కన్నడ పంపాభారత దృశ్యాను లను ఖండకృతికి జేయూత నొసంగ యత్నించిన, మైసూరు విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షులగు శ్రీ కె. సుబ్బరామప్పగారికిని, గ్రంథములోని తప్పులను నాకప్పజెప్పిన దయాళురు శ్రీ బెళ్ళూరి శ్రీనివాసమూర్తిగారికిని, నా నమోవాకము లర్పించువాఁడను. అచ్చు వేయు కాలమున, 1959 ఫిబ్రవరి వరకు నాజీవితమున కార్థికముగ దోడ్పడిన కీ॥ శే॥ శ్రీ సత్రసాల సుబ్బయ్యశ్రేష్ఠిగారి కీర్వరుఁ డాత్మశాంతి నిచ్చుగాత! గ్రంథముద్రణ వ్యయము సరిపుచ్చుకొనుటకు శ్రీ ముల్లంగి నీలకంఠప్పగారితో ఒక నూరిప్పించి అశోకచరిత్ర లమ్మించియు సాయపడిన శ్రీ ఎ. వేంకటస్వామి నాయుడుగారికిని, వారిమిత్రులు శ్రీ బాలయ్యనాయుడుగారికిని కృతజ్ఞతతో చేతులెత్తువాఁడను. కవిసన్మానము నాకు గల్పించిన శ్రీ బి. రంగనాథముగారికి ధన్యవాదము లర్పించువాఁడను. సాధన ముద్రణాలయములో నిరంతర మాప కతో అచ్చును జేకూర్చిన శ్రీ గోపాలాచార్యులకును, సమయమునకు కాగితము లెదిగించిన "H.S. Rao Sons" వారికి నమస్కరించువాఁడను. మున్నుడి, కావ్యసమీక్షలు వ్రాసియిచ్చిన, కవితల్లజులకు కైమోడ్పులు. ప్రతులు వ్రాసి యిచ్చిన చి॥ సి. వి రామరావు, జి. కోనేరిరావుగారి కాశీస్సులు.

సుధీ విధేయుఁడు,

విలంబి—శిశిరము
అనంతపురము

బోధాశ్లేందు, కవిత్వవేది,
వి. యస్. ఆర్, కల్లూర్.

# కావ్యసమీక్ష

( విద్వాన్, మధురకవి; శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి )

(1) అశోకచరిత్ర రచించి పద్యకవితా సారస్వతమున శ్రీ కల్లూరు వేంకటనారాయణరావుగారు విశిష్టమైన తమ స్థానమును సుస్థిరమొనర్చుకొనిరి. మరల ననతికాలముననే వీరి సాహిత్యోద్యానమునఁ బూచిన నవలతిక "శ్రీ విద్యారణ్య చరిత్రము" — తెలుఁగువారు తమ యదృష్టము పండించికొని గాదెనింపిన ధాన్యమే! వీరి అశోకచరిత్ర ప్రబంధము నవీనయుగమున నేకవియు నందికొన నేరని నిర్మాణభాగ్యమునడసిన రచనావిధానము! ప్రస్తుత మీ విద్యారణ్యకృతి వెనుకటి నియమములు చాలవరకు సడలించుకొని సహజ నిష్యందియైన రస భావస్ఫూర్తితో నడచినది.

(2) ఈ విద్యారణ్య చరిత్రము పంపాభారతము – సభాపర్వము అను పేర అష్టోత్తర శత పద్యమాలికా పరిమితములైన అయిదు ఖండములుగ కూర్పబడినది.

(3) ఈ కవిగారికి తాత్త్వికదృష్టి ఉగ్గుపాలతో పోసినది. చరిత్రను ఆధ్యాత్మికభావముతో మేళవించి సర్వాంగ సుందర మొనర్చిరి. పతిత భారతోద్ధరణమున, విద్యారణ్యస్వామి తపస్సు ఈకృతి స్వరూపమెత్తినది. భారత యోగిపుంగవులకు రాజకీయదృష్టి లోకజ్ఞత అపారమనుటకు నిదర్శనము లెన్నియో గలవు. విద్యారణ్యస్వామి, హరిహరబుక్కరాయలు — ఈపాత్రలీకథలో ప్రధానస్రష్టలు. ఏ పాత్రపోషణము కొఱవడినా కావ్యసృష్టికి అంతరాయము. కాఁగా కవి సర్వతోముఖ శేముషిగలిగి ఈ పాత్రల పోషించుటలో విజయకేతన మెత్తినాడు. కథానాయకుడైన మాధవర్షి ప్రధాన పాత్ర. ఈపాత్ర పోషించుటలో కవి యెత్తికొన్న సన్నివేశములు, పోయిన

పోకడలు, అన్నియు శిరోధార్యములు. ఎడారిలోని నీటిబుగ్గవలె కేవల చరిత్రాంశమునకు దోహదప్రాయములై కావ్యమున సజీవ సౌందర్యజాలియున్నవి. పాత్ర నిర్వహణమున కవిగారి ప్రతిభకంటె, వ్యుత్పత్తి రాశీభూతమై తోడై నిలిచినది. విద్యారణ్య పాత్రపోషణమునందలి విజయము సర్వతోముఖముగ కథకు పుష్టినిచ్చుచున్నది. శ్రీ మాధవాచార్యుని 'ఒక్కరో బాచర్య' యాధారముగా కథాసరణి సాగినది. ఏ యల్ప కారణమో ఉత్తరోత్తరము మహా కార్యసిద్ధికి తోడగుచుండునట మహాత్ముల జీవితము నాశ్రయించిన పరమ రహస్యము. ఆచార్యుఁ డొకనాడు హంపి ప్రాంతమున ఆకుల నిమిత్తము అనుజానితో వటవృక్షముకడకు చనుట — తదనంతర వృత్తాంతమున కాధారమైనది. “వింతలవురా సర్వం సహా దృశ్యముల్” అని కవిగారు ప్రకృతి గాంభీర్యము తలచి ప్రశంసించుచునే యున్నారు. మాధవమహర్షి “సజ్జన మనః ప్రాణ విభుడు” ‘సత్యక్షమలుఁ దపోనిరతి త్యాగము లాతని రూపు గైకొన్నవి.” పైగా ఆశ్రితవత్సలుఁ డాతడు! “క్రొత్తవగు నర్థము లూరించెడి కాలము ననుసరించి ‘వేద విధానముల్ సమసె” నని యాతని నిట్టూర్పు! తుదకు హరిహర బుక్క రాయల విజయనగర సంస్థాప నోద్యమమునకు ప్రేరేచి కృతకృత్యుఁ డైనాడు.

(4) విద్యారణ్యచరిత్రము, కావ్యముగ నింత విపులముగ నే తెలుగు కవియు రచించి యింతవరకు ప్రకటింపలేదేమో! ఈ నిర్మల యశస్సుకూడ వీరికే దక్కినది. విద్యారణ్యపాత్ర చిత్రించుటలో కవిగారికి ఒకవంక ఆధ్యాత్మిక సమున్నతి — ఒకవంక దేశ ధర్మానురక్తి, ద్విధాభూతమైన ఈశక్తి కొనియాడ దగినది. “మనోవిభుజీవనాడి” యైన ధర్మపత్ని “నాకుగానె లోకాంతముదాక పర్వ సుకృతంబు త్యజించువాఁడవే” అని, యతనిని స్వకర్మోన్ముఖుని గావించినది!

(5) ఆదిఖండమునందే మధు[illegible]సవర్ణనము[illegible]భా[illegible]పటిమతో రమ్యముగ నున్నది. సామాన్యకవులకు [illegible]క్కని తలఁపులు

కవి మూర్తి గట్టించినాడు. భావికథాగమనమునకు ఈ వర్ణనము దోహద
మిచ్చుచు చక్కని యౌచితిని పోషించుచున్నది. ఇందు జాతీయ జీవన మాధు
ర్యము రమ్యాతిరమ్యముగ సాగినది.

"వికృతి శిలార్పకన్ నెమరువేయుచు, నృపశేఖరులట్లు" వృక్షచ్ఛాయ
నాశ్రయించి పరుండిన గోవులు వృషభములు వర్ణింపబడిన పద్యము, "పెరు
గమ్మంగ బోయి నిదాఘ తాపమున సోలి "పల్లెపాటల పరమాప్త భావరస
మూర్చెడి సోయగపుం జవరాండ్ర" సృష్టించిన పద్యము — వీరి భావ మాధురికి
చక్కని యుదాహరణములు. సామాన్య ప్రజాజీవితము కవి దృష్టిలోఁ బడి
కమనీయ మనిపించినది. ఇంకను నిట్టి వెన్నియో గలవు. తృతీయఖండమున
హరిహరుని వేట వర్ణింపబడినది. ఇట నిశితమైన నిసర్గమైన కవిదృష్టి సరసమై
ప్రవహించినది. విద్యానగర నిర్మాణవర్గమునకు చెందిన పద్యములు సత్యదూర
ములు గావు. కవిగారికి సమతావాదదృష్టి లేకపోలేదు. ప్రాచీనకవులైన
వాల్మీకి మొదలు దీనప్రాణి దృష్టిలేని యుత్తమకవియే విశ్వసారస్వతమున
లేడేమో! ఈ కవియు—

'వెరవారగ సుస్థిర పాలనంబునన్
జేసెదుపట్టుకై జనులు చింతిలకుండగ బ్రోవగావలెన్"

అని ప్రజాక్షేమంకర రాజ్యపద్ధతినిగూర్చి నుడువుచున్నాడు. "రెడ్లు, ఉదయ
గిరి రవితేజు"లట! ఈమాట నాడెంత వాస్తవమో నేడంత సత్య సన్నిహితము.
ఈ కవివరునకు ప్రకృతి తత్త్వ పరిశోధనమున నిశితప్రజ్ఞ గలదు. ఒక్కచో
"కాలవశులు సర్వులు, కాలమె పక్వంబుసేయు కాగల పనులన్" అని దివ్య
చక్షువులతో ప్రకృతిని దర్శించుచున్నాడు. కాలమే కావ్యగుణమును గూడ
పక్వము సేయునది.

(6) కథాంతర్గతమైన ఉదాత్త వస్తు ప్రదర్శనమునకు ఈ రచనలో
తృతీయఖండమెట్లో, ఉత్తమ కవితాసిద్ధికి చతుర్థఖండము తార్కాణమై
నిలిచినది. ఒక్కొక్క రసము నావిష్కరించునపుడు ఒక్కొక్క కవికి

ఎక్కడలేని యీవేశము! శృంగేరి దర్శనసందర్భమున కూర్పబడిన గీతములు, వాని ననుసరించి సాగిన మత్తేభవృత్తములు సామాన్య కవితాప్రసారములుకావు. "అదె శృంగేరి" — అని ప్రారంభమగు పద్యముల చదివినపుడెల్ల పాఠకునకు తన్మయీభావము కలుగకపోదు. రసభావములకుఁ దగిన శబ్దశిల్పము నిందు దివ్యరూపమున సాక్షాత్కరించినది. రచనలో చరమభాగము రసికజనోపభోగ్యమై కవి భాగధేయమై వెలువడినది. (చూ॥ అంతయు దానవై)

(7) కథా కథనము హృదయాకర్షకముగ సునాయాసముగ కవి సాగించినాడు. జంబుకేశ్వరాస్తమయఘట్ట మంతము కథాశైలికి చక్కని యుదాహృతి. వీరి శబ్దజాలము వీరునడపు శైలికి తగినది. చారిత్రక సత్యమునకు కళాసంపదగూర్చి కథ నడపుటలో, కవి శక్తి తర్వాతి యధ్యాయములలో ద్యోతకము.

(8) ప్రాచీనులకు నవ్యులకు నిత్య సంఘర్షణము సాహిత్యమార్గమున జరుగుచున్న ఈ కాలమున, ఈరచన ఇరుతెగలకు చక్కని సమాధాన మిచ్చినది. ఇందలి వస్తు కవిత్వములు రెండును ఈమాటకు దృష్టాంతములు. చరమ ఖండమున వటువులర్థింపగా వేద సన్నిభమైన, సంధ్యావందన విధి, గాయత్రీ జపవిధానము, జలాభిమంత్రణ సూర్యోపాసనాది విశేషవిషయములు—బ్రహ్మమునిచే వివరింపబడినట్లు కవి, ఆర్షజీవన పరమార్థమంతయు నుడివి కావ్యనామమునకు సార్థకము కలిగించిరి. "బోధార్కేందు" విరచితమైన యీ కృతి రచనాపద్ధతిలో ప్రాచీనకవి మార్గమే శరణ్యమైనా, నవీనయుగ సంస్కృతి భాసించిన ఘట్టముల పెక్కులు కలవు. ఇహ పరముల రెంటిని సాధించుట కనువైనరీతి, సార్వజనీనమై, వీరి లేఖిని వెలువరచిన, యీ సత్కావ్యము, సహృదయ హృదయ కేదారముల పండించుగాక!

కల్యాణనగరము
1—3—1959

బెళ్లారి శ్రీనివాసమూర్తి